# కథల వరస

# 1. అయ్యో, ఒక్కరయినా చెప్పలేదు!

అమెరికా వెళ్లడానికి ఆయత్తమవుతున్నాను. కనిపించిన ప్రతివారూ సలహాలు ఇవ్వడం మొదలెట్టారు.

ఒక మహావీర దేశభక్తుడి వచనాలు, "ఇదుగో చూడు. నువ్వు పరదేశం వెళ్తున్నావు. అంటే నువ్వక్కడ మనదేశపు అనధికార ప్రతినిధివి అన్నమాట. గాంధీ గారి వారసురాలినని మరువకు."

"ఏ గాంధీ?" అన్నాను భక్తిప్రమత్తులతో. ఎందుకంటే నాకింకా ఇందిరాగాంధీ ఎమర్జెన్సీ రోజులు మనసులో మెదులుతున్నాయి.

ఆ మ.వీ. దేశభక్తుడు నావేపు అసహ్యంగా చూసి విసురుగా చేతులూపుకుంటూ వెళ్లిపోయాడు.

నాకు లెక్కల్లో డిగ్రీ వుంది. చిన్నచిన్నతప్పుల్తో పైథాగరస్ సిద్ధాంతంమీద చిన్న ఉపన్యాసం ఇవ్వగలను. అంతకంటె ఓ చూపువాసి తక్కువగా ఐన్‌స్టీన్‌గురించి కూడా మాటాడగలనేమో. కానీ శంకరుడిగురించో పాణిణిగురించో అడిగితే కటకటలాడాలి.

హడావుడిగా లైబ్రరీకి వెళ్లి ఓ కట్ట వుస్తకాలు తెచ్చేను - మహాత్మా గాంధీ, ఇందిరాగాంధీ, అరబిందో, గురు మహరాజ్ జీ, బాబాలూ, కోబ్రాలూ, హిందూమతం, ఎలిఫెంటా కేవులు, మీనాక్షి ఆలయం, బృందావన్ గార్డెనులు - ఒకటేమిటి కనిపించిన ప్రతివిషయంమీదా ఓ పుస్తకం తీసేసుకున్నాను.

ఇంకా అమెరికా వెళ్లి, అమూల్యమైన అభిప్రాయాలతోనూ, అనన్యసామాన్యమైన వస్తుసంచయంతోనూ తిరిగొచ్చిన వారిని కూడా సంప్రదించేను. వాళ్లందరూ కూడా అప్రతిహతమైన సలహాలే ఇచ్చేరు.

ఉదాహరణకి:

“నువ్వు నువ్వే. గుడ్డిగా వాళ్లని అనుకరించి మనజాతికి తలవొంపులు తేకు.”

“నువ్వు తప్పనిసరిగా గుర్తు పెట్టుకోవలసిన విషయం రోములో రోమనుడివలే మనవలె.”

“నూలుచీరెలు పుష్కలంగా పట్టుకెళ్లు. అక్కడ నూలుబట్టల ధరలు మండిపోతున్నాయిట.”

“చీరెలు పట్టుకెళ్లకు. అక్కడెవరూ చీరెలు కట్టుకోరు.”

“అమెరికనులు individualistic.”

“అమెరికనులు Self-reliant.”

“అమెరికనులు చిత్తశుద్ధి గలవారు.”

“ఓహో అమెరికా! అదొక భూతలస్వర్గం. డాలర్లంటే రోడ్డుమీద చిత్తుకాయితాలే అనుకో.”

“అక్కడ అమ్మాయిలందరూ అందమైన బాపూబొమ్మలే. నాకో డేటు సంపాదించిపెట్టరాదూ?” మా తమ్ముడి స్నేహితుడు సన్నగా నసిగేడు.

మరో మేనగోడలు రహస్యంగా, బాంబే ఫేషన్ పత్రికలో ప్రకటించిన లేటెస్టు ఫేషను నైలాన్ పాంటీలు ఓ రెండు పేకట్లు పంపమంది నేను అమెరికాలో దిగ్గానే.

ఇంకా ఫోర్కు ఎలా పట్టుకోవాలో, ఎప్పుడు థాంక్యూ చెప్పాలో, ఏ కారు కొనాలో, ఏ టూత్‌పేస్టు వాడాలో ..లాటివిషయాల్లో ఎనలేని సలహాలు ఉచితంగా వచ్చేసేయి వెల్లువలయి.

ooo

ఆఖరికి నేను న్యూయార్కులో దిగేను సగం నిండిన సూట్‌కేసుతోనూ, పచ్చళ్లూ, పొళ్లూ పూరాగా నిండిన చేతిసంచీతోను. కష్టములవారు నన్ను

మతిమాలినదానినిగా గుర్తించి వుంటే, ఆ మాట నాకు తెలీకుండా జాగ్రత్త పడ్డారు.

వారం రోజులపాటు తినడం, పడుకోడం, తినడం, పడుకోడం కార్యక్రమం అయిన తరవాత, ఓ రోజు ఉదయమే తెలివొచ్చింది.

మేలుకొని, కళ్లు తెరిచి, వొళ్లు విరుచుకుంటూ కిటికీలోంచి చూశాను.

శీతాకాలపు తొలి మంచు సుతారంగా కురుస్తోంది!

ఆహ్! నాజీవితంలో తొలి హిమతుంపరలు!

హెూ హెూ హెూ నాడెందము ఆనందమందిరమయి, నందనవనమయి నందివర్ధనాలు విరగబూసింది.

తెల్లనిమంచు దూదిపింజల్లా గాలిలో విలాసంగా తేలి, సుతారంగా చెట్టుకొమ్మలమీదా, ఇళ్లమీదా, కారులమీదా వాలుతున్నాయి.

గుప్పమని హృదయములో ఉత్సాహం ఉరకలు వేసింది.

లేచి, గబగబా మొహం కడుక్కుని, కాఫీ తాగి, కోటూ, బూటూ, మఫ్లరూ, టోపీ చుట్టబెట్టుకున్నాను. దసరాల్లో గంగిరెద్దు గుర్తుకొచ్చింది కానీ అట్టేసేపు నిలవలేదు ఆ తలపు.

వీధిలో అడుగు పెట్టి మోము ఎత్తి కళ్లతోసే అమందానందం అనుభవిస్తున్నాను.

చల్లని మంచు లేత పుప్పొడిలా మొహంమీద వాలుతోంది మృదువుగా. నామానసవీణ ఘల్లున మోగింది.

రెండోకాలు తీసి ముందుకి వేశాను.

ధమ్...

ముందుకి వేసిన కాలు ఇంకా ఇంకా ముందుకి సాగి, నా కాయాన్ని సాష్టాంగ ప్రణామపక్కీలో నేలపాలు చేసింది.

క్షణకాలం ఆగి, నన్ను నేను కూడతీసుకుని, మెల్లిగా లేచి మళ్లీ రెండో పాదం ముందుకి వేశాను.

థమ్,

రెండోసారి నేలకరిచాను.

కాని లేవక తప్పదు. అలనాటి బ్రూస్‌లా మళ్లీ లేచి, మానవాళికి ఏమాత్రమూ జయంట్ స్టెప్ కాని అడుగు వెయ్యడానికి, బలి తల మోపిన పాదము కాని నా పాదము మళ్ళీ ఎత్తి, చుట్టూ చూశాను ఈ పద్మవ్యూహంలోంచి ఎలా బయటపడడమా అనుకుంటూ. .

నాలుగడుగుల దూరంలో చిరునవ్వుతో నన్ను తిలకిస్తున్న అమెరికన్ ఒకాయన ముందుకొచ్చి చెయ్యి అందించాడు.

నేను గబుక్కున ఆ చెయ్యి దొరకపుచ్చుకుని ఆ మంచుగుండంలోంచి బయటపడ్డాను.

తరవాత అతనిచెయ్యి వదిలేసి, నాదారిన నేను పోబోతూ అన్నాను, ''ఇంతవరకూ తెలీసేలేదు. ఒక్కరయినా చెప్పలేదీ మాట నాకు.''

''ఆఁ?'' అన్నాడు అతను అయోమయంగా చూస్తూ.

''మంచులో జారిపడతాం అని.''

ooo

(ఈకథ నేను అమెరికా వచ్చేక ఇంగ్లీషులో రాసిన మొదటి కథ. 1982లో ఇంగ్లీషులో Wisconsin Review, సెప్టెంబరు 1982,లో ప్రచురించారు. ఆ తరవాత భాషమీద కూడా ఇలాగే హాస్య, వ్యంగ్యంధోరణిలో రాసి పంపిస్తే వాళ్లు వేసుకోలేదు. మాడిపార్ట్‌మెంటులో సంస్కృతం ప్రొఫెసరు ఫ్రాన్సిస్ విల్సన్ నాయందు ప్రత్యేకాభిమానం చూపే ఆత్మీయురాలు. ఆమెని అడిగేను ఈ రెండు కథల్లో తేడా ఏమిటని.

"మొదటికథలో అమెరికన్‌ని హీరో చేసావు. రెండోకథలో హేళన చేశావు" అన్నారావిడ. ఏ కథని ఎవరు ఎలా ఆదరిస్తారు అన్నది తెలిసింది అప్పుడు నాకు. ముఖ్యంగా సంస్కృతులవారికోసం రాస్తున్నప్పుడు గమనించవలసిన విషయం ఇది.)

# 2. కథల అత్తయ్యగారు

“ఎవరూ .. అమ్మాయీ ...”

“ నేనేనండీ అత్తయ్యగారూ.”

“దా, కూచో, ఇప్పుడే అనుకుంటున్నా, ఇంకా రాలేదేమా అని.”

“ఈరోజు స్కూల్లో కొంచెం ఆలస్యంవయిందండీ. సత్యంమాస్టారు అన్ని లెక్కలు పూర్తి చేసి వెళ్లమన్నారు.”

“కూచో. ఇవాళ ఏం కూర చెయ్యనా అని చూస్తున్నా,” అంటూ అత్తయ్యగారు మూలనున్న పీట నాముందుకి తోసారు. అత్తయ్యగారు మడి కట్టుకు వంట చేస్తారు, నేను పొరపాటున తగుల్తానేమోనని ఆమె అనుకుంటారని నాకు తెలుసు. అంచేత పీట గోడవారకి జరుపుకుని ఒదిగి కూచున్నా.

“అరిటికాయ వేపుడు చెయ్యండి. మామయ్యగారికిష్టం కదా” అన్నా.

“అల్లం పచ్చిమిరపకాయా నూరి పెడతా. అల్లం పేగు శుద్ధి చేస్తుంది” అన్నారు అత్తయ్యగారు కూరలబుట్టలోంచి రెండు అరిటికాయలూ, కత్తిపీటా ముందేసుకుని కూర్చుంటూ.

నేను చూస్తూ కూచున్నాను. ”కథ చెప్పండి అత్తయ్యగారూ” అన్నాను కొంచెంసేపు ఆగి.

“ఏం కథ చెప్పను?”

“చిలకలకొలికి చిన్నదానా కథ పూర్తి చెయ్యలేదు కదండీ నిన్న.”

“ఎంతవరకూ చెప్పానూ. ...” అన్నారు అలవాటుగా దీర్ఘాలు తీస్తూ.

"అదేనండి, పెద్దరాణికి ఒకమ్మాయి పుట్టింది. కాని చిన్నరాణికి అది ఇష్టంలేదు. అంచేత ఆ పాపని పుట్టినవెంటనే దాసీదానికి ఇచ్చేసి, పెద్దరాణితో 'నీకు కప్పపిల్ల పుట్టింది' అని చెప్పింది. పెద్దరాణి 'అయ్యో ఇది నాకర్మ' అనుకుని ఏడుస్తూ ఊరుకుందిట. తరవాత చిన్నరాణికి కూడా ఒక అమ్మాయి పుట్టింది. ఇలా కొంతకాలం సాగింది. పెద్ద రాణికూతురు దాసీదానింటిలోనూ, చిన్న రాణికూతురు రాజుగారింటిలోనూ పెరుగుతున్నారు. చిన్నరాణి పెద్దమ్మాయిచేత దాసీపనులు చేయిస్తూ, చాలా కష్టాలు పెడుతూ వుంటుందిట. చిన్నమ్మాయికేమో, అదే ఆవిడ సొంతకూతురికి అది అస్సలు బాగుండదు.."

అత్తయ్యగారు "నీకు బాగా గుర్తుంటుంది," అంటూ నవ్వి, కూర తాలింపుకోసం పొయ్యిమీద బాణలి పెట్టి, రెండు గరిటెలు నూనె పోసి, నూనె బాగా కాగేక ఆవాలూ, మిరపకాయలూ వేశారు. మిరపకాయలఘాటు గదంతా గుప్పుమని కమ్ముకుంది. ఆ ఘాటుకి నేను ఉక్కిరిబిక్కిరయిపోయాను. దగ్గొచ్చేసింది ఒక్క పెట్టున.

"పొమ్మనలేక పొగబెట్టినట్లు" అన్నారు అత్తయ్యగారు నవ్వుతూ.

నేను ఆమెవంక చూస్తూ కూర్చున్నాను. "అంటే ఏమిటి" అని అడగాలనుంది కానీ అడగలేదు, చిలకలకొలికి కథ ఆగిపోతుందని. ఆ పొగకథ రేపు అడుగుతాను.

అత్తయ్యగారిని చూస్తుంటే ఎంతో బావుంటుంది నాకు. పొట్టిగా, కాస్త లావుగా, కళకళల్లాడుతూ చందమామలాటి పచ్చనిముఖంమీద చిరునవ్వుతో ఎంతో అందంగా కనిపిస్తారు ఆమె. అట్టే నగలేమీ పెట్టుకోకపోయినా ఏమీ తక్కువయినట్టు కనిపించరు. అందుకే రోజూ వాళ్లింటికి వెళ్లటం నాకిష్టం.

"ఊఁ అప్పుడూ ... ఆ చిన్నమ్మాయికి చానా కష్టం అయింది గదా."

"అవును పాపం. మరి ఆ అమ్మాయి వాళ్లమ్మకి చెప్పలేదా ఇదేం బాగులేదని?"

“వాళ్లమ్మంటే ఆ అమ్మాయికి భయం. అట్టా చెప్పితే, ఆమెకి కోపం వచ్చి కొడుతుందేమోనని చెప్పలేదు. ఆ తరవాత ఒక ఉపాయం ఆలోచించింది”

నేను నిటారుగా కూచున్నాను ఊపిరి బిగబట్టి. .

“ఒకరోజు, ఆ చిన్నమ్మాయి బొమ్మలతో అమ్మాట ఆడుకుంటోందిట, ఎంచక్కా అమ్మమాదిరి తను కూడా మడి కట్టుకుని, వంట చేసి, ఆ బొమ్మకి తిను, తిను అంటూ తినబెట్టిందిట. కాని ఆ బొమ్మేమో తినలేదు. అప్పుడు ఆ అమ్మాయేమో నాబొమ్మ బువ్వ తినటంలేదూ అంటూ ఏడవటం మొదలెట్టిందిట.

వాళ్లమ్మ అది చూసి, ‘చిలకలకొలికీ, చినదానా, బొమ్మలు బువ్వలు తిందురటే’ అందిట నవ్వుతూ.

అప్పుడేమో ఆ అమ్మాయి, ‘మాయలదానా, మహిమలదానా, మనుషులు కప్పల కందురటే’ అందిట చమత్కారంగా.

అప్పుడు చిన్నరాణి తను చేసిన తప్పు తెలుసుకుని, పెద్దరాణీకి నిజం చెప్పి, పెద్దమ్మాయిని పిలుచుకొని వచ్చి, ప్రేమగా చూసుకోసాగిందిట.” అంటూ ముగించేరు అత్తయ్యగారు.

నామనసు కుదుటపడింది. హమ్మయ్య. మంచి అమ్మాయికి కష్టాలు పోయేయి. చిన్నమ్మాయి తన తెలివితేటలతో తన తల్లి పాడుబుద్ధిని మార్చేసి, మంచిదాన్ని చేసేసింది. కొంచెంసేపు నేనేమీ మాటలాడలేదు. తరవాత నెమ్మదిగా అడిగా, “పొగ పెట్టటం ఏమిటండీ అత్తయ్యగారూ,” అని, ఇందాకటిమాట గుర్తొచ్చి.

“చీకటి పడుతోంది. మీఅమ్మగారు ఎదురుచూస్తూంటారు. రేపు చెపుతాలే.” అని నన్ను ఇంటికి పంపేశారు ఆరోజుకి.

ooo

అప్పట్లో మేం గుంటూరుదగ్గర మంగళగిరిలో ఉంటూ ఉండేవాళ్లం. ఇది నాకు బాగా గుర్తుండిపోయిన అలనాటి తొలికథ. ఇంకా మర్రిచెట్టు తొర్రలో ప్రాణాలు దాచుకున్న రాక్షసులూ, ఏడుమల్లెపూవులఎత్తు రాకుమార్తెల కథలూ రోజు చెప్పిన ఆ అత్తయ్యగారిపేరు రామడుగు లలితాంబగారు. మామయ్యగారిపేరు నరసింహంగారు. వారింటితలుపులు సదా నాకోసం తెరిచివుండేవి. అత్తయ్యగారు నాకోసం ఎదురుచూస్తూ వుండేవారు రోజు.

నిజంగా ఆవిడకీ మాకూ ఏ చుట్టరికమూ లేదు కాని ఆ రోజులు అలాటివి. పెద్దలని వరసపెట్టి పిలవడం, లేని చుట్టరికాలు కలుపుకుని ఆప్యాయతలు పెంచుకోడం చేసేవాళ్ళం. అంటే మాఅత్తయ్యగారు కూడా అందరితో పాటే అనికాదు. ఆవిడకి ఆవిడే సాటి నామటుకు నాకు మరో అత్తయ్యగారు లేరు.

మా నాన్నగారి ఉద్యోగంమూలాన మేం కొత్తగా మంగళగిరిలో స్థిరపడినరోజులు అవి. నేను చింతకింది కనకయ్యగారి హైస్కూలులో ఫస్టుఫారంలో చేరాను. స్కూలినించి నడిచి ఇంటికి వస్తుంటే, దారిలో, మాయింటికి మలుపు తిరిగే ముందువీధిలో రెండిళ్లకి ఇవతల అత్తయ్యగారిల్లు వస్తుంది. అరుగుమీద మామయ్యగారు వాలుకుర్చీలో కూర్చుని, పేపరు చదువుకుంటుంటే, అత్తయ్యగారు స్థంభానికానుకుని కూర్చుని, అప్పడే కోసిన కనకాంబరాలూ, మరువం, మల్లెలూ మాల కడుతూ, ఏ ఊర్మిళాదేవి నిద్రో పాడుకుంటూ కనిపించేవారు. మాయింట్లో మాఅమ్మవేపూ, నాన్నగారివేపూ కూడా పెద్దలు అప్పటికే తరించిపోయారు. పైగా అటూ ఇటూ కూడా మా అమ్మా, నాన్నగారే తొలిసంతానం. అంచేత నాకు అందరు పిల్లల్లా చెప్పుకోడానికి అమ్మమ్మలూ, తాతగార్లూ, లేరేమో, ఈదంపతులని చూస్తుంటే ఏదో చెప్పలేని తమకం కలిగేది మనసులో.

నేను వారినిద్దరినీ పరీక్షగా చూస్తున్నానని నాకు తెలీలేదు ఆమె ఒకరోజు తలెత్తి నావేపు చూసి నవ్వేవరకూ. నేను సిగ్గుపడి పరుగెత్తుకుంటూ ఇంటికొచ్చేసేను. మరునాడు ఆమె దా అంటూ పిలిచారు. నేను జంకుతూనే దగ్గరికి వెళ్లాను.

నేను బాగా దగ్గరగా వచ్చినతరవాత, ఆమె చిరునవ్వుతో, నా రెండుబుజాలు పట్టుకుని, నన్ను వెనక్కి తిప్పి, నాజడలో చిన్నపాయ తీసి, చేతిలో వున్న కదంబమాల ముడిచి తురిమారు. మళ్లీ తనవేపు తిప్పకుని, ‘‘నీపేరేమిటి?’’ అని అడిగారు.

‘‘మాలతి అండీ,’’ అన్నాను నెమ్మదిగా.

‘‘ఎంచక్కా వున్నావు బాలాత్రిపురసుందరిలా,’’ అన్నారామె.

నాకు చెప్పలేనంత సిగ్గూ, సంతోషమూ ముంచుకొచ్చేయి. నేను మాటాడకుండా ఒక్క వురుకున ఇంటికి చేరుకున్నా.

‘‘ఆ పువ్వులెక్కడివి?’’ అంది అమ్మ.

‘‘పక్కవీధిలో వుండే అత్తయ్యగారు పెట్టేరు,’’ అన్నాను.

అమ్మ తిడుతుందేమో అనుకున్నాను కానీ, తేలిగ్గానే పోనిచ్చేసింది, ‘‘తిన్నగా ఇంటికి రాకుండా ఆ పెత్తనాలేమిటి’’ అనేసి, తనపనిలో పడిపోయింది.

వరసగా నాలుగురోజులు ఇలా జరిగింది. అయిదో రోజు, అత్తయ్యగారు, నా తలలో పువ్వులు పెట్టబోతూ, ‘‘ఇదేం జడ ఒగ్గులొగ్గులుగా’’ అన్నారు.

‘‘మాఅమ్మ బయటుందండీ. అంచేత నేనే వేసుకున్నా,’’ అన్నాను.

‘‘ఇంటికెళ్లి, మీఅమ్మతో చెప్పిరా. కుదుమట్టసంగా దువ్వి మళ్లా జడ వేసి చెండు తురుముతా,’’ అన్నారామె.

నేను ‘‘సరేనండీ’’ అని పరుగెత్తుకుంటూ వెళ్లి అమ్మకి చెప్పాను.

‘‘ఆవిడకి మరేం పనిలేదూ నీకు జడలేస్తూ కూచోడానికి. ఇప్పడేం వద్దు,’’ అంది అమ్మ.

‘‘అత్తయ్యగారే వేస్తానన్నారు,,’’ అన్నాను నేను రొకాయిస్తూ.

‘‘ఆవిడేదో మర్యాదకి అనివుంటారు. వద్దని చెప్తున్నానా,’’ అంటూ కసురుకుంది అమ్మ.

నేను గుడ్ల నీళ్లు కుక్కుకుంటూ పెరట్లోకి పెళ్లిపోయాను. నాకు కోపం వస్తే పెరట్లో జామచెట్టెక్కి కూచుంటా. అమ్మ మంచికళనుంటే, వచ్చి, మంచి మాటలు రెండు చెప్పి లోపలికి తీసుకెళ్తుంది. లేకపోతే, అదే వస్తుంది అని వూరుకుంటుంది. ఇప్పడు తను కూడా ఇంట్లోకి పెళ్లదు కనక, రెండోవరసే జరిగింది. నేను రెండు జామకాయలు తిని ఇంట్లోకి వచ్చేసాను మంచినీళ్లకోసం.

మర్నాడు స్కూలినుండి వస్తుంటే, అత్తయ్యగారు చూసి, నన్ను ఆపి, అడిగారు, ‘‘నిన్న రాలేదేం?’’ అని.

‘‘ఆవిడకి మరేం పనిలేదూ నీకు జడలేస్తూ కూచోడానికి అందండీ మా అమ్మ,’’ అని చెప్పాను, నాదేం తప్పలేదని చెప్పడానికి.

అత్తయ్యగారు నవ్వి, ‘‘ఫరవాలేదు, అత్తయ్యగారే వేస్తానన్నారూ అని చెప్పు. మీ అమ్మ స్నానం అయేవరకూ, రోజూ ఉదయమే రా, జడ వేస్తాను అని అత్తయ్యగారు చెప్పారని మీఅమ్మకి చెప్పు’’ అన్నారు.

నేను సంతోషంగా మాఅమ్మకి ఆ మాట చెప్పాను. అలా మొదలయింది మా అనుబంధం. అసలు చాలా రోజులవరకూ మాఅమ్మా అత్తయ్యగారూ కలుసుకోనేలేదు. నేనే అత్తయ్యగారిలా చెప్పమన్నారని అమ్మతోనూ, అమ్మ ఇలా అందని అత్తయ్యగారితోనూ రాయబారాలు నడుపుతూ వచ్చేను. ఆ రోజుల్లోనే అత్తయ్యగారు నాకు శ్రీకృష్ణరాయబారం కథ చెప్పారు జడవేస్తూ.

అలా నాకు జడ వేస్తూ కథలు చెప్పడం మొదలయింది. తరవాత, సాయంకాలాలు, స్కూలినించి ఇంటికొచ్చి, కాఫీ తాగి, ‘‘అత్తయ్యగారింటికెళ్తున్నా’’ అని అమ్మకి చెప్పి వాళ్లింటికి పెళ్లేదాన్ని.

"రోజూ ఎందుకు? ఆవిడని పనులు చేసుకోనీకుండా కాళ్లకడ్డం పడుతూ," అంది అమ్మ ఓ రోజు.

అత్తయ్యగారే రమ్మన్నారని నేను పట్టుబట్టి వెళ్లాను. "రోజూ ఎందుకు? ఆవిడని పనులు చేసుకోనీకుండా కాళ్లకడ్డం పడుతూ అంటోందండీ మాఅమ్మ" అని కూడా చెప్పాను అత్తయ్యగారికి.

"నువ్వు నాకాళ్లకడ్డం పట్టంలేదని చెప్పు మీఅమ్మగారికి," అన్నారు అత్తయ్యగారు ఎప్పటిలాగే నవ్వుతూ.

నేను మళ్లీ ఆ మాట మోసుకొచ్చి మాఅమ్మకి చేరేసేను. మాఅమ్మ కూడా నవ్వుతూ, "ఆవిడకి ఆడపిల్లల్లేని ముచ్చట తీరిపోతున్నట్టుంది నీతో," అంది.

అత్తయ్యగారికి ఒక కొడుకు. ఆ అబ్బాయి బెంగుళూరులో చదువుకుంటూ వుండేవాడు. అంచేత వాళ్లింట్లో నేను వాళ్ల అమ్మాయిలాగే మసలుతూంటేదాన్ని.

నాజీవితంలో నాకు తారసపడిన ఎంతోమందిని మరిచిపోయాను..ఎన్నో సంఘటనలు మర్చిపోయాను. ఉపాయాలతో, వాదనలతో బుద్ధులు మార్చేయగలమని నమ్మేరోజులు పోయేయి. నిజజీవితంలో నా అనుభవంలో ఎవరూ "సరేనండీ, మీరు చెప్పారుకనక మారిపోతాను" అంటూ మంచివాళ్లయిపోయినవాళ్లు తటస్థపడలేదు నాకు. నేను రాసే కథలన్నీ సుఖాంతాలు కావు. కానీ, ఇప్పటికీ కథల్లో మంచివాళ్లబాధలు తొలిగిపోతేనూ, దుష్టులు శిష్టులు అయిపోతేనూ అదో రకం మనశ్శాంతి.

ఆరుదశాబ్దాల పూర్వం ప్రతిరోజూ, స్కూలయింతరవాత చల్లని సాయంకాలాలు, నాయీడు పిల్లలందరూ వీధుల్లో ఆడుకుంటుంటే, నేను మాత్రం అత్తయ్యగారి వంటింట్లో కూర్చుని విన్నకథలూ, ఆ కథలు చెప్తూ నన్ను అలరించిన అత్తయ్యగారూ పదిలంగా సుస్థిరంగా నామనోఫలకంపై

నిలిచివున్నారు ఈనాటికీను, జననాంతర సౌహృదాని అంటే ఇలాటివే అనిపిస్తుంది నాకు.

ooo

(తెలుగు జ్యోతి, న్యూజెర్సీ, జనవరి 2008)

## 3. జేబు

“నాకు కొత్త పరికిణీ, జాకట్టూ కావాలి” అంది పరిమళ అమ్మతో.

“వారం రోజులు కూడా కాలేదు  కొత్తస్కూలని కొత్తబట్టలు కుట్టించేం. మళ్లీ ఇప్పుడే ఏమిటి?” అంది అమ్మ.

“పోనీ పరికిణీ అక్కర్లేదు. జాకట్టు కుట్టించు. కొత్తది కుట్టించకపోతే నేను స్కూలికి వెళ్లను,” అంది పరిమళ.

“బాగుంది వరస. రోజుకో కొత్త జత కావాలేమిటి రాణీగారికి” అంది అమ్మ నవ్వుతూనే.

“రోజుకోటి అక్కర్లేదు. నాకు ఇంగ్లీషు క్లాసు వున్నరోజున వేరే డ్రెస్సు కావాలి,” అంది.

“ఏమయింది ఇంగ్లీషు క్లాసులో?” అనడిగింది అక్కయ్య. ఇలాటి కోరికలకి మూలం స్కూలేనని అక్కయ్య గ్రహించేసింది.

పరిమళ మాటాడలేదు.

అమ్మ “సరేలే చూద్దాం. పైనెల బాబి పుట్టినరోజు వస్తోంది కదా. అప్పుడు నీక్కూడా కుట్టిస్తాలే” అంది.

“అలా కాదు. నాకు ఇప్పుడే కావాలి” అంది పరిమళ మళ్లీ.

“బాగానే ఉంది వరస. లేడికి లేచిందే ప్రయాణం అని కావాలి అనేసరికి కొనీడానికి ఎలా అవుతుంది. ఏవిటా తొందర,” అంటూ కసురుకుంది అమ్మ.

పరిమళ ఊరుకుంది కానీ మనసులో ఉక్రోషం పట్టలేకుండా వుంది.

ooo

ముందు రోజు ..

స్కూళ్లు తెరిచారు. పదోక్లాసులో అడుగు పెట్టింది పరిమళ. కొత్త పరికిణీ జాకట్టుతో, పుస్తకాలూ, జామెట్రీ బాక్సూ గుండెల్లో పొదివి పట్టుకుని. అన్నీ కొత్తమొహాలు. క్లాసులో అడుగుపెడుతుంటే గుండెలు చుక్ చుక్ మంటూ చిన్ని రైలింజనులా కొట్టుకున్నాయి.

కొత్త స్కూలూ, కొత్తమొహాలూ, కొత్త క్లాసు, కొత్త మేష్టరు, కొత్తపుస్తకాలు, కొత్త పరికిణీ, కొత్త జాకట్టు - అమ్మ వారంరోజులకిందట తనని బజారుకి తీసికెళ్లి, తను ఎంచుకున్న పువ్వుల పరికిణీగుడ్డా, మామిడిచిగురురంగు జాకట్టు గుడ్డా కొని, అక్కడే అరుగుమీద కుట్టుమిషను పెట్టుకుని కూర్చున్న అమీరుసాయబుచేత కుట్టించిన కొత్త పరికిణీ, జాకట్టూ - అన్నీ చక్కగా అమిరేయి.

అయినా కొత్త క్లాసు కొత్త క్లాసే.

అడుగులో అడుగేసుకుంటూ, తల ఒరవొంచుకుని దొంగతనం చేయబోతున్నట్టు బెరుకు బెరుగ్గా చుట్టూ చూస్తూ క్లాసులో అడుగు పెట్టింది. మేష్టారు ఇంకా రాలేదు. మగపిల్లలందరూ కుడిపక్కా, ఆడపిల్లలందరూ ఎడమపక్కా బల్లలమీదా కూర్చున్నారు. మామూలుగా బాగా తెలివైనవాళ్లూ బుద్ధిమంతులూ ముందువరసల్లో కూర్చుంటారు. పాఠాలు చదవనివాళ్లూ, బొమ్మలేసుకునేవాళ్లూ వెనకవరసల్లో సర్దుకుంటారు.

అందరూ గలగల్లాడుతూ కబుర్లు చెప్పుకుంటున్నారు. పరిమళ కళ్లు నెమ్మదిగా గది నాలుగుమూలలకీ ఓ చుట్టు చుట్టి, ఎడమవేపు రెండోవరసలో కూర్చున్న ఇద్దరు అమ్మాయిలమీద వాలేయి. ఎందుకో వారిద్దరూ ప్రత్యేకంగా కనిపించారు. వాళ్లమీద ఆపిల్ల కళ్లు అట్టే నిలిచిపోయేయి. అందులో అటువేపు ఉన్న అమ్మాయి తనని గమనించి మెల్లిగా నవ్వి, పక్కనున్న అమ్మాయికి చెప్పినట్టుంది. రెండో అమ్మాయి వెనుదిరిగి తనవేపు చూసింది. కొన్ని

''యుగాలసేపు'' అనిపించినట్టు అయినతరవాత, మెల్లిగా వాళ్లవేపు నడిచింది. వాళ్లు కూడా రమ్మన్నట్టు జరిగి చోటు చేసేరు బల్లమీద తనకి.

''నీపేరేమిటి?'' అనడిగింది జరిగి చోటిచ్చిన అమ్మాయి. తెల్లగా, పల్చగా వుంది, కోలమొహం, గట్టిగా పట్టుకుంటే కందిపోతుందేమో అనిపించేంత సుకుమారం. ఆ అమ్మాయిపేరు రమణిట. రెండో అమ్మాయి చామనచాయ, నిన్నెక్కడో చూసేనంటూ పలకరించే కళ్లూ, పెదవులమీద చిరునవ్వు అక్కడే పుట్టిందేమో అనిపిస్తూంది. విశాలట ఆ పిల్ల పేరు.

''పరిమళ'' అంది వినిపించీ వినిపించనంత నెమ్మదిగా పరిమళ.

''ష్'' అన్నారు వెనకెవరో. మాష్టారు వచ్చేరు.

రమణితో మాటాడుతున్న పరిమళ ఇటు తిరిగి, అప్పుడే క్లాసులో ప్రవేశించిన మాష్టారిని చూసి, నోరు తెరుచుకు చూస్తూ వుండిపోయింది. గుండె ధన్ ధన్ మని రెట్టింపు వేగంతో కొట్టుకుంటోంది. ఆయన వాళ్ల ఇల్లుగలాయన! వారం రోజులయింది వాళ్లింట్లో అద్దెకి దిగి. వచ్చిందగ్గరునుంచీ ఆయన ఏవో రూల్స్ పెడుతూనే వున్నారు.

ఆయన తన బల్లదగ్గరికి వెళ్లి, చుట్టూ ఓమారు చూసి, ''హు, ఓ కొత్తమ్మాయి వచ్చిందన్నమాట'' అన్నారు తనవేపు చూస్తూ. తరవాత ఎటెండెన్స్ తీసుకుంటూ తనపేరు వచ్చేసరికి తలెత్తి తనవేపే చూస్తూ ''ప్రమీల'' అన్నారు.

''ప్రమీల కాదండీ, పరిమళ'' అంది కాస్త బెదురుగా.

''పరిమళ'' అన్నారు మేష్టారు తినేస్తున్నట్టు చూస్తూ.

క్లాసులో కిసకిస నవ్వులు వినిపించేయి.

''సైలెన్స్'' అంటూ అరిచేరు మేష్టారు.

ఇంగ్లీషు క్లాసు. నాన్‌డిటైల్డ్ టెక్స్టుబుక్కు - పంచపాండవులూ ద్రోణాచార్యుడిదగ్గర విలువిద్య నేర్చుకోడం, అర్జునుడు చెట్టుమీద పిట్టకన్ను తప్ప

మరేమీ కనిపించలేదనడం, ఆచార్యులవారు తదేకధ్యానం అంటే అదీ అని వివరించడం ... పుస్తకంలోకి తలదూర్చేసిన పరిమళని వెనక కూర్చున్నమ్మాయి పెన్సిలుతో పొడిచింది,

పరిమళ వులిక్కిపడింది. బల్లమీద జామెట్రిబాక్స్ ధన్ మని కింద పడింది. ఇంగ్లీషు మేష్టారికి తెగ కోపం వచ్చేసింది.

''ఎవరది?'' అని ఆయన అడక్కుండానే తెలుస్తోంది. పరిమళ కూర్చున్న బల్లమీదనించి ఒంగి చెల్లాచెదరయిపోయిన స్కేలూ, కాంపసూ, పెన్సిలూ, రబ్బరూ, .. ఒక్కటొక్కటే ఏరుకుంటోంది ఆయనవేపు బెదురుగా చూస్తూ.

క్లాసులో మొగపిల్లలు కిసకిసలాడుతున్నారు.

''సైలెన్స్'' అంటూ మేష్టారు అరిచి, పరిమళని ''ఇలా రా'' అని తన కుర్చీదగ్గరికి పిలిచారు.

పరిమళ జామెట్రీ బాక్సూ, అందులో వుండవలసిన సామానూ అంతా బల్లమీద పెట్టి ఆయనదగ్గరికి వెళ్లింది.

''ఆ పోపులడబ్బా నాక్లాసుకి ఎందుకు తెచ్చేవు?'' అని అరిచేరాయన, కొట్టడమే తరువాయిగా.

పరిమళ జవాబు చెప్పలేదు.

''ఆ చెత్తడబ్బా ఇంగ్లీషుక్లాసులో కావాలా?'' అని మళ్లీ రొకాయించేరు.

''అక్కరలేదు సార్'' అంది పరిమళ బెదురుగా.

''రేపటినించీ నాక్లాసుకి జామెట్రీబాక్స్ తీసుకురాకు, అందరికీ చెప్తున్నా, నాక్లాసుకి ఎవరూ జామెట్రీబాక్సు తీసుకు రావడానికి వీల్లేదు'' అంటూ క్లాసు మొత్తానికి తాఖీదిచ్చేరు ఆయన.

క్లాసులో మొత్తం పదిహేను జతల కళ్లు తనవేపు తిరిగేయి ''నీనించే'' అంటూ.

ఆ రోజుకి క్లాసు అయిపోయింది. తనకి జాగా ఇచ్చిన స్నేహితురాళ్లిద్దరూ, రమణీ, విశాలా మాటాడుకుంటూ బయటికి వచ్చేరు. వాళ్ల ఇళ్లు ఇరుగూ పొరుగూన్న. తనఇంటికి దారి అటువేపే. అంచేత వాళ్లతో నడుస్తూ, వచ్చి, వాళ్ల ఇళ్లు దాటింతరవాత తన ఇంటిదారి పట్టొచ్చు.

''మేష్టారికి నువ్వంటే కోపం. అనవసరంగా నీమీద కేకలేసేరు'' అంది రమణి.

''నేనంటే ఆయనకెందుకూ కోపం?'' అంది పరిమళ. నిజంగానే ఆ పిల్లకి అర్థం కాలేదు.

''ఏమో మరి. వాళ్లింట్లో అద్దెకి వున్నారు కదా. మరేదో అయివుంటుంది.''

అప్పడే ఓ నిర్ణయానికి వచ్చేసింది. ఇహమీదట ఇంగ్లీషుక్లాసుకి జామెట్రీబాక్స్ తీసుకెళ్లరాదు అని. మరి పెన్సిలూ, రబ్బరూ, పావులా కాసూ ఇవన్నీ ఎలా ... చేతిలో పట్టుకు్కోలేదు కదా.

''లేడికి లేచిందే ప్రయాణమా'' అంటూ కసిరిన అమ్మ ''పోన్లెద్దూ ఓ పని అయిపోయినా అయిపోయినట్టే'' అనుకుంది తెల్లారి లేచేక. ఎలాగా బాబీకి కొనాలి కదా. పైగా ఆ కుట్టుపనివాడు అన్నరోజుకి ఇస్తాడో ఇవ్వడో. ఇప్పడే మొదలెడితే నయం అని ఆ సాయంత్రమే తమ్ముడితోపాటు రామయ్యసెట్టి కొట్టుకి తీసికెళ్లింది బట్టలు కొనడానికి. బాబిగాడికి చొక్కా గుడ్డ ఎంపిక ఇట్టే అయిపోయింది కానీ పరిమళకి నచ్చిన రంగూ, పువ్వులూ, అంచూ కూడేసరికి పొద్దు వాలింది.

అమ్మ వాటికి ధర చెల్లించి, అరుగుమీదున్న అమీరుసాయిబుకిచ్చింది కుట్టడానికి.

సాయిబు కొలతలు తీసుకున్నాడు.

''నాజాకట్టుకి జేబు పెట్టు'' అంది పరిమళ.

సాయిబు అమ్మవేపు చూశాడు.

''జాకట్టుకి జేబు ఏమిటే?'' అంది అమ్మ.

''బాబీ చొక్కాకి పెడుతున్నాడు కదా. నాకూ అలాగే పెట్టమను'' అంది పరిమళ అదేమీ వింత కానట్టు.

''వాడంటే మగవాడు,'' అంది అమ్మ.

''నేను ఆడవాడు. నాజాకట్టుకి జేబు ఉండాలి. లేకపోతే నాకు జాకట్టే అక్కర్లేదు.''

''ఆడవాడు ఏమిటే?'' అంది అమ్మ నవ్వుతూ.

.''జాకట్టుకి జేబు బాగుండదు అమ్మాయిగారూ'' అన్నాడు సాయిబు.

''నాకు బాగుంటుంది'' అంది పరిమళ పట్టుదలగా.

''పోనిద్దూ. సరదా పడుతోంది. ఓ చిన్న ముక్క అతికిద్దూ'' అంది అమ్మ. ఇదేదో తెమిల్తే కానీ ఇంటికెళ్లి వంట మొదలెట్టడం కాదు. ఏడు కొట్టేసరికి కంచంముందు కూచోపోతే నోష వచ్చేస్తుంది ఆయనగారికి.

జేబు పెట్టడానికి ఒప్పందం అయింపోయింతరవాత ఎక్కడ అన్న ప్రశ్న వచ్చింది. అబ్బాయిలచొక్కాల్లా గుండెలమీదా, కనిపించకుండా పక్కకా, తాతగారి జుబ్బాకి వున్నట్టు చివర అంచులదగ్గరా...

పరిమళ, ''నాకదంతా తెలీదు. నాకు జేబు కావాలి, పెన్సిలూ, రబ్బరూ పెట్టుకోడానికి'' అంది.

''పెన్సిలూ, రబ్బరూ కింద పడిపోతాయమ్మా మీరు చెమ్మాచెక్కా ఆటలు ఆడుతున్నప్పడు'' అన్నాడు సాయిబు.

''అయితే పక్కకి పెట్టు'' అంది పరిమళ.

మొత్తమ్మీద జాకట్టుకి పక్కజేబు పెట్టడానికి నిశ్చయం అయేసరికి ఆరుంబావు అయింది. అమ్మ తొందరపడుతూ పిల్లలిద్దరినీ రిక్షా ఎక్కించి ఇల్లు చేరింది ఆరాటపడిపోతూ.

మర్నాడు తెలుగుక్లాసు. పరిమళకి ఇంగ్లీషు మేష్టరంటే ఎంత భయమో తెలుగుమాష్టారంటే అంత ఇష్టం. ఆయన చెప్పే పద్యాలూ, వ్యాకరణం, అన్నీ ఎంతో చక్కగా అర్థం అవుతాయి తనకి.

పాణిని కథ చెప్తున్నారు.

పరిపూర్ణ చంద్రబింబమువోలె శాంతమై కళకళలాడు మొగంబు వాడు

ఉన్నతోరస్కుండయి చూడంగ తగు మేని సొబగువాడు

ఆసాయమాయాసమనక గురవర పదాబ్జ శుశ్రూష నెరపువాడుఁ

గాని అది ఏమి పాపమో గడగి యొక్క పాఠమయిన యొప్పగించిన పాపమున బోఁడు.

పరిమళకి ఈ పద్యం చాలా ఇష్టం. చివరిపాదంలో చమత్కారం ఆ పిల్ల మనసునాకట్టుకుంది. పద్యంలో పదే పదే "వాడు" అని రావడంతో నిన్నట్నుంచీ తనని వేధిస్తున్న ప్రశ్నకి సమాధానం కనుక్కోవాలి అనిపించింది. క్లాసు అయిపోయిన తరవాత మేష్టారిదగ్గరికి వచ్చింది "నాకో సందేహం మాష్టారూ" అంటూ.

"ఏమిటమ్మా?" అన్నారాయన చిరునవ్వుతో. ఆయనకి కూడా పరిమళ అంటే ప్రత్యేకాభిమానం తెలివైనదని.

"అదేనండీ. వాడు ఏకవచనం, వారు బహువచనం కదండీ."

"అవునమ్మా."

"మగవాడు ఏకవచనం, మగవారు బహువచనం. మరి ఆడవారు బహువచనం కదా, ఆడవాడు ఏకవచనం ఎందుకు కాదూ?"

మాష్టారు నవ్వేరు,

పరిమళ నవ్వలేదు. ఆ పిల్లకి నిజంగానే ఆ సందేహం వచ్చింది. తనకి సమాధానం కావాలి.

''వ్యాకరణం ఏ పదం ఎందుకు ఎలా లేదో చెప్పదమ్మా. ఉన్న మాటలు కాలగతిలో ఎలా రూపాంతరం పొందేయో చెప్పతుంది అంతే. నువ్వు ఆడవాడు అంటే, మరో పదిమంది అలాగే అంటే అదే కరెక్టయిపోతుంది కొంతకాలానికి. నువ్వు గొప్ప రచయిత్రివి అయింతరవాత చెయ్యి ఆ పని.'' అన్నారాయన సగం హాస్యంగానూ, సగం నిజంగానూ.

''నేనిప్పుడే అంటానండీ,'' అంది పరిమళ. ఆ పిల్లకి ఆయనదగ్గర అంత చనువుంది మరి.

''లేదులే. నువ్వు పెద్ద రచయిత్రివి అయేవరకూ ఆగాలి. అప్పడయితే నీమాట చెల్లుతుంది. ఆర్షప్రయోగం అని అందరూ మెచ్చుకుంటారు. ఇప్పుడంటే, నీకు భాష రాదంటారు. ఇంతకీ ఈ వాదన ఎందుకు వచ్చిందసలు?'' అని అడిగేరు మేష్టారు.

పక్కనే వున్న రమణి ''ఈ జాకట్టుజేబుతో వచ్చిందండీ'', అంది నవ్వుతూ, ఆ జేబు ఆయనకి కనిపించేలా రవంత లాగి.

''ఏమిటీ .. నేనెప్పుడూ జాకట్టుకి జేబు చూడలేదులే .. అందుకడిగేను,'' అన్నారాయన పరిమళ మొహంలోకి చూస్తూ.

''అదేనండీ మన పరిమళ అంటే.'' అంది వెనకునున్న విశాల.

ooo

రాత్రంతా ఆలోచిస్తూనే వుంది పరిమళ. జేబుకి ఆడా మగా ఏమిటి? అని. చాలా చాలా ఏళ్లకి ముందు, అమ్మా, అమ్మమ్మా వీధిలోకి అడుగెట్టని రోజుల్లో, వాళ్లకి, ఇలా పెన్సిళ్లూ, రబ్బరుముక్కలూ పట్టుకుతిరగాల్సిన అవుసరం లేని రోజుల్లో జేబులు అక్కర్లేకపోయి వుండొచ్చు. ఇప్పుడు తను అవన్నీ పట్టుకు తిరగాలంటే, రోజూ మహా చిరాగ్గా వుంటోంది పొద్దస్తమానం, ఏదో ఒకటి చేతిలోంచి జారి పడిపోవడం, మళ్లీ కొత్తది కావాలని ఇంట్లో పేచీ.

"పోనీ చిన్నసంచీ కుట్టిస్తా, అందులో పెట్టుకో" అంది అక్కయ్య. కానీ ఆ సంచీ కూడా పారేసుకోకుండా చూసుకోవాలి కదా అస్తమానం. అదీ ఓ పనే. జేబులో అయితే అన్నీ ఓ చోట పడుంటాయి. తాను అనుక్షణం చూసుకోనక్కర్లేదు పెన్సిలుందా, రబ్బరుందా అనుకుంటూ. అప్పుడు తన తలకాయని వేరే విషయాలకి వినియోగించుకోవచ్చు కదా అనుకుంటూ నిద్ర పోయింది.

ooo

పదిహేనేళ్లయింది. అమెరికాలో స్థిరపడిన పరిమళ ఇండియా వచ్చి, రమణిని చూడ్డానికి వాళ్లింటికొచ్చింది.

రమణి ఉప్పొంగిపోతూ, "అబ్బ, ఎన్నాళ్లకెన్నాళ్లకి కనిపించేవే. నిన్ను మళ్లీ చూస్తాననుకోలేదు. ఎప్పుడో ఏడాదికో రెండేళ్లకో నీకథలు పత్రికలలో కనిపించినప్పుడల్లా నేనూ విశాలా నీగురించే అనుకుంటాం."

పరిమళ కూడా పొంగిపోయింది తనకథ చదివి, "మన పరిమళ" రాసిందనుకుంటూ చూసి మురిసిపోయేవారున్నారని తెలిసి.

రమణి, "పద, పద, విశాల హైదరాబాదులో వుంటుంది కానీ వాళ్లక్కయ్యని చూడ్డానికొచ్చిందిట. పద, వాళ్లింటికెళ్దాం" అంటూ హడావుడి చేసి లాక్కుపోయింది వాళ్లింటికి.

విశాల ఇంట్లో ముగ్గురూ కూచుని పొట్టాచారిగారిగురించీ, లెక్కల మాష్టారిగురించీ, ఇంకా ఎన్నో విషయాలు గలగల మాటాడేసుకున్నారు. "ఆ రోజుల్లో నువ్వొక్కదానివే పరికిణీ, జేబు జాకట్టుతో క్లాసు కొచ్చేదానివి. మేం ఇద్దరం నవ్వుకునేవాళ్లం నీతెలివితేటలకి" అంది రమణి.

పరిమళ కూడా నవ్వేసి, "మీరెందుకు పెట్టించుకోలేదూ మీజాకట్లకి పోకెట్లు?" అంది.

“ఎక్కడా? మాఅక్కయ్యకి చాలనివన్నీ సద్వినియోగం చెయ్యడంతోనే సరిపోయింది నాకు” అంది విశాల.

“నాకు ఆ అదృష్టం కూడా లేదు. నాకున్నవాడొక్కడూ అన్నయ్య అయిపోయేడు. వాడి చొక్కాలు నన్ను తొడుక్కోనిస్తే, జేబులు అవే వచ్చేసి వుండేవి, ప్చ్, తోచలేదు కానీ,” అంది రమణి.

“మన తెలుగు మేష్టారు ఎక్కడున్నారు?” అనడిగింది పరిమళ.

“రిటైరయిపోయారు కదా. ఆ ఇంట్లోనే వున్నారు.”

“వెళ్లి చూద్దామా?” అంది పరిమళ చిన్నప్పటి ప్రసంగాలు లీలగా మనసులో మెదిలి.

“పదండయితే తొరగా. ఇప్పుడయితే ఆయన ఇంట్లోనే వుంటారు. మరో గంట పోతే దొరకరు. పార్కుకి వెళ్లిపోతారు.” అంది విశాల.

ముగ్గురూ మేష్టారింటికి వచ్చేరు. ఆయన వరండాలో కూర్చున్నారు భాగవతం చదువుకుంటూ. పక్కనే స్తంభానానుకుని కూర్చుని, రాత్రి కూరకి చిక్కుడుకాయలు ఈనెలు తీస్తున్నారు ఆయన భార్య కామమ్మగారు.

గేటు తోసుకుని వస్తున్న ముగ్గురు ఆడపిల్లల్ని చూసి, మేష్టారు చత్వారం కళ్లద్దాలు సవరించుకుంటూ “ఎవరూ?” అన్నారు.

కామమ్మగారు గుర్తు పట్టి, “అదేనండీ, రమణీ, విశాలాను. పరిమళ కూడా వచ్చినట్టుంది” అని, “రండమ్మా” అంటూ వాళ్లని ఆహ్వానించిందావిడ ఆప్యాయంగా.

వాళ్లు మేష్టారికి నమస్కారాలు చేసి, ఆ పక్కనే చాపమీద కూర్చున్నారు.

“జేబుజాకట్టు పరిమళేనా” అన్నారు నవ్వుతూ మేష్టారు,

రమణి కూడా నవ్వింది, “అవునండీ అదే” అంటూ.

పరిమళ సిగ్గు పడిపోయింది. ఏమిటో అప్పట్లో అలా బుద్ధి పుట్టింది అనుకుంటూ.

కామమ్మగారు ఇంట్లోకి వెళ్లి, మూడుగ్లాసులో మజ్జిగ తీసుకొచ్చారు. ''ఇప్పుడెందుకండీ'' అంటూనే పుచ్చుకున్నారు పిల్లలు ముగ్గురూను.

''అమెరికాలో వున్నావన్నమాట అయితే. కిందటినెల మా మనవరాలొచ్చి వెళ్లిందిలే, పాంట్లూ, షర్టులూను. నువ్వూ అంతేనేమో ... నిలువునా జేబులే... '' అన్నారాయన మాటలసందర్భంలో నవ్వుతూ.

''జేబూలూ, ఆ జేబులనిండా నోట్లూ... అంతేనా ...'' అన్నారు కామమ్మగారు కూడా నవ్వుతూ. ఆవిడ హాస్యానికే అన్నారు.

పరిమళ చప్పన మొహం పక్కకి తిప్పుకుని, ''అదేం లేదండీ'' అంది.

''అయ్యో, పిల్ల నొచ్చుకున్నట్టుంది. అలా అనకుండా వుండవలసింది,'' అనుకున్నారు కామమ్మగారు మనసులోనే.

పరిమళ మాత్రం అంతలోనే తేరుకుని, తేలిగ్గా నవ్వేస్తూ, ''జేబు కాదండీ జోలె ఇప్పుడు'' అంది చేతిసంచీ చూపిస్తూ. తరవాత సంచీలోంచి ''ఇది మీకోసం'' అంటూ ఓ బాల్ పాయింటు పెన్ను తీసి మేష్టారికిచ్చింది. ఆయన అందుకున్నారు, కృష్ణార్పణం అంటూ.

రమణి ''ఎన్ని జేబులున్నా, ఎక్కడున్నా మన పరిమళ మన పరిమళేనండీ మాష్టారూ. జేబునిండా ఇప్పటికీ కాగితాలూ, పెన్సిళ్లే'' అంది.

''ఆఁ, కథలు రాస్తున్నావని విన్నాను. చదువులతల్లి కటాక్షం వుంది నీకు. నేను అప్పుడే అనుకున్నాను నువ్వు మంచి రచయిత్రివి అవుతావనీ. అదే సంతోషం నాకు,'' అన్నారు మేష్టారు.

''మంచి రచయిత్రినేం లేదండీ. ఏదో గిలుకుతూంటాను తోచినప్పుడు'' అంది పరిమళ వినయంగా.

''అదేనమ్మా. జేబు పెన్సిలు దాచుకోడానికి, పెన్సిలు మనసు దాచుకోడానికి,'' అన్నారు మాష్టారు ఆలోచిస్తూ.

ఆ పైన ఎవరికీ మాటలు తోచలేదు. నిశ్శబ్దం బరువుగా తెర దించింది వారిమధ్య.

“చీకటి పడుతోంది, వెళ్లొస్తాం మేష్టారూ” అంటూ లేచేరు ముగ్గురూను.

“ఉండండమ్మా, ఒక్కక్షణం” అంటూ కామమ్మగారు లోపలికి వెళ్లి, ఓ పళ్లెంలో పళ్లూ తాంబూలాలతో తిరిగొచ్చారు. ముగ్గురికీ బొట్టు పెట్టి, తాంబూలాలు చేతిలో పెట్టారు.

ఒంగి వారిద్దరికాళ్లకి దణ్ణం పెడుతుంటే పరిమళకి కళ్ల నీళ్లొచ్చాయి. తను ఈ సాంప్రదాయాలు మరిచిపోయి ఎంతకాలం అయిందో .... కానీ ఈరోజు అప్రయత్నంగానే అలా వచ్చేసింది.

మరోసారి “వెళ్లొస్తాం మాష్టారూ, వెళ్లొస్తాం అమ్మా,” అని ఇద్దరికీ చెప్పి గేటువేపు నడిచారు ముగ్గురూను.

పరిమళ గేటుదగ్గర ఒక్కక్షణం ఆగింది. ఓరవొంపుగా తలొంచి, కొనకళ్ల చూస్తే మాష్టారు కండువాతో కళ్లొత్తుకోడం కనిపించింది.

చిన్నగా నిట్టూర్చి, రమణిభుజమ్మీద చెయ్యేసి ముందుకి నడిచింది పరిమళ ....

ooo

(గమనిక: పైన ఉదహరించిన పద్యం నాకు గుర్తున్నట్టుగా రాసేను. తప్పులుంటే మన్నించాలి.

రూపసీ, బుద్ధిమంతుడూ అయిన పాణిని బాల్యంలో విద్యలో మాత్రం అట్టే ప్రకాశించలేదట. ఆయన కొంతకాలం గురుకులవాసం చేసి, తరవాత, సహవాసి హేళన చేయడంచేతో, గురువుగారి ప్రోద్బలంతోనో హిమాలయాలకు వెళ్లి, తపస్సు చేసి అఘటిత ప్రజ్ఞాధురీణుడు అయేడనీ ఒక కథ.)

(మూడేళ్ళక్రితం నా ఫిష్షుఫారం స్నేహితురాలు శాంత నా ఆచూకి ఇంటర్నెట్లో పట్టుకుని ఫోను చేసింది. అప్పట్లో నేను జాకెట్టుకి జేబు పెట్టించుకున్నానని తనే చెప్పింది నాకయితే గుర్తు లేదు. కథగా రాసేసే కానీ నిజంగా నాకు గుర్తు లేదు. తెలుగు తూలిక. ఆగస్టు 2008. )

# 4. నీలితెరల మాటున దోబూచులాట

కంప్యూటరుముందు కూర్చుని వెబ్బుమబ్బుల్లో ఓలలాడుతోంది నీల కాని మనసంతా రాబోయే  మెయిలుమీదే వుంది.

తెల్లార్తూనే తొలికప్పు కాఫీలాగే ఈ ఈమెయిలు కూడా అలవాటయిపోయింది వారం తిరక్కుండా.

కిందటి మంగళవారం వచ్చింది మొదటి మెయిలు. ఆ రోజు నీలకి ఆదేమంత ప్రత్యేకంగా అనిపించలేదు. ఎవరో రామలక్ష్మిట ఓ మెయిలు పంపింది.

తనేదో మెయిలు చూసుకుంటుంటే ఓమూలని వెలిగిన కవరుబొమ్మ చూసి నీల యదాలాపంగా నొక్కింది దాన్ని.

"కొత్త తలపులు" సైటులో మీకవిత ఇప్పుడే చూశాను. చాలా బావుంది". - రామలక్ష్మి.

"థాంక్స్ అండీ". జవాబు కొట్టింది నీల

ఆవిడ ఇంకా లైనులో వున్నట్టుంది.

"మీరు ఇంకా ఏం రాసారు? మీజవాబు 'అవును' ఐతే ఎక్కడ?" - రా.

"లేదండీ. ఇదే ఓం ప్రథమం ☺," నీల జవాబిచ్చింది చిన్నగా నవ్వుకుంటూ.

"ఆలాగా! తొలిపలుకే మెరుపులా మురిపించింది.. రాస్తూవుండండి". రా.

"నేనంత రచయిత్రిని కానండీ. ఎప్పుడో తోస్తే నాలుగులైనులు గిలుకుతాను అంతే," - నీ.

"మీకు మంచి భావుకత వుంది". - రా.

"అమ్మో మరీ అలా పొగిడెయ్యకండి. మరోసారి థాంక్స్." - నీ.

"పొగడ్త కాదండీ.. ప్రతిభ ఉన్నచోట ఉందని చెప్పడంలో తప్పులేదు కదా. చెక్కభజన కాదులెండి" ... రా.

"మీరేమాటైనా ఇంత సూటిగా చెప్పేస్తారేమిటి?" - నీ.

"ఆహా, నిక్షేపంగా. సరే వుంటానండి. మళ్లీ రేపు మాటాడుకుందాం." - రా.

ఇద్దరూ నవ్వుకున్నారు రెండు నీలితెరల మాటున, రెండుసంద్రాలకి చెరో వైపునించీ.

ooo

ఆ మర్నాడు నీల మరెవరిదో ఓ కవిత చూసింది. తనకి చాలా బావుంది. ఆ పూటంతా ఆ కవిత తనని వెన్నాడుతూనే వుంది. ఆ సాయంత్రం కూచుని మెయిలు చూస్తూంటే, రామలక్ష్మి ఈ కవితగురించి ఏం అంటారో అనిపించి, వెంటనే ఓ మెయిలు కొట్టింది.

"హలో. ఈవారం "కొత్త తలపులు"లో "మబ్బుతునక, మంచుముక్క" కవిత చూశారా? మీ అభిప్రాయం ఏమిటో చెప్పండి." - నీ.

అవతల ఆవిడ లైనులో వుంది. వెంటనే జవాబు, "నేనూ ఇప్పుడే చూశాను, నేనూ అంతే. అదే మీరేం అనుకున్నారో అని **:->"** - రా.

"అందులో భావావేశం వుంది కాని కవితలా అనిపించలేదు. అయినా నాకు కవితలగురించి అంతగా తెలీదు లెండి. అందుకే మిమ్మల్ని అడుగుతున్నాను." - నీ.

"కవిత అన్నది జానెడూ మూరెడూ అంటూ కొలవలేం కదా. ఒకొక్కరు ఒక్కో కోణానికి స్పందిస్తారు. ఇప్పుడు ఈ కవితే చూడండి. మీకేమో అందులో ఆవేశం కనిపించింది. నాకేమో పదవిన్యాసం బావుందనిపించింది. ఒకే కవిత అయినా మనకి నచ్చిన కారణాలు వేరు." రా

"ఏమో మరి. నాకు షడ్రుచులతో విందారగించినతరవాత తాంబూలం తక్కువైనట్టనిపించింది చివరకి ;-)" - నీ.

"^D. హ్. తాంబూలం ,,, ఇప్పుడు తాంబూలాలెక్కడ?. బ్రెత్ ఫ్రెషనరులే కద ఎక్కడ చూసినా :-p." - రా

"బ్రెత్ ఫ్రెషనరా? ఎక్కడున్నారేమిటి?" - నీ.

"ఇంకెక్కడ, కలియుగ భూతలస్వర్గం. అట్లాంటిక్కి ఆవలిగట్టున మీవేపునించి చూస్తే". -రా.

"మీరు కవిత్వం రాస్తారా?" - నీ.

"లేదు. చదవడానికే చాలడం లేదు ఎక్కడలేని టైమూను. అయినా నేను కూడా ఎందుకులెండి చెయ్యేట్టడం అందులో -: )" - రా.

"సరేలెండి. ఇప్పటికింతే సంగతులు." -నీ.

ooo

"ఇంతకీ అమెరికాలో ఎక్కడ నివాసం? ఏంచేస్తున్నావు?" అనడిగింది నీల రామలక్ష్మిని.

"నేను షికాగోలో వున్నాను. నాకూ అదే ఆలోచన - ఏంచేస్తున్నానా? అని ఆలోచిస్తూంటాను :p."

"నేను కంప్యూటరు సైన్స్ చేస్తున్నా. రెండో ఏడు." నీల తను చెప్తే ఆవిడ చెప్తుంది అనుకుంది.

"హ్. బాగుంది." - రా.

"నీది ఏ ఫీల్డు?" - నీ.

"ఏ ఫీల్డూ లేదు. కాలేజీ ఒక ఏడాది వెలగబెట్టేనంతే." - రా.

తను మరీ పొడిచి పొడిచి అడుగుతున్నానేమో అనిపించి నీల అక్కడికి ఆ ప్రశ్నలు ఆపేసింది. ఈవిడెవరు? ఏంచేస్తోంది? అన్న ఆలోచనలు అలాగే వుండిపోయేయి.

బహుశా కాలేజీ చదువు చదువుతుండగా ఏ విదేశీ పెళ్లికొడుకో దిగేడేమో. ఈ పెళ్లికొడుకులు రావాలే కాని సుమూహూర్తాలు ఇట్టే దొరుకుతాయి. పెళ్లికొడుకులకి శలవు దొరికిన సమయానికి సరిగ్గా పజిల్లో ముక్కలు అతుక్కున్నట్టు కని విని ఎరగని శుభముహూర్తం కలిసొచ్చేస్తుంది. ఏ సద్బ్రాహ్మణుడో సాక్షాత్తు దేవతలు పెట్టిన కల్యాణఘుడియలు కనిపెట్టేసి పుణ్యం కట్టుకుంటాడు.. దేవతలు స్వయంగా వచ్చి దీవిస్తారని కూడా ప్రమాణం చేస్తాడు. నీల నవ్వుకుంది. ఇదంతా కేవలం తన ఊహాగానమే కావచ్చు కాని అనుకోడానికి సరదాగా వుంది.

మరో ఆలోచన కూడా వచ్చింది. అమెరికాలో నెట్ వెనకాతల పొంచుండి అమాయకులైన ఆడపిల్లల్నీ చిన్నపిల్లల్నీ వంచించే దుష్టులగురించి కూడా వింది. ఈ రామలక్ష్మి కూడా అలాటి దొంగపేరు కావడానికి ఆవకాశం వుంది కదా అన్నమాట తలుచుకున్నప్పడు నవ్వు రాలేదు. కాని ఎందుకో కొంచెంసేపయిన తరవాత అలా అనుకోడమే మహా పాపమనిపించింది. ఆత్మనా లెంపలేసుకుందేమో కూడాను.

ఆవిధంగా వరసగా ఈమెయిలులు హౌరా ఎక్స్‌ప్రెస్‌లా సాగిపోయేయి కొంతకాలం. అచిరాకాలంలోనే ఈమెయిళ్లలోంచి చాటులోకి దిగిపోయారిద్దరూ. ఇంచుమించు రోజూ కనీసం ఓ అరగంటసేపు చాటుకచేరీ పెట్టేసుకుంటున్నారు హుషారుగా. కవితలూ, కథలే కాక ఇతర విషయాలు, కదాచితుగా వ్యక్తిగతవిషయాలూ కూడా మేలాడుకోడం, మేలమాడుకోడం కూడా మామూలయిపోయింది. తమకే తెలీకుండా "మీరు"లొదిలేసి "నువ్వు"ల్లోకి మారిపోయారు.

ooo

"ఇందాకా మాఅమ్మ విశ్వంమామయ్య వస్తారు మాటాడమంది. తను పక్కింటికి వెళ్తున్నానని" - నీల.

"సరే. సిద్ధం అవు మరి." - రా.

"ఏం మాటాడతానాయనతో. మా తాతగారివయసు ఆయనకి. ఏం వుంటాయి ఆయనకీ నాకూ మాటాడుకోడానికి? అన్నాను. అదేలే ఆ మాట మాఅమ్మతో అన్నాను" - రా.

రామలక్ష్మి కొంచెంసేపు వూరుకుని, "ఏం చేసావు మరి?" అని అడిగింది.

"మాఅమ్మేమో ఆయనా మనిషే కదా, ఆ శృతిపెట్టె కంటె నయమే కదా అంది చిరాగ్గా ☺ " -నీల.

"శృతిపెట్టేమిటి?"

"అదే నా లాప్టాపు. ఇది రాకముందు నేను తనతో సరదాగా ఊసులాడుతుండేదాన్ని. మేమిద్దరం అసలు అమ్మా కూతుళ్లలా కాక అక్కచెల్లెళ్లలా కబుర్లూ, ఎకసెక్కాలూను.." - నీ.

"ఇప్పుడు మానేశావేమిటి?" - రా.

"ఇప్పుడు ఈ కంప్యూటరువల్ల అంతసేపు నేను తనతో గడపడం లేదని మాఅమ్మకి కోపం ☺ ".

":p. అదేం బాగులేదు. నేను మీఅమ్మతరుఫే.."

";). అన్యాయం. ముందొచ్చిన చెవులకంటె వెనకొచ్చిన కొమ్ములు వాడి అంటే ఇదే.." - నీల.

"మరే ☺)"

ooo

"నిన్న చదవమని ఒస్నేహితురాలు Point of no return అని ఓ పుస్తకం తెచ్చిచ్చింది. నువ్వు చదివేవా?" -నీ

"లేదు, లేదు. రెండు ప్రశ్నలకీను." - రా.

"మా నేస్తురాలు చెప్పడం అలాటి పుస్తకం అదొక్కటే అని. కని విని ఎరగం అసుమంటి బుక్కు అంటుంది" - నీ.

":p. ఆ మాటకి అర్థం ఎలాగైనా చెప్పుకోవచ్చు." - రా

"ఏమో, చదివి చెప్తాలే." -నీ.

ooo

"నిన్న **తారే జమీన్ పర్** సినిమా చూశా. నువ్వు చూసావా?" - నీ.

"నేను సినిమాలు అంతగా చూడను. నేను చూసిన ఆఖరి సినిమా **ప్రాణమిత్రులు** అనుకుంటాను.." - రా.

"అయ్యో రామా. అది వచ్చేనాటికి నేనే కాదు మాఅమ్మయినా పుట్టిందో లేదో. :p. ఆ తరవాత నువ్వు సినిమాలే చూడలేదా?"- నీ.

"ఏమో మరి, నాకు ఆ పాత సినిమాలే బావుంటాయి." - రా.

"సరే. పుస్తకాలగురించి మాటాడుకుందాం. ఏ రచయితలు ఇష్టం నీకు?" - నీల.

"నువ్వు Bridge on the river Kwai చదివావా?" - రా.

"వినను కూడా లేదు. ఎవర్రాశారు?" - నీ.

"పేరు గుర్తు లేదు, కాని చాలా బాగుంది. చిన్నపుస్తకమే. సినిమా కూడా వచ్చింది" -రా.

"నీకెక్కడ దొరుకుతాయి ఇవన్నీ? నువ్వు చెప్పేవన్నీ అమ్మమ్మలకాలంవి. ఆ తరవాత సాహిత్యం లేదనుకుంటున్నావేమిటి. :P." నీ.

"నువ్వు చెప్పినవి నాకూ తెలీదు కద. సాహిత్యం సాగరం అనడానికి ఇంతకన్నా నిదర్శనం ఏంకావాలి? ☺ " - రా.

"ఇవన్నీ మా లైబ్రరీలో లేవు. నీకెలా దొరుకుతున్నాయా అని". - నీ.

"మా అమ్మమ్మకి చదవడం చాలా ఇష్టం. ఆవిడే ఓ ఎన్సైక్లోపీడియా. 1870తరవాత ఏ పుస్తకం అడగు. మొత్తం చరిత్ర అంతా చెప్పేస్తుంది." - రా.

"అంటే? 1870లో వున్నారేమిటి ఆవిడ ☺)" -నీ.

"అబ్బ ఆవిడ కాదమ్మా, మనకి ప్రింటింగు వచ్చింది అప్పుడూ :^D. హాస్యానికన్నాను." - రా.

"సరేలే, ఇకమీదట వికీపీడియాకి బదులు నిన్నే అడుగుతా ఏం కావలిసినా :p." - నీ.

" ☺)) 1950కి పూర్వం అయితేనే. :p." - రా.

"మరి శలవా"

"ఉంటాను మరి".

ooo

రెండురోజులుగా రామలక్ష్మిదగ్గరినుండి ఏ మెయిలూ లేదు. రవికిరణాలతో ఏతెంచే ఈ ఉదయటపాలు కనిపించకపోతే ఏం బాగోలేదు నీలకి. ఇలా హఠాత్తుగా ఆగిపోడం మర్యాదగా లేదు. ఎక్కడికేనా వెళ్లిందా? చెప్పి వెళ్లొచ్చు కదా. కంప్యూటరుకష్టలేమో. అమెరికాలో కూడా ఉంటాయా?.

"హలో. రెండ్రోజులై మేలుబండి రాసేదు. అంతా పసేనా?" నీల రామలక్ష్మికి ఓ మెయిలు కొట్టి ఆ రోజుకి తనపనిలో పడిపోయింది. మరో రెండురోజులు గడిచేయి. అవతల్నించి మేల్గాడీ జాడ లేదు.

"హలో. బావున్నావా? నీ మెసేజిల్లేక నా ఇన్నుబాక్సు చిన్నబోయింది ☹ " -నీల మళ్లీ మరో మెయిలిచ్చింది.

ooo

ఆ మర్నాడు శనివారం. నీల మెయిలులు చూసుకుంటే తనకి పరిచయం అయిన ఐడితో మెయిలొచ్చింది.

"అమ్మమ్మకి ఒంట్లో బాలేదు."

"అయ్యో. డాక్టరుదగ్గరికి తీసుకెళ్లారా?" నీల ఆతురతగా అడిగింది. తను ఇంతకు ముందు ఈ నేస్తురాలిగురించి అనుకున్న మాటలు గుర్తొచ్చి నొచ్చుకుంది కూడా వెనువెంటనే..

"ఆస్పత్రిలోనే వుంది" - ఆర్.

నీల స్క్రీనుని పరీక్షగా చూసింది. రామలక్ష్మి మామూలుగా తెలుగులో రాస్తుంది. పైగా ఆర్ అని పెట్టదు సంతకం. అయినా మనస్సు బాగోలేనప్పుడు అలవాటయిన భాష ముందొస్తుందన్న దివ్యసూత్రం తలుచుకుని తను కూడా ఇంగ్లీషులోనే జవాబిచ్చింది.

"ఫరవాలేదు. అక్కడ డాక్టర్లు బాగా చూస్తారు కద. నీకు వీలయినప్పుడే రాయి". -నీ.

ఓ నిముషం విరామం.

నీలకి అర్థం కాలేదు. అవతల రామలక్ష్మి వున్నట్టా? లేనట్టా?

మళ్లీ బాక్స్ వెలిగింది. "నేను మీకు రాయొచ్చా?" – ఆర్.

"అంటే?"

"యూ అమ్మమ్మాస్ ఫ్రెండ్." - ఆర్. .

నీలకి తికమక అయిపోయింది, తాను ఎవరితో మేలాడుతోంది? ఎవరికి వొంట్లో బాగులేదు? రామలక్ష్మికా? వాళ్లమ్మమ్మకా? ఇప్పుడు చాట్లో ఉన్నదెవరు? రామలక్ష్మేనా? ఇంకెవరేనా దారితప్పి ఇటొచ్చేశారా?

"నో. ఐ రాహుల్. అమ్మమ్మకి మీరు చాలా ఇష్టం". - ఆర్.

ఇదీ మరీ గందరగోళంగా వుంది. ఎవరీ రాహులుడు?

"నువ్వేం చదువుతున్నావు?" - నీ.

"5. నేనే అమ్మమ్మకి కంప్యూటరు స్కిల్సు నేర్పింది. నాకు తొమ్మిదన్నర ఏళ్లు." - ఆర్.

తాను మేలాడుతున్నది రామలక్ష్మి మనుమడని గ్రహించగానే నీలకి ఫక్కున నవ్వొచ్చింది. "ఓ, అలాగా. మంచిపని చేశావు." అంది నీల నవ్వుకుంటూ.

"ఆవిడకి అసలు కీబోర్డు తాకడానికి కూడా భయమే☺. నేనే చెప్పా తెలుగుకథలూ అవీ నెట్‌లో చూడొచ్చనీ. ఈమెయిలూ, ఇమోటికానులు అవన్నీ నేనే చూపించేను. నా ఐడీలోనే మీకు రాస్తోంది." --రాహుల్ హుషారుగా కొట్టిపారేస్తున్నాడు టకటక. వాడికి తాను సాధించిన ఘనవిజయం మహ గొప్పగా వుందన్న సంగతి నీలకి స్పష్టం అయింది.

నీలకి మరో సందేహం. మరి రామలక్ష్మి చెప్పే అమ్మమ్మ ఎవరు?

"ఓ, అలాగా. సరే. మీ అమ్మమ్మని అడిగానని చెప్పు. ... అవునూ, మీ అమ్మమ్మకి వాళ్ల అమ్మమ్మ, ఆవిడ కూడా అక్కడే వున్నారా?" - నీ.

"నో నో నో. అమ్మమ్మ వాళ్లఅమ్మమ్మగురించి కథలు చెప్తుంది అంతే. నేను ఎప్పుడూ చూడలేదు." - ఆర్.

"అవును, నాక్కూడా చెప్పింది మీ అమ్మమ్మ వాళ్ల అమ్మమ్మకథలు." - నీ.

"మా అమ్మమ్మకి మీరు చాలా ఇష్టం. మిమ్మల్ని 'చిన్నినాచుట్టం' అంటుంది. నాకు చాలా హొమ్ వర్కు , బై."

" ☺). సరే. హొమ్‌వర్క్ చేసుకో. " - నీ.

"మాఅమ్మమ్మ తొందరగా ఇంటికి వచ్చేస్తే బాగుణ్ణు. అమ్మమ్మ ఇంట్లో లేకపోతే ఏం బాగులేదు."

"ఫరవాలేదులే. తొందరగానే వచ్చేస్తుంది." నీల ఆ చిన్నవాడికి ధైర్యం చెప్పింది.

"నేను మీకు రాయొచ్చా?" - ఆర్.

"తప్పకుండాను. రాస్తూ వుండు. మీఅమ్మమ్మకి ఎలా వుందో చెప్పు." - నీల.

రామలక్ష్మి తనకంటే పెద్దది అన్నమాట అర్థం చేసుకోడానికి కొంతసేపు పట్టింది కానీ నమ్మలేకుండా ఉంది. ఆవిడతో చాటు సాటి మిత్రులతో చేస్తున్నట్టే

అనిపించింది ఇన్నాళ్లూ. ఆవిడ ఎందుకు ఈ విషయం స్పష్టం చెయ్యలేదు తనకి? తను విశ్వం మామయ్యగురించి చెప్పినమాట మూలంగానా? .. చాలాసేపు ఆలోచిస్తూ కూర్చుండిపోయింది నీల.

రేపు ఆవిడ మళ్లీ మెయిలిస్తే తను "నువ్వు" అంటూ ఏకవచనంలో సంబోధించగలదా? లేదా అన్న సదసత్సంశయంలో చాలారాత్రి అయిపోయింది … ఈ నీలతెరలచాటున భేటీ. అటు వెనకటితరంనించి రామలక్ష్మి, ఇటు ముందుతరంలో చిన్నవాడు రాహులుడూ, మధ్యధరాసముద్రానికి మరోవైపున తనూ …

పడుకోబోతూ, నీల డైరీలో రాసుకుంది, "ఈ రోజు నాకు ఒక కొత్త చిన్ని నేస్తం దొరికాడు.".

ooo

(నేను నా బ్లాగు తెలుగు తూలిక మొదలు పెట్టినతరవాత చాలామంది యువ బ్లాగరులు పరిచయమయేరు. అప్పుడే నాకు అర్థమయింది కంప్యూటరు దేశ, కాల, వయో పరిధులని అధిగమించేసాధనం కాగలదన్న సత్యం. అలాగే వయో పరిమితులని కూడా అనుకుంటున్నాను. ఏప్రిల్ 2008.)

# 5. దృక్కోణాలు

నా స్నేహితురాలు ఎమిలీ లంచికి పిలిచింది నన్ను.

“ఎక్కడ కలుద్దాం?” అనడిగేను.

“నీకు కారాలు ఇష్టం కదా. రొటిసరీకి వెళ్దాం. సదర్న్ వంటకాలు రుచి చూద్దువు గానీ,” అందావిడ.

మన ఆచారాలూ, వ్యవహారాలూ, విలువలూ తెలుసుకోవాలని ఆవిడకి తహతహ.

నాకు వారి సాంప్రదాయాలలో ఆసక్తి. అంచేత మేం కలుసు మాటాడుకుంటుంటాం అప్పుడప్పుడు. నిజంగా తరచి చూస్తే అట్టడుగు పొరల్లో బేధాలు అట్టే లేవేమో అనిపిస్తుంది కూడా నాకు.

ప్రాక్ - పశ్చిమాలు

తన బ్లూజీన్సుకి దీటుగా నా కుంకుమ బొట్టు

ఆవిడది శ్వేతవర్ణం - నాది కాఫీరంగు

శిశిరంలో శీతలం - నిప్పులు చెరిగే ఎండలు

సదర్న్ చికెన్ - యెలపినో మిరపకాయలు

ఓ చిన్నబల్లకి చెరో పక్కనా కూచున్నాం ఇద్దరం రెండు లోకాలకి ప్రతినిధుల్లా.

మనకి తెలిసిన సంగతులకీ తెలీని సంగతులకీ మధ్య కోటానుకోట్ల వినీలనీడలు ...

మనం చెప్పదల్చుకున్న మాటకీ అప్రయత్నంగా వెలువడే వాక్యసరళికీ మధ్య తేలియాడే అనంతాకాశం ...

అనాలోచింగానే కుటుంబవిషయాల్లోకి జారాయి మా కబుర్లు - చెప్పదలుచుకున్నవీ, చెప్పదలుచుకోనివీ, చెప్పకూడదనుకున్నవీ, చెప్పగలిగినవీ, చెప్పలేనివీ ... దొర్లిపోతున్నాయి నీటిజాలులో పండుటాకుల్లా.

వెనకెప్పుడో నేను ఇచ్చిన ఉపన్యాసంమాట వచ్చింది. సీనియర్ సిటిజనులకోసం ఏర్పాటు చేసిన సభ అది. "వాళ్ళు నా చిన్నతనం, నేను పెరిగిన వాతావరణం.. ఏవేవో అడుగుతున్నారు. నేను తగు సమాధానాలిస్తూ, నా చిన్నతనంలో నేను ఇంటిపనులేమీ చేసేదాన్ని కాను అన్నాను. You are spoiled అంది ఒకావిడ. నాక్కోపం వచ్చింది," అన్నాను.

"అలా అనడంలో ఆవిడ అభిప్రాయం ఏమిటో అడిగేవా?" అంది ఎమిలీ.

"నిజానికి నాకది అవమానంగా తోచింది. మా సంప్రదాయాల సంగతి సందర్భాలు అర్థం చేసుకునే ఆలోచన ఆవిడకున్నట్టు లేదు అనిపించింది. వాళ్ళు మళ్ళీ పిలిస్తే నేను రాను పొమ్మన్నాను."

000

మధ్యగదిలో కూచుని కిటికీలోంచి దూదిపింజెల్లా గాలిలో తేలియాడుతున్న మంచు తుంపరలు చూస్తున్నాను. మోడు వోయిన కొమ్మలమీద అలవోకగా వాలుతున్న మంచూ, ఉండీ ఉడిగీ కలుగుల్లోంచి వెలుగులోకొచ్చే ఉడతలూ, తమ గుంపుతో పాటు దక్షిణయాత్రకి తరలకుండా వెనక్కుండిపోయిన ఒకటీ రెండూ కొంగలూ - ఇంట్లో కూచుని చూడ్డానికి తమాషాగా ఉంటుంది ఇక్కడి చలికాలం.

నిన్నటి సంభాషణ గుర్తుకొచ్చింది. ఆలోచిస్తుంటే అనిపిస్తోంది - నన్ను spoiled అన్న వృద్ధురాలికంటే నేనెలా మెరుగు? నేనూ అనాలోచితంగానే ఒక అభిప్రాయానికొచ్చేలేదూ? నన్ను ఆవిడ చులకన చేసిందనే అనుకున్నాను కానీ ఆవిడ హాస్యానికందేమో, మరింత విడమర్చి చెప్పమని ఆవిడ

అభిప్రాయమేమో? అసలేమీ కాదేమో ... ఊరికే ఏదో ఒహటి మాటాడాలనో, విసుగేనో, వచ్చే నిద్ర ఆపుకోడానికో .. ఏదైనా కావచ్చు కారణం.

ఆకాశం దట్టంగా ముసురేసి ఉంది. మంచు క్రమంగా నీటి తుంపరలుగా మారిపోతోంది. freezing drizzle అంటారు. అదేమిటో నాకు మాత్రం హాస్యాస్పదంగా ఉంటుందామాట తియ్యని కారంలా.

మళ్ళీ ఆలోచనలు ... ఎమిలీ శనివారం తల్లిని చూడ్డానికెళ్తోందిట. కొడుకు తను పెళ్ళి చేసుకోబోయే అమ్మాయిని తీసుకు వస్తున్నాట్ట అమ్మమ్మకి పరిచయం చేయడానికి.

"బావుంది చిన్న family reunion," అన్నా.

ఎమిలీ సాలోచనగా నావేపు చూసి, "అంత తేలిక కాదు," అంది.

నేను మాటాడలేదు.

"పిల్లలిద్దరూ పెళ్ళి కాకుండా కలిసి ఉంటున్నారని మాఅమ్మకి కోపంగా ఉంది. వాళ్ళతో మాటాడనంది. అబ్బాయి మాత్రం కాబోయే భార్యని తీసుకురాడానికే నిశ్చయించుకున్నాడు. ఆవిడ ఏమైనా అంటే అననీ గాక అన్నాడు."

వైట్రెస్ వచ్చింది ఏం తెమ్మంటారంటూ.

ఎమిలీ చికెనూ, నేను సూపూ చెప్పేం. తన చేతిలో పుస్తకంలో రాసుకుని ఆమె నిష్క్రమించింది ఒంగి ఒంగి సలాములు చెయ్యడం తరువాయిగా. నేను చిన్నగా నవ్వుకుని కిటికీలోంచి వీధిలో హడావుడిగా పరుగులు పెడుతున్న కార్లు చూస్తున్నాను.

ఎమిలీ తలొంచుకువి తనలో తనే మాటాడుకుంటున్నట్టు నెమ్మదిగా మాటాడుతోంది, "మాఅమ్మకి మంకు పట్టు. 'నాకు ఇంత కాలం ఇలా జరిగిపోయింది. ఇప్పుడు నేనెందుకు మార్చుకోవాలీ నా అభిప్రాయాలు,'

అంటుంది. ఆవిడ నమ్మకాలు ఆవిడవి. నేనెక్కడ బాధ పడతానో అని ఆవిడ ఆరాటం.''

నాకేం మాటాడ్డానికీ తోచలేదు.

కొన్ని క్షణాలూరుకుని మళ్ళీ ఆవిడే మొదలుపెట్టింది, ''తన కూతురిగురించి ఆవిడకీ నా కొడుకుగురించి నాకూ మనస్తాపాలు,'' లీలగా ఎమిలీపెదవులమీద ఓ చిరునవ్వు మెరిసింది.

ఆ ముఖకవళికలు చూస్తూ ఎంతసేపు కూర్చున్నానో అలా ...

ooo

ముసురుకున్న ఆకాశంలో మసలుతున్న ఫ్రీజింగ్ డ్రిజిలు ... నీటితుంపరలుగా రూపాంతరం చెందుతున్న మంచుతునకలు ... మళ్ళీ మళ్ళీ ఎమిలీమాటలే మనసులో మెదులుతున్నాయి - ''నాకొడుకు క్షేమం నాక్కావాలి. ఆవిడకూతురి క్షేమం ఆవిడక్కావాలి.''

ఆ తల్లీకూతుళ్ళ సంభాషణ ఊహించుకోడానికి ప్రయత్నిస్తున్నాను.

నాకు మరో సంభాషణ గుర్తుకొచ్చింది. ఒక బామ్మ మనవడిమధ్య. నిజంగా జరిగిందో లేదో నాకు తెలీదు. కానీ మామూలుగా మనయిళ్ళల్లో అలాటి సందర్భాల్లో ఎలా ఉంటాయో అలా ఊహించుకున్నాను.

- తల్లీకొడుకులమధ్య
- తల్లీకూతుళ్ళమధ్య

అమ్మమ్మలూ, బామ్మలూ ఒపక్కా మనవలూ మనవరాళ్ళూ మరోపక్కా ఆలోచిస్తూంటే, కిందటేడు బజారులో పరిచయం అయిన అబ్బాయి జ్ఞాపకానికొచ్చేడు. ఇప్పుడు పేరు కూడా గుర్తు రావడంలేదు. శామ్ అని పిలవమన్నాడనుకుంటా. ఏదో ట్రైనింగుకోసం వచ్చేట్ట, మూణ్ణెల్లపాటు ఉంటాట్ట. నాచేతిలో పుస్తకం చూసి, ''నేను కూడా తెలుగువాణ్ణేనండీ,'' అంటూ మొహం చింకి చేటంత చేసుకుని, కాస్సేపు ఆ మాటా ఈ మాటా అయింతరవాత ''మీతో

మాటాడాలండీ,'' అంటూ ఫోన్నెంబరు తీసుకున్నాడు. అరగంట కూడా లేదు పరిచయం. ఇతనికి నాతో మాటాడ్డానికేం ఉంటాయనుకున్నా కానీ ఇక్కడిది మామూలేలే అని సరి పెట్టుకుని నెంబరిచ్చేను. పైగా చాలామంది నెంబరయితే అడుగుతారు కానీ మళ్ళీ పత్తా ఉండరు.

అందుకే రెండురోజులు కాకుండానే శామీ పిలిచేసరికి నేను రవంత అక్కజపడ్డాను. "అలాగే ఆదివారం సాయంత్రం రండి. భోంచేస్తూ మాటాడుకుందాం,'' అన్నాను. ఇది కూడా ఈ దేశం పద్ధతే. అదేం ఖర్మో, ఈదేశంలో వీళ్ళకి దవడాడితే కానీ మెదడాడదు. కనీసం కాఫీ అయినా లేకుండా సంభాషణ సాగదు.

శామీ మాత్రం మొహమాటపడ్డాడు, "ఎందుకండీ మీకు శ్రమ. ఊరికే మాటాడ్డానికి వస్తాను. మా పెళ్ళి ఫొటోలు చూపిస్తాను.''

"అలాగే. ఎక్కడున్నారో చెప్పండి. కారు తీసుకొస్తాను.''

"ఎందుకండీ మీకు శ్రమ. మీ ఎడ్రెస్ చెప్పండి. బస్సులో వస్తాను.''

చెప్పేనే కానీ ఇతడిధోరణి వింతగానే ఉంది అనుకోకుండా ఉండలేకపోయేను. సాధారణంగా మనవాళ్ళు అందునా కొత్తగా వచ్చినవాళ్ళు మనరుచులకోసం కనీసం మొదటి ఆర్నెల్లూ చాలా ఇష్టపడతారు. కారు తీసుకొస్తాం అంటే వద్దనరు. ఇదేదో సీరియస్సే అయుండాలి ...

అనుకున్నట్టే ఆదివారం సాయంత్రం ఆరుగంటలకి వచ్చేడు. అట్టే ఆలస్యం చెయ్యకుండానే సంచీలోంచి పెళ్ళిఫొటోలు తీసేడు.

నెమ్మదిగా తెరలు తీసినట్టు పొరలు పొరలుగా కథ విచ్చుకుంటోంది.

శామీ అమెరికాకొచ్చేముందు, రెండురోజులకి బయల్దేర్తాడనగా పెళ్ళయింది. తెలిసిన అమ్మాయే. తన ఆఫీసులో తన ట్రెనింగ్ సూపర్వైజరుట. అనతికాలంలోనే వారి పరిచయం ఉద్యోగావధులు దాటి, వ్యక్తిగత స్నేహానికి దారి తీసింది. అంతలోనే అమెరికాలో శిక్షణకి వెళ్ళమన్నారు. పెళ్ళి చేసుకు వెళ్ళమని

పట్టుపట్టిందా అమ్మాయి. ఈయన కాదనలేక చేసేసుకోడానికి ఒప్పేసుకున్నాడు. అందులో లొసుగేమిటంటే, తల్లికీ తండ్రికీ చెప్పే దమ్ముల్లేకపోయేయి అతగాడికి.

ఎందుచేతనంటే ...

ఆ పెద్దవాళ్ళిద్దరూ పరమఛాందసులు. తరతరాలుగా వస్తున్న ఆచారాలని తు.చ. తప్పకుండా పాటిస్తారు. కులాంతరవివాహానికి ఛస్తే ఒప్పకోరు. అసలు శాఖలు వేరయితేనే ఉరేసుకు ఛస్తాం అంటారు. వీళ్ళు వైదీకులు, అమ్మాయి నాయుళ్లవారి పడుచు. అది చాలనట్టు ఉద్యోగంలో కూడా పైస్థాయిలో ఉంది. ఆడపిల్లని ఇచ్చేచోట పైస్థాయిలో ఇవ్వాలి, తెచ్చుకునేచోట దిగువస్థాయిలోంచి తెచ్చుకోవాలని కదా శాస్త్రం!

శామీ ఒకొక బొమ్మ చూపిస్తూ చెప్తున్నాడు, ''నేను ఆవిడని ఒదిలి బతకలేను. అంచేత ఒప్పేసుకున్నాను అంత హడావుడిగా చేసేసుకోడానిక్కూడా. వాళ్ళవాళ్ళే పూనుకుని పెళ్ళి జరిపించేశారు.''

బొమ్మలు బావున్నాయి. శాస్త్రోక్తంగా చేశారు గౌరీపూజ దగ్గర్నుంచీ, అగ్నిహోత్రం, మంగళసూత్రధారణ, సప్తపాదాలు, హనీమూన్ బొమ్మలతో సంపూర్ణంగా ఉంది ఆల్బమ్.

తక్కువయింది ఏమిటంటే వరునికి ఇరుపక్కలా ఉండవలసిన తల్లిదండ్రులు లేకపోవడం! వరుడితరఫున చుట్టం అతనొక్కడే.

ఎంచేతనంటే ...

''చెప్పలేకపోయేను చూస్చూసి మాఅమ్మకీ నాన్నగారికీ. వాళ్ళు చాలా బాధ పడతారు. మానాన్నగారు మండిపడతారు. మా బామ్మ నాపెళ్ళి చూడ్డానికే బతికున్నానంటోంది. ఈమాట వింటే ఆవిడ తల బద్దలు కొట్టుకుంటుంది. మా అమ్మ గుండె పగిలిపోతుంది.''

నేను తీక్ష్ణంగా చూసేనతనివంక.

తన తల్లిదండ్రులని ఒప్పించి పెళ్ళి ఏర్పాట్లు చేయించుకోగల గుండెబలం ఆ పిల్లకుంది గానీ ఇతడికి లేకపోయింది. తరతరాలుగా స్థిరపడిపోయిన కులతత్త్వాలని కాదని వర్ణాంతర వివాహానికి తలపడిన ధీరనాయకుడు! వధువుపక్కన ఒంటరిగా కూర్చున్నది కూడా అతడే. మొత్తం పెళ్ళి తంతు అంతా ఏకాకిగా జరగనిచ్చేడు.

అతన్నిగురించి ఏమనుకోవాలో నాకు తోచలేదు. కులవ్యవస్థని ధిక్కరించిన ధీరుడా? కన్నతల్లినీ కన్నతండ్రినీ పిలవలేకపోయిన పిరికివాడా?

అతను నాతో మాటాడ్డానికి ఎందుకంత ఆతురపడ్డాడో నాకిప్పుడు అర్థఁవయింది. నన్ను టార్గెట్ ప్రాక్టీసుకి వాడుకుంటున్నాడు - తల్లితో మాటాడుతున్నప్పుడు ఎలా ఉంటుందో తెలుసుకోడానికీ రిహార్సలు!

దుర్మార్గుడా! అనుకున్నాను మనసులోనే.

''మాఅమ్మ గుండె బద్దలయిపోతుంది,'' అంటున్నాడు తలొంచుకుని నేలకేసి చూస్తూ.

''ఆవిడగుండె బద్దలయింది. ఆవిడకి తెలీదంతే,'' అన్నాను కఠినంగా.

''అవును,'' అన్నాడతను, తలెత్తకుండా, పట్టుబడ్డ దొంగలా నేలమీంచి కళ్ళు మరల్చకుండా.

ooo

మంచు ఆగి వాన మొదలయింది. ఇప్పుడు వీధిలోకి వెళ్తే జారిపడ్డం ఖాయం. ఇంక ఇవాళ్టికి వాక్ లేనట్టే.

ఏ దేశంలో ఏ భాషలో మాటాడినా ఆంతర్యాల్లో అట్టే వ్యత్యాసం లేదేమో అనిపిస్తోంది ఎమిలీ మాటలు తల్చుకుంటుంటే. ఏ దేశంలోనూ, ఏజాతిలోనూ కుటుంబానికి సంబంధించిన నీతిసూత్రాలు ఒక్కలాగే ఉన్నాయి ఏ ఒక్కకాలం తీసుకున్నా. తేడా ఎక్కువగా కనిపిస్తున్నది ఒక తరంనించీ మరో తరానికే. విలువలు మారుతున్నది తరాలవారీగా కానీ దేశాలవారీగా కాదేమో.

ooo

(ఈకథ మొదట ఇంగ్లీషులో Lunch at Rotisserie's అన్న పేరుతో రాసేను. Sulekha.comలో ప్రచురించారు. ఆగస్టు 2002)

# 6. పై చదువులు

అలనాటి నేస్తం చక్రధరం రామకోటికి ఉత్తరం రాసేడు.

రామకోటికి ఓ పూటంతా ఆలోచిస్తే గానీ గుర్తుకి రాలేదు ఈ చెలికాడు. గుర్తుకొచ్చిం తరవాత "అవును సుమా. వక్రధరం అనేవాళ్ళం. అతని లాజిక్కు అతనికే కానీ మరెవరికీ అర్థం అయేది కాదు ఏ విషయంలోనైనా సరే. ఆ రోజుల్లో చెట్టాపట్టాలేసుకు తిరిగినవాళ్ళమే," అన్నాడు భార్య రాజేశ్వరితో. వలస వచ్చేశాక పాతస్నేహాలు మర్చిపోయేనే అని ఒకింత నొచ్చుకున్నాడు కూడా.

ఉత్తరం మామూలే. "ఇచ్చట మేము క్షేమము, నువ్వూ నీకుటుంబమూ క్షేమమేనని తలుస్తాను" అంటూ మొదలుపెట్టి, "మావాడు మీదేశం వస్తున్నాడు, నువ్వున్నావు, చూసుకుంటావన్న భరోసాతో పంపిస్తున్నాను" అంటూ ముగిసింది.

తన పెద్దకొడుకుని తీసుకుని నెలరోజుల్లో దిగుతున్నాడాయన.

"ఏం చేద్దాఁవంటావు?" అని అడిగేడు రామకోటి రాజేశ్వరిమొహంలోకి చూస్తూ.

ఇలాటివిషయాల్లో ఇష్టాలూ కష్టాలూ ఇద్దరికీ అవగతమే. అవునన్నా తప్పే కాదన్నా తప్పే. ఒపక్క మనవాళ్ళకేదో చేద్దాఁవన్న తపన, మరోపక్క తీరా తీసుకొచ్చేక ఆ చిన్నవాడు ఏ తంటాల్తెస్తాడోనన్న భయం.

వాళ్ళు అలా తర్జనభర్జనలు చేస్తూండగానే చక్రధరంనించి మరో టెలిగ్రాం వచ్చింది ఫలానా రోజున దిగుతున్నామనీ, ఎయిర్పోర్టుకి రావలసిందనీ.

"ఆడపిల్లని అత్తారింటికి పంపినట్టు ఆయన కూడా వస్తున్నాడా?" అంది రాజేశ్వరి చిన్నగా నవ్వి.

"విత్తంకొద్దీ విభవం. డబ్బుంటే సరి ఎలాటి పోకడలయినా చెల్లుతాయి," అన్నాడు రామకోటి.

ooo

అనుకున్నరోజున సుపుత్రుడు సనత్ కుమార్‌తో అట్టహాసంగా దిగేడు చక్రధరం సరికొత్త సూటులోనూ నాలుగు సూట్‌కేసుల్తోనూ.

రామకోటి ఎయిర్పోర్టుకి వెళ్లి వాళ్లని ఇంటికి తీసుకొచ్చేడు.

ఆనవాయితీప్రకారం చక్రధరం పెట్టెలోంచి ఆవకాయా, వడియాలూ, పట్టుచీరా, పసుపు కొమ్ములూ రాజేశ్వరిముందుంచుతూ, "మన ఆచారాలు, మ్. ఏమిటో మీవదిన చాదస్తం. మీకు నచ్చుతాయో నచ్చవో అన్నాను కానీ మీ వదిన వదిల్తేనా."

"మాకిక్కడ ఆవకాయా, వడియాలే అపురాపఁవండీ. చీర మాత్రం అనవసరంగా తెచ్చేరు. ఉన్న చీరెలు కట్టుకోడానికే సందర్భాలుండవిక్కడ," అంది రాజేశ్వరి మొహమాటపడుతూ.

"ఫరవాలేదులెండి. కావాలనుకున్నప్పుడు అప్పటికప్పుడు బజారుకెళ్ళి తెచ్చుకోవాలంటే జరగదు కదా ఇక్కడ."

సనత్ కుమార్ స్నానం చేసి పైజామా లాల్చీ ధరించి వచ్చేడు. ఓ మోస్తరు పొడుగూ, ఓ ఛాయ తక్కువే అయినా బెంగాలీవాడికళ వచ్చింది ధరించిన దుస్తులమూలంగా.

రాజేశ్వరికెందుకో అతనివరస తమాషాగా అనిపించింది. ఇదీ అని స్పష్టం కానీ సందేహాలేవో తలెత్తేయి మనసులోనే.

మాటలసందర్భంలో తెలిసిన విషయాలు - చక్రధరానికి నలుగురు పిల్లలు. ఇద్దరు పోగా మిగిలిన ఇద్దరు కొడుకుల్లో సనత్ కుమారు పెద్దవాడు. తాతగారిపేరు సన్యాసయ్య. దాన్ని ఆధునీకరించి సనత్ కుమార్ అని పెట్టుకున్నారు. చిన్నప్పట్నుంచీ బుద్ధిగా చదువుకుంటున్నాడు. అంచేత

పైచదువులు చదివించి వృద్ధిలోకి తీసుకొచ్చే ప్రయత్నం అతనికి పదేళ్ళప్పుడే మొదలయింది.

భోజనాలకు్కూచున్నారు. సనత్ కుమారుడు ఇబ్బందిగా కదిలేడు కుర్చీలో.

చక్రధరం మొహంనిండా చిర్నవ్వు పులుముకుని, "వాడికి చేత్తో తినడం అలవాటు లేదు. ఫోర్కుంటే పడెయ్యి తల్లీ వాడికి. నాకు లేకపోయినా ఫరవాలేదు. వాడికే ఆ షోకులన్నీ," అన్నాడు.

"దానికేంలెండి," అంటూ రాజేశ్వరి ఫోర్కూ స్పూనూ తెచ్చి ఇద్దరికీ అందించింది.

కట్లరీ ఇచ్చినా సనత్ కుమార్ సరిగ్గా తిన్లేదు.

"మీ అమ్మగారివంట్లలా ఉండవు మరి," అంది రాజేశ్వరి సన్నగా నవ్వుతూ.

"వాడింత ఖారాలు తిన్లేడు. బ్రెడ్ లేదూ? సాండ్విచ్ వాడే చేసుకుంటాడులెండి" అన్నాడు తండ్రి.

రాజేశ్వరి తెల్లబోయి, అంతలోనే తెలివి తెచ్చుకుని, "అయ్యో దానికేంలెండి. ఉండండి. తెస్తాను. మామూలుగా మన దేశంనించి వచ్చినవాళ్ళు కొన్నాళ్ళదాకా మన రుచులే తింటారని చేసేను. రాత్రికి కారాలు తగ్గించేస్తాను," అంది.

"అయ్యో, మరీ అంత పట్టింపుల్లేవులెండి. రోములో ఉన్నప్పుడు రోమనుపద్ధతులే కదా మరి. వాడికోసం వేరే శ్రమ పడకండి," అన్నాడే కానీ రాజేశ్వరికి అలా వినిపించలేదు ఆయనమాటలు. భోజనం పూర్తయేలోపున ఆయన ఆ కుర్రాణ్ణి "పై చదువుల"కోసం ఎంత పక్కాగా తీరిచి దిద్దేరో తేటతెల్లం అయిపోయింది.

ఆ అబ్బాయి చేత్తో ఏదీ ముట్టుకోడు. ముట్టుకుంటే సబ్బుతో "సుభ్భరంగా" చేతులు కడుక్కుంటాడు. చెప్పుల్లేకుండా ఇంట్లో కూడా అడుగు కదపడు. మంచి బ్రేక్‌ఫాస్టూ అవీ అన్నీ అచ్చంగా అమెరికా పద్ధతులే. "ఇక్కడ పుట్టినట్టే అనుకోండి," అని మరో విసురు జోడించేరు చివరికి.

రాజేశ్వరికి రాను రాను ఇబ్బంది అయిపోయింది ఈ సంభాషణ.

భోజనాలయేక "టీ తాగుతారా?" అనడిగింది రాజేశ్వరి.

తండ్రీకొడుకులు మొహాలు చూసుకుని, "మీరేం తాగితే అదే," అన్నారు. మరో క్షణం అయినంతరవా "కాఫీ అయినా ఫరవాలేదు," అన్నాడు సన్నీ.

వాళ్ళమాటల్లో ఏదో అంతరార్థం స్ఫురించింది రాజేశ్వరికి. ఏఁవనాలో తోచడంలేదు. మామూలుగా ఇక్కడ ఉన్న మనవాళ్ళు మన భోజనాలే తింటారు. మరీ అంత చాదస్తంగా - అడుగెట్టగానే పిడుగు - అనుక్షణం తాము అమెరికాలో ఉన్నాం అన్నసంగతి గుర్తు చేసుకుంటూ, తనకి గుర్తు చెయ్యడం ఎబ్బెట్టుగా ఉంది.

ఆవిడ కాఫీ పెట్టడానికి వంటగదిలోకి వెళ్ళింది.

చక్రధరం సిగరెట్ వెలిగిస్తూ, "యాష్ ట్రే లేదూ?" అన్నాడు చుట్టూ చూస్తూ, రామకోటికీ, సన్నీకీ పేకెట్ అందిస్తూ.

రామకోటి తను కాల్చననీ, ఇంట్లో యాష్‌ట్రే లేదనీ అన్నాడు ఇంట్లో సిగరెట్ కాల్చడం తనకి ఇష్టం లేదని అన్యాపదేశంగా తెలిసేలా.

"మాకు భోజనం అయింతరవాత తప్పనిసరి. ఈ ఒక్క దురలవాటు మాత్రం పోయింది కాదు," అన్నాడాయన నవ్వుతూ, సిగరెట్ నుసి ముందున్న ప్లేటులో దులుపుతూ.

లోపల రాజేశ్వరి కాఫీలో పాలు పోయబోతే విరిగిపోయేయి. "పాలు విరిగిపోయేయి. ఇప్పుడే వస్తాను," అంది చేతిసంచీ తీసుకుని, చెప్పులేసుకుంటూ.

“మీరెందుకండీ. సన్నీ వెళ్తాడు,” అన్నాడు చక్రధరం.

“నేను వెళ్ళి తెస్తాను, తాళాలేవీ?” అన్నాడు సన్నీ తండ్రివేపోసారి చూసి. అతనెప్పుడూ బజారు చేసి ఎరగడు దేశంలో ఉన్నప్పుడు. అదంతా తమ్ముడివంతు అక్కడ. కానీ ఇక్కడ కారుంది మరి.

రాజేశ్వరి కొనకళ్ళ రామకోటివేపు చూసింది. అతను బుద్ధిమంతుడయిన బాలునివలె తలొంచుక్కూచున్నాడు.

చక్రధరం ఆవిడ సందేహం గ్రహించినట్టు, “మనవాడికి ఇంటర్నేషనల్ లైసెన్సుంది. చాలా బాగా చేస్తాడు డ్రైవింగు. మీకేం భయంవక్ఖర్లేదు,” అన్నాడు తల తాటిస్తూ.

రాజేశ్వరి ఇరకాటంలో పడింది. ఈ “మన” ధోరణి మనదేశంలో చెల్లుతుంది కానీ ఇక్కడలా కాదు. ఆ మాట అతనికి రామకోటి చెప్పాలి. అతనేమో ముంగిలా మూతి ముడుచుకు కూచున్నాడు. కారణం ఏదైనా కానీ ఆవిడ కారు ఇంతవరకూ ఎవరికీ ఇవ్వలేదు. అసలు అలాటి అవసరం రాలేదు. పైగా షాపెక్కడుందని అడక్కముందే కారు తాళాలేవీ అని అడిగే కుర్రాడిని ఎలా నమ్మడం? దానికి తండ్రి వత్తాసు కూడాను! అదీ ఆశ్చర్యం.

రామకోటి కుర్రాణ్ణి చూసి సరదా పడుతున్నాడో తనఅవస్థకి ఆనందిస్తున్నాడో సరిగ్గా తెలీడంలేదు కానీ అతనిమొహమ్మీద చిర్నవ్వు చూస్తే రాజేశ్వరికి చిరాకేసింది. తినేసేలా చూస్తూ, “లేదండీ మీఅబ్బాయిగురించి కాదు నా భయం. ఇక్కడ ఇన్సూరెన్సు గొడవలు ఎక్కువ కదా. నేనే వెళ్తాలెండి. రేప్పొద్దున్న బ్రేక్‌ఫాస్టుకి కావలిసినవి కూడా తెచ్చేస్తే ఆ పని కూడా అయిపోతుంది. అతనికి ఇంకా కొత్త కదా. ఇప్పట్నుంచే పనిలో పెడితే ఝుడుసుకోగలడు,” అంది గరాజులోకి నడుస్తూ.

రామకోటి చిలిపిగా రాజేశ్వరిమొహంలోకి  చూస్తూ లేచేడు, "పాలూ, ఇంకా ఏం కావాలీ?" అని అడుగుతూ సన్నీవేపు చూసి, "పదవోయ్, స్టోరు చూసినట్టుంటుంది కూడా. పైవారం చేరుదువుగానీ డ్యూటీలో," అన్నాడు.

సన్నీకి ఆ సలహా నచ్చలేదు. వాళ్ళనాన్నకి కూడా అది మహా అవమానంగా తోచింది. "టైరయిపోయేనండీ. పడుకుంటాను," అని కుర్రాడూ, "టైరయిపోయేడు, ఇవాళ్టికి పడుకోనియ్‌లే," అని తండ్రీ ముక్తకంఠంతో తమ నిరసన తెలియజేసేరు.

రాజేశ్వరీ రామకోటీ మొహమొహాలు చూసుకోలేదు కానీ వాళ్ళ మనసుల్లో మాత్రం అలాటి ఆలోచనేదో లీలగా మెదిలింది.

ooo

మర్నాడు పొద్దున్నే లేచి కాఫీ, బ్రేక్‌ఫాస్టూ సిద్ధం చేసింది కానీ చుట్టాలు లేవలేదు. భార్యాభర్తలిద్దరికీ టైమయిపోతోంది.

"ఏం చేద్దాం?"

"ఇక్కడిపద్ధతులు తెలిసినవాళ్ళే కదా. అంతా క్షుణ్ణంగా నేర్చుకుని వచ్చేరు. చిన్న నోట్ పెట్టేసి వెళ్ళిపోదాం," అన్నాడు రామకోటి.

"వాళ్ళేంవనుకుంటారో?" అంది రాజేశ్వరి సందిగ్ధంగా.

"అనుకుంటే బాధే లేదు," అన్నాడు రామకోటి నర్మగర్భంగా.

అతనిక్కూడా వాళ్ళధోరణి బాగులేదని గ్రహించింది. కానీ ఆవిడకి ఊరుకోడానికి మనసొప్పలేదు. ఆఫీసులో పర్మిషనడిగి, లంచివేళకి ఇంటికొచ్చింది అతిధులు తిన్నారో లేదో చూడ్డానికి. అప్పటికి టైము పన్నెండు దాటింది.

తండ్రీకొడుకులు అప్పుడే లేచినట్టున్నారు. ముస్తాబయి వీధిలోకి బయల్దేరుతున్నారు. ఇంటిముందు టాక్సీ ఉంది.

రాజేశ్వరి అయోమయంగా "ఎక్కడికెళ్తున్నారు? బ్రేక్‌ఫాస్టు తిన్నారా?" అనడిగింది.

"బ్రేక్‌ఫాస్టా? మాక్కనిపించలేదే?" అన్నారిద్దరూ తమ అసంతృప్తిని ఏమాత్రం దాచుకోకుండా.

"ఫ్రిజ్‌లో ఉంది. ఫ్రిజ్ మీద నోట్ పెట్టేను కూడా."

"ఫ్రిజా?" - ఫ్రిజెక్కడుంది అన్నట్టు మొహాలు పెట్టేరిద్దరూను. "మీరు శలవు పెట్టేరనుకున్నాం," అని కూడా చెప్పేరు తప్పేవేనా ఉంటే ఆవిడదే అన్నట్టు.

"పోన్లెండి. రేపు తినొచ్చు. ఎక్కడికి వెళ్తున్నట్టున్నారు?" అంది టాక్సీవేపు చూస్తూ.

"ఊరు చూసొస్తాం. ఇంట్లో ఊరికే కూచోడం బోరు కదా. మీరు కూడా లేరింట్లో."

రాజేశ్వరి సరేనన్నట్టు తలూపి, లోపలికి నడిచింది, "ఎలాగా వొచ్చేను కదా. నేను లంచి తిని వెళ్తాను."

చక్రధరం, సన్నీ కూడా ఆవిడవెనకే లోపలికొచ్చేరు.

"కాబ్‌ని పంపించేశాం. ఎలాగా వచ్చేరు కదా. మీరు మమ్మల్ని ఊళ్ళో దింపేసి వెళ్ళిపోతే మేం వచ్చేటప్పుడు కాబ్‌లో వస్తాం," అన్నాడు చక్రధరం.

రాజేశ్వరి మళ్ళీ ఇరుకున పడింది. లంచ్ టైంలో డౌన్‌టౌన్ వెళ్ళడం అంటే ఆ పూట ఆఫీసు గోవిందా. వీల్లేదని చెప్పడమూ కష్టమే వీళ్ళకి. అప్పటికే పొద్దున్న టిఫిను విషయంలో అవమానం అయిపోయింది కదా.

"ఉండండి, ఆఫీసుకి ఫోను చేసి వస్తాను," అని లోపలికెళ్ళి మేనేజరుకి సంజాయిషీ ఇచ్చుకుని వచ్చింది.

"మీరు కూడా కొంచెం లంచి తినండి. మళ్ళీ సాయంత్రం వచ్చేసరికి ఆలస్యం అవచ్చు," అని మూడు ప్లేట్లు పెట్టింది బల్లమీద.

అదయింతరవాత, బయల్దేరేరు.

"నువ్వు ముందు కూర్చోరా," అని కొడుక్కి పురమాయించి, చక్రధరం వెనకసీటులో కూర్చున్నాడు.

సన్నీ ముందుసీటులో కూర్చుని రెడ్ లైటు, గ్రీన్ లైటు, ఛేంజి లేన్ అంటూ చక్కని అమెరికనింగ్లీషులో చెప్తూ తన కారు చోదక పరిజ్ఞానాన్ని ప్రదర్శించేడు. అతను ఎందుకు ముందుసీటు కూర్చున్నాడో ఆవిడికి అర్థమయింది. తాను కారు నడపడంలో నిష్ణాతుడని ఆవిడచేత అనిపించాలని అతడితాపత్రయం. వాళ్ళు కారు దిగింతరవాత సుదీర్ఘమయిన నిట్టూర్పు విడిచిందావిడ. ఈకథ ఎక్కడికి దారి తీస్తుందో స్పష్టంగా తెలిసిపోయింది. "ఆపద్రాక్షకా!" అని మనసులోనే ఓ చిన్న యస్.ఓ.యస్ ప్రసారం చేసుకుంది.

రామకోటి సాయంత్రం వచ్చేక మధ్యాహ్నం జరిగిన నాటకం చెప్పింది.

అతనికి ఏం చెప్పాలో తోచలేదు. "ఓ నెల్రోజులు కళ్ళు మూసుకుంటే అబ్బాయి డోర్మకెళ్ళిపోతాడు. తండ్రి చుట్టాల్ని చూడ్డానికి కాలిఫోర్నియా పోతాడు. కుర్రాడివరస చూస్తుంటే అతను మళ్ళీ మనమొహం చూసేలా లేడు," అన్నాడు బీన్సు ముక్కలు తరుగుతూ.

"అందరం సుఖపడతాం అలా అయితే," అంది రాజేశ్వరి బియ్యం కొలుస్తూ.

రాత్రి తొమ్మిదయింది. తండ్రీకొడుకుల జాడ లేదు.

"తప్పిపోయేరేమో," అంది రాజేశ్వరి బెదురుగా.

రామకోటికి కూడా అదే అనుమానం వచ్చింది కానీ అతను చెయ్యగలిగింది మాత్రమేం ఉంది? "వాళ్ళకి వాళ్ళయి తగుదునమ్మా అంటూ ఊరుమీద పడ్డారు తాము అమెరికా క్షుణ్ణంగా స్టడీ చేసి వచ్చేం అన్న ధీమాతో. మనం పంపలేదు కదా. ఎక్కడని వెతుకుతాం?" అన్నాడతను.

మరో అరగంట చూసి వాళ్ళు తినేశారు. మళ్ళీ పొద్దున్నే లేచి ఆఫీసులకి వెళ్ళాలని.

చక్రధరం సన్నీ వచ్చేసరికి రాత్రి ఒంటిగంటయింది.

రామకోటి తలుపు తీసేడు.

"మీకిద్దరికీ పని. మాకు ఊరు చూపడానికి తీరిక ఉండదు కదాని మేమే వెళ్ళేం," అన్నాడు చక్రధరం. "పైగా మనదేశంలోలా కాదు కదా. ఇక్కడ అన్నీ చక్కగా క్రమపద్ధతిలో ఉంటాయి. తెలీనివాళ్ళకయితే బాధ గానీ మనకేంటి."

"ఏమేం చూశారు?" అన్నాడు రామకోటి బల్లమీద కంచాలూ, గిన్నెలూ పెడుతూ.

"ఏదో బజార్లు తిరిగేం. ఆ తరవాత సినిమా చూసి వచ్చేసరికి ఆలస్యం అయింది. మీకు కష్టం అవలేదు కదా,"

"అవలేద"నక తప్పలేదు రామకోటికి. "రండి, భోంచేద్దురు గాని. ఇప్పటికే ఆలస్యం అయిపోయింది."

"మేం మెక్డొనాల్డులో తినేశాం. ఇండియాలోలా కాదు. ఇక్కడ హేంబర్గరు చాలా రుచిగా ఉంది," అన్నాడు సన్నీ.

"ఆఁ, అవును, బాగుంటుంది," అనేసి రామకోటి వంటకాలు ఫ్రిజ్జికి తరలించేసి పడుకోడానికి వెళ్ళిపోయేడు.

"వాళ్ళు భోజనాలు చెయ్యలేదా?" అనడిగింది అలికిడి విని లేచిన రాజేశ్వరి.

"తిన్నార్ట," అన్నాడతను ముక్తసరిగా.

ooo

వారం రోజులయింది. విజిటమెరికా టికెట్ తెచ్చుకుని వచ్చేడు కనక చక్రధరం దేశాటనకి బయల్దేరేడు. సన్నీకి క్లాసులు మొదలయేయి. ఆదిలో అనుకున్నట్టుగానే తండ్రి దేశంలో ఉన్నన్నాళ్ళూ వీళ్ళింట్లో ఉండి తరవాత

డోర్మకి మారిపోతానని చెప్పేడు. కానీ ఇంట్లో ఉన్నా లేనట్టే. ఎప్పుడు లేస్తాడో, ఎక్కడ తిరుగుతున్నాడో, ఎక్కడ ఏం తింటున్నాడో ఎప్పుడింటికొస్తాడో తెలీడం లేదు. అన్నీ ప్రశ్నలే. స్నేహాలు బాగానే కూడగట్టుకున్నట్టున్నాడు అట్టే ఆలస్యం చెయ్యకుండానే. సినిమాలూ, పార్టీలూ, డాన్సులూ, ... ..

ఓ రోజు మధ్యాహ్నం వేళ కాని వేళ ఇంటికొచ్చిన రాజేశ్వరిని చూసి సన్నీ గతుక్కుమని, తేరుకుని గబుక్కున చూస్తున్న విడియో ఆపు చేసేశాడు.

"మా ఫ్రెండు ఏదో పాతసినిమా ఇచ్చేడు. చెత్తగా ఉంది," అన్నాడు ఆవిడ అడక్కముందే. "స్నానం చేసొస్తాను," అంటూ లేచి పక్కనించి వెళ్తుంటే బీరువాసన గుప్పున తగిలిందావిడకి.

ఆ సాయంత్రం సన్నీ ఏమనుకున్నాడో బయటికెళ్ళలేదు. రాజేశ్వరితో కబుర్లు మొదలెట్టేడు - తన high I.Q., తల్లిదండ్రుల high expectations, dirty India, stupid Indians, … అసలు తను ఇండియాలో తప్పబుట్టేనన్నాడు.

ఇక్కడ వీధులు విశాలంగా ఉంటాయి

మనుషులు శుభ్రంగా ఉంటారు

ఇక్కడి మ్యూజిక్కూ, ఇక్కడి మూవీసూ, ఇక్కడి అమ్మాయిలతెల్లతొక్కా, ఆఖరికి ఇక్కడి పొట్లాలు కట్టుకునే కాయితాలు సైతం ఎంత అందంగా ఉంటాయో .... పట్టలేని తన్మయత్వంతో అతను వర్ణిస్తుంటే రాజేశ్వరికి తల తిరిగిపోయింది.

"మీ తమ్ముడేం చేస్తున్నాడు?" అనడిగింది ఆ ప్రవాహానికి అడ్డు తగిలి.

"వాడొట్టి లోఫర్. బజారుకెళ్ళి కూరలు తేరా అని పది రూపాయలిచ్చి పంపితే, నాలుగు రూపాయలకి కూరలు కొని నాలుగు రూపాయలు చిరుతిళ్ళకి తగలేసుకొస్తాడు,"

ఇంతకుముందు చక్రధరం కూడా ఇలాగే మాటాడేడు చిన్నకొడుకుగురించి. పెద్దవాణ్ణి పెద్ద చదువులకోసం మాలీసు చేస్తూ చిన్నవాణ్ణి గోఫర్‌గా చేసేరు కాబోలు. వాడు తిరగబడి లోఫరయేడు అనుకుంది.

ఆ సాయంత్రం రామకోటితో మాటాడుతూ కుర్రాడిగురించి తన అనుమానాలు వ్యక్తం చేసింది "పై చదువులా? పై పై చదువులా?" అంటూ.

"ఏం చేస్తాం? కొందరివిషయంలో పైమెరుగులకేనేమో ఈ పరుగులన్నీ," అన్నాడు రామకోటి ఆవిడతో ఏకీభవిస్తూ.

ooo

రెండు వారాలయింది. శనివారం ఉదయం. రాజేశ్వరి పూజ చేసుకుని కూర్చుంది. మామూలుగా శనివారం ఉదయంపూట కర్నాటసంగీతం వింటూనో భరతనాట్యం టేపులు పెట్టుకుని చూస్తూనో గడుపుతారు దంపతులిద్దరూ. మధ్యాహ్నంనించీ మామూలే - క్లీనింగూ, షాపింగూ, లాన్ మోయింగూ లేక స్నో బ్లోయింగూ ..

వాళ్ళలా కూచునుండగా, ఫోను మోగింది. రామకోటి తీసుకున్నాడు .. "ఘూష్! వెన్?" అంటున్నాడు ఫోన్లో.

రాజేశ్వరి ఉలికిపడి తలెత్తి చూసింది.

రామకోటి ఫోను పెట్టేసి, చెప్పేడు రాత్రి ఘోరమయిన ప్రమాదం జరిగిందిట. ఇద్దరూ హడావుడిగా బట్టలేసుకుని ఆస్పత్రికి చేరుకున్నారు. దారిలో సెల్లో చక్రధరాన్ని పిలిచి వెంటనే బయల్దేరి రమ్మని చెప్పేడు. ఆస్పత్రికి వెళ్ళేక కానీ వివరాలు తెలీలేదు. ముందు రోజు రాత్రి మరో ముగ్గురు మిత్రులతో కలిసి సన్నీ ఏదో పార్టీకి వెళ్ళేడుట. నలుగురికీ కొత్తే ఊరూ కారూ కూడా. పార్టీలో మామూలే. పాటలూ, డాన్సులూ, తాగడాలూ ... రాత్రి మూడయింది. ఒకొక్కరే వీధిన పడుతున్నారు. సన్నీ డ్రైవ్ చేస్తున్నాడు. ఏమయిందో తెలీదు కానీ కారెళ్ళి దారిపక్కనున్న చెట్టుకి కొట్టుకుంది. మిగిలిన ముగ్గురుకీ

అక్కడికక్కడే ప్రాణాలు పోయేయి. సన్నీ ఒంటినిండా కట్లతో ఇజిప్షన్ మమ్మీలా పడున్నాడు మంచంమీద. స్పృహ లేదతనికి. పోలీసులు చెప్పడం రక్తంలో alcohol level మితికి మించి మూడింతలుందట.

చక్రధరం సాయంత్రానికి వచ్చేశాడు న్యూయార్క్‌నించి గాభరా పడిపోతూ. ఆయన పూర్తిగా డీలా పడిపోయేడు. ఈ ఒక్కదెబ్బతోనూ మనిషి సగానికి సగం అయిపోయేడు. ఈ పుత్రుడిమీద ఎన్నో ఆశలు పెట్టుకున్నాడాయన. "వాళ్ళమ్మ ఈమాట వింటే గుండె పగిలి చచ్చిపోతుంది. నలుగుర్ని కంది. ఇద్దరు జబ్బులతో పోయేరు. ఆఖరివాడు దేశాలట్టుకుపోయేడు. వీడిమీదే మా కళ్ళన్నీను..."

"ఆఁ?" అంది రాజేశ్వరి ఆయనేం అంటున్నారో అర్థం కాక.

ఆర్నెల్లయిందిట చిన్నవాడు ఇంట్లోంచి పారిపోయేడు. ముంబైలో ఉన్నాడని ఎవరో అన్నారు కానీ జాడ తెలీదు ఇప్పటికీను.

ముద్దు చేసి ఒకణ్ణీ, మొరటుతనంతో మరొకడినీ - మొత్తంమీద ఇద్దర్నీ పనికిరానివాళ్ళగా చేసేసేరు అమ్మా, నాన్నా అనిపించిందావిడకి. ఆ తండ్రిని చూస్తుంటే ఎక్కళ్ళేని జాలీ ముంచుకొచ్చింది. పిల్లాణ్ణి పక్కాగా తయారు చేయదలుచుకున్న ఈ పెద్ద మనిషి ఓ అందమైన బొమ్మనే చూసేడు కానీ అవతలపక్క బొరుసుంటుందని గ్రహించలేదు. అమ్మ అంటూండేది "కళ్ళు వెనక్కుండవు ఎవరికీను. చూసుకు నడుస్తారంతే," అని.

మరక్కడుండలేక హాల్లోకి వచ్చేసింది రాజేశ్వరి.

ooo

(ఇండియానించి చదువులకోసం వచ్చిన ముగ్గురు అబ్బాయిలు మూణ్ణెల్లేనా కాకుండా ఓ కారుప్రమాదంలో ప్రాణాలు పోగొట్టుకోడం నిజంగా జరిగింది. మిగతా కథ కల్పితం. నవంబరు 2001లో రాసిన కథ)

# 7. మూఢ నమ్మకాలు

సంగాపురం సుబ్రహ్మణ్యస్వామికి అమెరికాగడ్డమీద అడుగెట్టగానే అర్జెంటుగా చెయ్యాల్సివచ్చినవి రెండు కనిపించేయి. మొదటిది పేరు మార్చుకోడం, రెండోది చెయ్యి కాల్చుకోడం.

అసలు ఎయిర్పోర్టులోనే మొదలయింది పేరుతో తంటా. ఇమిగ్రేషనుకౌంటరు దగ్గర మనిషి పాస్పోర్టూ సుబ్రహ్మణ్యంమొహమూ మార్చి మార్చి మూడుస చుట్లు చూసేక ఈ భూప్రపంచకంలో ఇలాటిపేరు గల మనిషి మరొకడుండడులే అని నిర్ధారణ చేసుకుని పొమ్మన్నాడు. ఒకళ్ళిద్దరు తెల్లవాళ్ళు మంచితనానికి పోబోయి హాలో చెప్పి పేరు వినగానే జడుసుకున్నట్టు ''ఓ'' అనేసి పక్కకి తప్పుకున్నారు.

ఆ తరవాత సంగాపుర్ అనీ, సుబ్రహ్మణ్యస్వామి అనీ సుబ్రహ్మణ్యం అనీ, స్వామి అనీ, మణ్యం అనీ అనేకవిధాల వాళ్ళమీద ప్రయోగాలు చేసి చూశాడు. suburuలో ''సు''లాగ, brownలో బ్ర లాగ అని ఓ సూచికలపట్టిక కూడా తయారు చేశాడు ఒకొక అక్షరానికీ. కానీ వాళ్ళు తన సూచనలన్నీ గాలికొదిలేసి పోల్చుకోడానికి వీల్లేనంతగా తనపేరు చిత్రవధ చేసేస్తున్నారని తెలిసేసరికి ఓ నెలరోజులు గడిచిపోయేయి.

అతడికి ఒళ్ళు మండిపోయింది. సుబ్రహ్మణ్యం పుట్టడానికి ముందురోజు నాయనమ్మకి సుబ్రహ్మణ్యేశ్వరుడు కలలో కనిపించేడుట. బారసాలనాడు నాగరాజు నట్టింట నాట్యం చేస్తూ దర్శనమిచ్చేడు. అలా అతడిపేరు సుబ్రహ్మణ్యేశ్వరస్వామిగా స్థిరపడిపోయింది. ముచ్చటగా అమ్మ పెట్టుకున్నపేరు చప్పిడికూరలు తినే ఈ జనాలనోళ్ళ తిరగవు. ఆ ఆపరేషనేదో నేనే చేసేస్తే కనీసం

నేనే చేసినన్న మాటేనా దక్కుతుందని "నాపేరు సుబ్బులు, నాకారు సుబురు" అంటూ ఓ చిన్న గీతం కట్టేడు.

అది కూడా సాగలేదు. ఊళ్ళోవాళ్ళు ల, ర యోరబేధ: అని సూత్రీకరించి పేరూ కారూ కూడా సుబురు చేసేశారు. ఇహ గతి లేక తలా తోకా తెగ్గొట్టి, మణి అని మొదలుపెట్టి, మన్ గా స్థిరం చేసేడు చివరికి సుబ్రహ్మణ్యస్వామి. తనకి మనిషిమీద మాత్రమే నమ్మకం. అంచేత మన్ అన్న పేరులో విశేషార్థం నిగూఢం!

రెండోబాధ - సుబ్రహ్మణ్యస్వామి దేశంలో ఉన్నప్పుడు గిన్నేదో గరిటేదో తెలీకుండా పెరిగేడు. మేనత్తో నాయనమ్మో కంచంలో కూడు పడేస్తుంటే అవేమిటో, ఎలా వచ్చేయో తెలీకుండానే తినేసి, కదాచితుగా కూరలో ఉప్పెక్కువ, చారు నీళ్ళూ అంటూ సాధిస్తూ గడిపేశాడు.

అమెరికా వచ్చేక, అన్నం ఎలా వండుతారు, వంకాయకూరలో ఉల్లిపాయలరుచి ఎలా వస్తుందిలాటి ప్రశ్నలు ఉదయించేయి. మొదటి రెండురోజులు పచ్చి కూరలూ, రొట్టెముక్కలూ తిన్నాడు కానీ రాను రాను ఆ చప్పిడికూడుతో జిహ్వ చచ్చి ఎక్కళ్ళేని నీరసం ఒచ్చి, నిజంగానే జొరం వచ్చినట్టు అనిపించసాగింది. ఉప్పూ పులుసూ తినేవాడికి వచ్చేంత కోపం వచ్చింది. ఆ రోజుల్లోనే బజారులో దేశవాళీ మొహం కనిపిస్తే అతనిమొహం చప్పన మతాబాలా వెలిగేది.

సాధారణంగా అమెరికాలో కొంతకాలం ఉన్న మనవాళ్ళకి కొత్తమొహాలు ఇట్టే తెలిసిపోతాయి. చూడగానే సడెన్ బ్రేకు వేసినట్టు ఆగిపోతారు. ఆ తరవాత "మీరు తెలుగువారా?" అని ఇంగ్లీషులో పృచ్ఛించి, గోత్రనామాలు చెప్పుకున్నాక ఫోన్నెంబర్లు ఇచ్చి పుచ్చుకోడాలు అయింతరవాత ఎవరిదారిన వారు పోతారు. కొంచెం ఎక్కువ కాలం ఉన్నవాళ్ళయితే కొత్తవాళ్ళని అప్పుడప్పుడు భోజనాలకి పిలుస్తారు. తరవాత కొందరివిషయంలో స్నేహాలు బలపడి, తామే వారిని పిలిచి

వస్తున్నాం అని చనువుగా వారాలు చెప్పుకున్నట్టు చెప్పుకునే సందర్భాలు కూడా ఉంటాయి అరుదుగానే అయినా.

సుబ్రహ్మణ్యానికి అలాటి స్నేహాలు ఒకట్రెండు తగిలేయి. కానీ రాను రాను తనకే ఆ బతుకు హేయంగా తోచి, “వంట ఓ బ్రహ్మయజ్ఞమా ఏమిటి, నేనే చేసుకుంటాను,” అని ఓ శుభముహూర్తాన బజారుకెళ్ళి ఓ రెండు గిన్నెలు కొనుక్కొచ్చేడు. ఆ మధ్యనే పరిచయం అయిన సుందరిగారిని పిలిచేడు ఫోనులో, “కూర పొయ్యిమీద పెట్టేను, తరవాతేం చెయ్యమంటారు?”, “బియ్యంలో ఎన్ని నీళ్ళు పొయ్యాలి?”, “ఎంతసేపు ఎన్ని డిగ్రీలు ఫారెన్‌హైటులో పెడితే అన్నం అవుతుంది?”లాటి ప్రశ్నలతో ఊదర పెట్టేస్తుంటే, ఫోనులో జవాబులు చెప్పలేక ఆవిడే కారేసుకు వచ్చేశారు మొదటిరోజున. తరవాత ఓ వారంరోజులకి సరిపడా పాఠాలు రాసిచ్చేరు. మొత్తంమీద నెల తిరిగేసరికి అన్నం కూరా చేసుకోడం చేతనయేయి అతడికి. సుందరిగారు అప్పుడప్పుడు సాంబారూ, పచ్చళ్ళూ ఇస్తూ వచ్చేరు.

నాలుగు నెలలపాటు అంతా సాఫీగా సాగిపోతూన్నట్టే అనిపించింది. అదే సమయంలో సుందరిగారి భర్తకి మరో ఊళ్ళో ఉద్యోగం రాడంతో వాళ్ళు ఊరొదిలి పోయేరు.

సుబ్రహ్మణ్యంపరిస్థితి మళ్ళీ మొదటికొచ్చింది. “ఆ రోజులు రావు” అంటూ దరువులేసే సమయం మళ్ళీ ఆసన్నమయింది అతని అమెరికన్‌జీవితంలో. కళ్ళలో నీళ్ళొచ్చేయి సుందరిగారు ఊరొదిలి వెళ్ళిపోతుంటే. అమ్మ పోయినరోజులు జ్ఞాపకం వచ్చేయి కూడా.

అదుగో అప్పుడే తనని చదివించి, తనమీదే ఆశలు పెట్టుకున్న మేనమామా, తనకోసమే బతుకుతున్న మరదలు శ్రీజ్ఞానప్రసూనాంబా గుర్తుకొచ్చేరు. తనమాటకోసం వాళ్ళు ఎదురు చూస్తున్నారు. ఇంతకాలం అతనే “ఇప్పుడు కాదు, పరీక్షలయింతరవాత,” “చదువయింతరవాత,”

‘‘ట్రెనింగయింతరవాత’’ ‘‘ఉద్యోగం వచ్చింతరవాత,’’ అంటూ వాయిదాలేస్తూ వచ్చేడు. అతడికి ఇప్పుడు తెలివొచ్చింది మరియు తెలిసొచ్చింది ఆ శుభముహూర్తం ఇదే అని. అర్జెంటుగా మామయ్యని ఫోనులో పిలిచి, ‘‘నేను పెళ్ళి చేసుకుంటాను మామా. రెండువారాల్లో బయల్దేరి వస్తున్నాను,’’ అని చెప్పేడు.

మేనమామ పరమానందపడిపోయేడు. ‘‘బావుందిరా, అల్లుడా మంచిముక్క చెవినేసేవు. అమ్మమ్మ కూడా సంతోషిస్తుంది. కానీ మరీ రెండువారాల్లో అంటే ఎలా? మంచి ముహూర్తం ఉందో లేదో .. చూసుకోవద్దూ?’’ అన్నాడాయన.

‘‘నాకు అలాటి నమ్మకాలు లేవు మామయ్యా. ఈ ఆచారాలూ, చాదస్తాలూ, దేవుళ్లూ, దయ్యాలూ అవన్నీ మెడకాయమీద తలకాయ ఉన్నవాడెవడూ నమ్మడు. నేను రిజిస్టర్డు పెళ్ళి చేసుకుంటాను. అలా అయితేనే వస్తాను. అంతే. కావలిస్తే మరో వారం తీసుకో. ఆ తరవాత నాకు కుదరదు,’’అన్నాడు మన్ తనేదో వాళ్ళని ఉద్ధరిస్తున్నట్టు.

‘‘అలా అంటే ఎలారా? మా సరదాలు మావి.’’

‘‘సరదా లేదు బురదా లేదు. ఇలాటి ఆచారాలమూలంగానే కొంపలు గుణ్ణాలయిపోతున్నాయి. వెధవాచారాలూ వెధవ సరదాలూను.’’

‘‘నేనేం లేని పరుగులకి పోనులే. ఉన్నంతలో జరుపుకోడానికేం? పెద్దది అమ్మమ్మ మీపెళ్ళి చూడ్డానికే బతికుంది. ఆవిడతృప్తికోసంపైనా చెయ్యాలా ఒద్దా?’’

‘‘వీల్లేదు మామయ్యా. నాఆశయాలకి విరుద్ధంగా నేం చచ్చినా చేసుకోను. రిజిస్టర్డు పెళ్ళికి ఒప్పుకుంటేనే పెళ్ళి. లేకపోతే మరొత్తిని చూసుకుంటాను.’’

‘‘మరొత్తిని చూసుకుంటాను,’’ అన్న మాటతో మేనమామ లొంగిపోయేడు. దేశం కానీ దేశం, కనీసం చిన్నప్పట్నుంచీ తెలిసినవాడిపంచన

పడుంటుంది పిల్ల అని తనకి తనే నచ్చచెప్పుకుని, ''అలాగే కానియ్ నాయనా, నీఇష్టం,'' అన్నాడు.

ఆ విధంగా సుబ్రహ్మణ్యానికి రెండు కష్టాలూ గట్టెక్కేయి. నెల తిరక్కుండా ఆ పెళ్ళిలాటిదేదో జరిపించుకొచ్చేశాడు. ఆ తరవాత రెండు నెలలకి ప్రసూన అనబడు శ్రీ జ్ఞానప్రసూనాంబ సారెతో కల్యాణతిలకంతో వెంకటేశ్వరస్వామి పటంతో దిగింది.

పటం చూసి, ''గరాజులో పెట్టేయ్'' అన్నాడు మన్. ప్రసూనకి ప్రాణం చివుక్కుమంది. తన స్నేహితురాలు ఎంతో ఆప్యాయంగా ఇచ్చిన పటం. కొత్తింట్లో శుభప్రదం అని తెచ్చింది. మన్ ఇంకా కొన్ని గ్రౌండు రూలులు కూడా తెలియజేశాడు. అందులో ముఖ్యమైనవి -

''నన్ను అండి గిండి అనకు. అందరం మనుషులమే. నేనెంతో నువ్వంత.''

''పని కూడా అంతే. ఇద్దరం సమానులం. అంత పనీ నువ్వే చెయ్యక్కర్లేదు. ఇద్దరం కలిసి చేసుకుందాం.''

''మీనాన్న బుద్ధి లేక నిన్ను చదివించలేదు. ఇక్కడ బోలెడు అవకాశాలున్నాయి. ముందు ఈయస్సెల్ పరీక్షకి చదువు.''

''ఈయస్సెలంటే?''

''అదే. ఇంగ్లీషు మాటాడ్డం నేర్చుకో.''

ప్రసూనకి కొన్ని మాటలు నచ్చేయి, కొన్ని బాధ కలిగించేయి. తన పేరు మాత్రం ఎవరడిగినా ప్రసూన అనే చెబుతోంది. బ్రెజెన్స్కీ లాటి పేరు పలకగలిగినవాళ్ళు ప్రసూన అని ఎందుకనలేరూ?

''పర్సనంటారు చూసుకో,'' అన్నాడు మన్ హేళన చేస్తూ.

''పోన్లే, అలాగైనా మనిషనవుతాను,'' అంది అప్పటికి నాలుగు ముక్కలు నేర్చుకున్న ప్రసూన.

ooo

ఆ అమ్మాయి రాగానే సుందరిగారొచ్చి నాలుగు రోజులుండి, అంట్లు తోంకోడం, బట్టలుతుక్కోడం, బాతురూంలు కడుక్కోడంలాటి మహావిద్యలు నేర్పి వెళ్లేరు. ప్రసూన ఎంత పల్లెటూళ్ళో పుట్టినా ఇలాటిపనులు చేసి ఎరగదు. "అయ్యో రాతా," అనుకుంది మనసులోనే కానీ పైకి పొక్కలేదు.

ooo

ప్రసూన స్కూలికెళ్ళి పుస్తకాలచదువు చదువుకోకపోవచ్చు కానీ తెలివితక్కువ పిల్లేం కాదు. మన్ మూడోక్లాసు కుర్రాడిలా చదివిన చిట్టాలో నిజంగా అమల్లోకి వచ్చింది మొదటి రూలొటే. మేనత్త మేనమామ పిల్లలు, చిన్నప్పట్నుంచీ ఒకచోట పెరిగినవాళ్ళు. అంచేత నువ్వు నువ్వు అనుకోడంలో విశేషం ఏమీ లేదు.

సమానత్వంగురించీ మానవత్వంగురించీ అన్ని కబుర్లు చెప్పిన మన్ ఇటున్న పుల్ల అటు పెట్టడన్న సంగతి తెలుసుకోడానికి అట్టే కాలం పట్టలేదు ఆమెకి. రోజంతా కారుమీదో ఫోనుమీదో కాలక్షేపం చేసేస్తున్నాడు. ఏంపైనా అంటే తన ఉద్యోగం అలాటిదంటాడు.

ప్రసూన వచ్చి నాలుగు నెలలవుతోంది. మెల్లిమెల్లిగా స్థానికమర్యాదలకి అలవాటు పడుతోంది.

పైవారం కనకంగారింట్లో సత్యనారాయణవ్రతంట. ఆవిడ ఫోన్ చేసి తప్పకుండా ఇద్దరూ రావాలని చెప్పింది. ఆ సాయంత్రం మన్‌తో చెబితే, "ఇంత అభివృద్ధి సాధించిన దేశంలో ఉంటూ కూడా ఈ వ్రతాలూ పూజలూ ఏమిటి? చాదస్తం కాకపోతే," అన్నాడు. పెళ్ళికిముందు సుందరిగారింట్లో చేసిన భోజనాలు మర్చేపోయి.

“పూజక్కాకపోతే భోజనానికనుకో. బొత్తిగా నాలుగ్గోడలమధ్య మనిషిమొహం కనిపించక జైల్లో ఉన్నట్టుంది నాకు. ఓ మారలా వెళ్ళి కనిపిస్తే ఏం?” అంది ప్రసూన.

ఆ పిల్లకి ఊపిరాడ్డం లేదిక్కడ. హలో, హౌలోమంటూ ఎవరైనా ఫోనులో పిలిచినా మొక్కుబడిలాగే ఉంది గానీ తీరిగ్గా ఊసులాడుకోడం, మనసారా మాటాడుకోడం అన్నది లేదు.

“ముందీ మూఢనమ్మకాలు పోవాలి మనదేశం బాగుపడాలంటే. ఆమాటే అన్నానని చెప్పు.”

“కిందటివారం మీబాసింట్లో గ్రాడ్యేషనుకి వగరుస్తూ పరిగెట్టు కెళ్ళలేదూ?”

“అది వేరూ. బెస్ట్ విషెస్ చెప్పడంలో తరతరాల మూర్ఖత్వం ఎక్కడుందీ?”

“ఆ వేరులేమిటో నీకే తెలియాలి. అదీ ఖర్చుతో కూడుకున్నదే. అందులో మాత్రం ఏదో జరగాలన్న ఆశ లేదూ? బెస్టు విషులు చెప్పినప్పుడు నువ్వు అనుకున్నట్టు జరగాలన్న ఆశా, జరుగుతుందన్న నమ్మకమూ లేవూ?”

“నీదొట్టి మట్టిబుర్ర.,” అంటూ కంప్యూటరుముందు కూర్చున్నాడు మన్.

“మట్టిబుర్రే అయుండాలి. లేకపోతే ఆ గోడమీద మీ నాన్నగారిఫొటో నాకు ఒట్టి కాయితపుముక్కలాగ, 30 డాలర్ల ఫ్రేము దండుగఖర్చులాగ ఎందుకు కనిపిస్తుందీ?”

మన్ తినేసేలా ఆవిడవేపు చూసి గబగబ రాసుకోడం మొదలుపెట్టేడు.

ప్రసూనకి పాలుపోలేదు. ఇప్పుడేం చెయ్యడం? ఒకవిధంగా అతను రాకపోడమే మంచిదేమో అని కూడా అనిపిస్తోంది. తీరా వచ్చి అక్కడ కూడా ఈ వితండవాదనలే మొదలుపెడితే మరీ చిరాకు. ఈ నాలుగునెలల్లోనూ గమనించింది సుబ్రహ్మణ్యం అంతటివాడే అని. పూజకి పోకపోతే ఏం బాగుంటుంది? దేవుడిమీద నమ్మకం ఉన్నా లేకపోయినా లోకమర్యాదలంటూ ఉంటాయి కదా. తను వెళ్ళడానికే నిశ్చయించుకుంది.

తీరా అక్కడికి వెళ్ళింతరవాత ఆ పిల్లకి అర్థమయింది తను ఒక్కత్తీ అలా రావడమేమంత గౌరవప్రదం కాదని. "ఐ నెవర్ గో ఎలోన్," అంది ఒకావిడ పత్తికాయల్లా విచ్చుకున్న కనుగవతో, అచ్చపు అమెరికను ఏక్సెంటుతో.

ప్రసూన చుట్టూ చూసింది. మొగాళ్ళంతా ముందుగదిలో కూచుని రాజకీయాలూ ఉద్యోగాల్లో ఈతిబాధలూ మాటాడుకుంటున్నారు. ఆడవాళ్ళంతా వంటింట్లోనూ డైనింగ్రూంలోనూ చేరి రెసిపీలు చర్చించుకుంటున్నారు. ఎవరు ఎవరితాలూకో కూడా సరిగ్గా తెలీడంలేదు! కానీ ఇక్కడ భార్యాభర్తలు కలిసే వెళ్తారుట ఎక్కడికెళ్ళినా. అది వారి సామరస్యానికి చిహ్నంట!

ప్రసూనకి చిన్న కోపం కూడా వచ్చింది. మన్‌కి తెలీదూ ఆ మాట?

పూజా, భోజనాలూ అయేక, బయల్దేరుతుంటే, కనకంగారు సుబ్రహ్మణ్యంకోసం కొంచెం ప్రసాదం ఓ ప్లాస్టిక్ సంచీలో వేసిచ్చారు.

ఇంటికొచ్చేక అతనికిస్తే, "నాకా పిచ్చినమ్మకాలు లేవని చెప్పేనా? నేను తిన్ను," అన్నాడతను మొండిగా.

"పోనీ ప్రసాదం కాదు రవకేసరి అనుకుని తిను," అంది ప్రసూన.

"నాకు స్వీట్లు ఇష్టంలేదు. అవి ఆరోగ్యం కాదు."

ooo

రెండు రోజులయింది. అవేళ శుక్రవారం. షాంపూతో తలస్నానం చేసి, మన్‌కోసం ఎదురు చూస్తూ కూర్చుంది శుభవార్త చెప్పడానికి. తను తల్లి కాబోతోంది.

మామూలుకంటే ఆలస్యంగా వచ్చేడు మన్ దివాలా పడ్డ మొహంతో.

ప్రసూన గాభరా పడిపోయింది. "అలా ఉన్నావేం?"

అతను ప్రసూనవేపు దీనంగా చూసి లోపలికి నడిచేడు. ఉద్యోగం పోయింది!

నిజానికి ఆ రోజు కూడా మామూలుగానే తెల్లారింది. మామూలుగానే ముస్తాబయి అతను పన్లోకెళ్ళేడు. తిరిగొచ్చేవేళకి హుష్ కాకీ అన్నంత తేలిగ్గా ఎగిరిపోయింది ఉద్యోగం.

"అసలేం జరిగింది?" అనడిగింది ప్రసూన.

మధ్యాన్నం ఓ మీటింగు పెట్టేరు. అంతవరకూ ఎవరికీ ఏమీ తెలీదు. ఆ మీటింగులో యజమానులు చెప్పేర్ట, "మీరందరూ చాలా కష్టపడి పని చేస్తున్నారు. బాగా వృద్ధిలోకి రావలిసినవాళ్ళు. వస్తారు కూడాను. మన కంపెనీపరిస్థితులు చాలా బావున్నాయి. అంచేత రీఆర్గనైజు చేసి మరింత పెద్ద కంపెనీగా తీర్చి దిద్దబోతున్నాం. దానికవసరమైన మార్పులు స్టాఫులో కూడా చెయ్యాలి. మాకై మేం ఎవరినీ పొమ్మని చెప్పలేం. ఇదుగో ఈ బుట్టలో కవర్లున్నాయి. కొన్ని కవర్లలో పింకు స్లిప్పులున్నాయి. తలో కవరు తీసుకుని ఇంటికెళ్ళండి. పింకుస్లిప్పులు ఉన్న కవరు గలవారు సోంవారంనించీ ఆఫీసుకి రానక్కర్లేదు. మంచి రికమెండేషన్లు ఇస్తాం తప్పకుండా. రెండు వారాలు సివరెన్సు పే కూడా యిస్తాం."

ప్రసూనకి కళ్ళు తిరిగేయి. చిప్ప చేతికిచ్చి వీధిలోకి తగిలెయ్యడంలో కూడా ఇంత నాజూకుతనం ఉంటుందని ఆ తెలుగుపడుచుకి ఇప్పుడే తెలిసొచ్చింది!

"సర్లే, భోజనానికి లే. తరవాత చూద్దాం," అంది.

"నువ్వు తినెయ్. నేంతరవాత పెట్టుకు తింటాను," అన్నాడు మరో ఉద్యోగంకోసం వేట మొదలెట్టడానికి కంప్యూటరు ముందు కూచుని.

పుట్టబోయే బుల్లిబుజ్జాయిగురించి చెప్పలేకపోయింది ఆ సమయంలో. రాత్రి చాలా సేపయినతరవాత చెప్తే, "ఇప్పుడా?" అన్నాడతను అదేదో ప్రసూన తప్పయినట్టు.

నిజానికి ప్రసూనని బాధిస్తున్నది మరోవిషయం. ఆ రోజు స్వామివారిప్రసాదం మన్ తినకపోవడం ఆ పిల్లకి బావులేదు. తరవాత తింటాడేమోనని ఫ్రిజ్‌లో పెట్టింది. ఆ మాటే ఇప్పుడంది, "సత్యనారాయణప్రసాదం అలా ఒద్దనకూడదు అంటారు. పోనీ ఇప్పుడు కొంచెం నోట్లో వేసుకో."

"మోకాలికీ బట్టతలకీ ముడి పెట్టడం అంటే ఇదే. మళ్ళీ ఆ మాటెప్పుడూ నాదగ్గిర తేకు," అంటూ కస్సుమన్నాడు మన్.

ఎడతెగని ఆతురతతో వెతుకుతున్నాడు కానీ ఎంత వెతికినా ఉద్యోగం దొరికేఆశ కనుచూపుమేరలో కనిపించడంలేదు. బొప్పి కట్టినచోటే మళ్ళీ తగిలినట్టు ఇంటినించి ప్రసూనతండ్రి పోయేడని వార్త వచ్చింది. ఆ అమ్మాయికి తల్లికంటే తండ్రిదగ్గరే చనువెక్కువ. పట్టరాని దు:ఖంతో కర్మవేళకి వెళ్తానంది మన్‌తో.

"అసలే ఇక్కడ ఉద్యోగం పోయి నానావస్థలుగా ఉంటే ఇప్పుడదో ఖర్చా? పోయినాడు పోనే పోయేడు. నువ్వెళ్ళి ఏం చేస్తావు? బూడిద," అన్నాడు మన్ మొరటుగా.

ఆ పిల్ల కళ్ళ నీళ్ళు కుక్కుకుంటూ పక్కగదిలోకి వెళ్ళి తలుపేసుకుంది.

ప్రసూనకి మన్ అపనమ్మకాలు నచ్చడంలేదు. అతనికి ఉద్యోగం పోయింది. తనకి తండ్రి పోయేడు. పుట్టబోయే బిడ్డకి ఏ ముచ్చట్లూ లేవు. పోనీ, తనే మొక్కుకుందాం అంటే మొక్కుకుని ఏం చేస్తుంది? అతను ఇంట్లో పూజయినా చెయ్యనివ్వడు. పూజ కాదు కదా ఓ ప్రతిమనయినా పెట్టుకోనివ్వడు. మనసులోనే ఓ దణ్ణం పెట్టుకని నీకింతే ప్రాప్తం అనుకుంది. ఎవరికి? ఏమిటి? ఎంత ప్రాప్తం అన్నవి ఆ అమ్మాయికే సరీగా తెలీడంలేదు.

కానీ ఆ పిల్లబాధ మన్‌కి అర్థమయింది. అతనికి మరీ కోపం వచ్చింది. ప్రసూనకి బుద్ధి చెప్పే ఉద్దేశంతో రాత్రికి రాత్రి కూచుని మూఢనమ్మకాలమీద ఓ పెద్ద వ్యాసం రాసేశాడు. అది ఓ ప్రముఖ వారపత్రికకి పంపించేడు. అది

అచ్చయింది. దాంతో ఎక్కళ్ళేని ఉత్సాహం వచ్చి, దాన్ని ఇంగ్లీషులోకి అనువదించి ఇంటర్నెట్లో పడేశాడు. దానిమీద వాదోపవాదాలు చెలరేగేయి. మన ఊరువాడే అని గమనించి నలుగురు యూనివర్సిటీ కుర్రాళ్ళు అమితోత్సాహంతో అతనిచేత ఓ ఉపన్యాసం ఇప్పించేరు యూనివర్సిటీలో. ఆ ఉపన్యాసం విన్న ఒక అమెరికను మన్ దగ్గరకొచ్చి, కొంచెంసేపు మాటాడి, అతని ఉపన్యాసం మెచ్చుకుని, "లంచికి రాగలరా?" అని అడిగేడు. మంగళవారం యూనివర్సిటీ ఎవెన్యూమీద ఉన్న ఫ్రాంకీస్‌లో కలవడానికి నిశ్చయం అయిపోయింది. ఆ విధంగా మిస్టర్ హార్డింగ్ గారితో డాక్టర్ మన్ లంచికెళ్ళడం జరిగింది. ఆ తరవాత హార్డింగ్ మన్ తెలివితేటలు గ్రహించినవాడై, అతని ఆనూ పానూ కనుక్కుని, "మా కంపెనీలో ఒక ఖాళీ ఉంది. వస్తావా?" అనడిగేడు.

మన్ పరమానందభరితుడై, ఇంటికొచ్చి, "చూశావా నా శక్తిసామర్థ్యాలు?" అన్నాడు ఉప్పొంగిపోతూ భార్యతో.

ఆవిడ కూడా సంతోషించింది. తరవాత తీరిగ్గా ఉన్నప్పుడు, "నీఉద్యోగం ఊడకపోతే, నామీద అంత కోపం రాకపోతే నువ్వా వ్యాసం రాసేవాడివే కాదు కదా," అంది డొంకతిరుగుడుగా.

అతని సామర్థ్యంలో తను రహస్యంగా మొక్కుకున్న మొక్కుబడిపాలు కూడా ఉందని ఆవిడనమ్మకం. ప్రసూనమాటెలా ఉన్నా యస్.యస్. మన్‌గా ప్రసిద్ధికెక్కిన సంగాపురం సుబ్రహ్మణ్యస్వామికి ఉత్సాహం పట్ట పగ్గాల్లేకుండా ఉంది. వరసగా "మనవాళ్ళూ- నమ్మకాలూ," "అస్తి, నాస్తివాదం", "ఆస్తికుల చాదస్తం", "ప్రజలలో మౌఢ్యం" అంటూ ఊకదంపుడుగా వ్యాసాలమీద వ్యాసాలు రాసి గుప్పించేస్తున్నాడు ఎడా పెడా. అతనికీర్తి ఊరూ వాడా వ్యాపించేసింది కార్చిచ్చులా. అపర చార్వాకుడని ఆధునికులు మురిసిపోతే పిదపకాలం పిదపబుద్ధులు అని ఛాందసులు ఈసడించి పారేశారు.

ప్రసూనకి ఆ విషయాలేమీ పట్టడంలేదు. పుట్టబోయే బిడ్డవిషయంలో మన్ కాస్తయినా సరదా చూపిస్తే బాగుణ్ణని ఉందా పిల్లకి. పురిటికి పుట్టింటికెళ్ళే ఆశల్లేవు. ఇక్కడ ఉన్న డాక్టర్లూ, సదుపాయాలూ అక్కడ లేవని అతను అడ్డుపుల్లలేశాడు.

కొడుకు పుట్టేడు. అప్పటికి భర్త మనస్తత్వం ప్రసూనకి బాగా అర్థమయిపోయింది. ఊళ్ళోవాళ్ళ మూర్ఖత్వంమీద కట్టలు కట్టలు గిలికేస్తున్న మన్‌కి ఇంట్లో ఒక మనిషి ఉందన్న ధ్యాస లేదు. ఆ మనిషి ఏం చేస్తోందన్న ఆలోచనలేదు.

"బుష్ అని పెట్టుకుందాం పేరు," అంది ప్రసూన ఒళ్ళో పాపాయిని చూస్తూ.

హాస్యానికంటోందేమో అనుకున్నాడు మన్. ఆ మాటే అన్నాడు కూడా, "బుష్షేమిటి? అదేంపేరు?"

"అమెరికాలో పుట్టేడు కదా. ప్రసిడెంటయే అవకాశాలు ఇంకా ఎక్కువ అవుతాయని," అంది నవ్వుతూ.

ఆమె తండ్రిపేరు నాగభూషణం. తన రహస్యమొక్కు కూడా తీరిపోతుంది రెండూ కలిసొచ్చేలా పెట్టుకుంటే. ఆమాట చెప్తే అతను పడనివ్వడు.

మన్‌కి అదేమీ అర్థంకాలేదు. చేతిలో ఉన్న కాయితాలకట్ట నెత్తికేసి కొట్టుకుంటూ, "నీఖర్మ" అనేసి, మరో వ్యాసం రాయడానికి కూర్చున్నాడు కీబోర్డుమీద చేతులేసి, "మూఢనమ్మకాలమూలంగా మనదేశం ఎంత అధోగతిపాలవుతోందో సహేతుకముగా నిరూపించెదను," అంటూ మొదలెట్టేడు.

అతని చిరాకు చూస్తే ప్రసూనకి మరింత హుషారొచ్చింది. "ఈసారి ఆడపిల్ల పుడితే ప్రమీల అని పెడతాను. పాం అని పిలుచుకోవచ్చు," అంది అతన్ని రెచ్చగొడుతూ.

"ఇల్లు పాములపుట్ట చేసేస్తున్నావు," అన్నాడతను కూడా నవ్వుతూ.

“నాకు ప్రహ్లాదవిజయం జ్ఞాపకం వస్తోంది.”

“ఎందుకూ?”

“లేదులేదంటూనే రాత్రీ పగలూ నీకదే ధ్యాస కదా హిరణ్యకశిపుళ్ళా! నేను ఉన్నాడని నమ్ముతూ రోజుకో రెండు నిముషాలు తలుచుకుంటే తెగ ఆరాటపడిపోతున్నావు కొంపలు మునిగిపోయినట్టు. ఆ కాయితాలు పక్కన పెట్టి, బాబునోమారు ఎత్తుకోకూడదూ.”

“ఇంట్లో పిల్లాడెక్కడికి పోతాడు. ఇది ఇవాళ మెయిల్ చెయ్యకపోతే సమయానికి అందదు.”

“చెప్తున్నా కదా. నీఖర్మ. కాదు కాదంటూనే స్వర్గానికెళ్ళిపోతావు. నాయనమ్మ చెప్పింది పగనైన వగనైన ప్రాణభీతినైన - ఎలా తల్చుకున్నా సాయుజ్యం ప్రసాదించేస్తాట్ట ఆ మహావిష్ణువు,” అంది తలొంచుకుని ఒళ్ళో పిల్లాడితో మాటాడుతున్నట్టు.

“హిరణ్యకశిపుళ్లాటి మూర్ఖుణ్ణంటావు నేను,” అన్నాడు మన్ నమ్మలేనట్టు ప్రసూనమొహంలోకి చూస్తూ.

అవునేమో అని లీలగా తోచిందతనికి క్షణంలో సగంసేపు. క్షణంలో ఒక్క సగంసేపు మాత్రమే!

ooo

(తెలుగు తూలిక 2002.)

# 8. గుడ్డి గవ్వ

చెరువొడ్డున ఇసకలో కాళ్ళీడ్చుకుంటూ నడుస్తున్న ముత్యం కళ్ళు తళుక్కుమన్నాయి. ఎదుట గజందూరంలో సమాధినిష్ఠలో ఉన్నట్టో సన్ బేదింగ్ చేస్తున్నట్టో కనిపిస్తున్న గవ్వని చూడగానే. రెండు నెలవంకల నడుమ సాగిలపడిన జెర్రిపోతులాటి సన్నని నల్లని నెర కనిపిస్తూ అతనికన్నునాకట్టుకుంది ఆ గవ్వ చిన్నదే అయినా. చుట్టూ పరుచుకున్న ఇసకరేణువులు ఎండకి మెరుస్తూ ఓ వింత శోభని వెచ్చిపెట్టేయి దానికి. ముత్యం చూస్తూ నిలబడిపోయేడు కొంతసేపు. దాన్ని అక్కడే వదిలేస్తే మరో పసివాడి మనసుని ఉల్లాసపరుచునేమో ...

ముత్యం ఒంగి దాన్ని చేతిలోకి తీసుకుని ఎత్తి పట్టుకుని కళ్ళు చిట్లించి చూసేడు. అడుగున ఆవగింజంత కన్నంలోంచి ఇసకరేణువులు పొడగట్టేయి అతడికంటికి. అది అలా చేత్తో పుచ్చుకునే మరో పదడుగులు వేసేడు. మరుక్షణంలో అతడికి దానిమీద ఎక్కళ్ళేని విసుగూ వచ్చింది. ఒంట్లో బలాన్నంతా కూడగట్టుకుని వీలయినంత మేర నీటిలోకి విసిరి కొట్టేడు. అతను వాళ్ళపల్లెలో ఉన్నప్పుడు అలా చేసేవాడు. గులకరాళ్ళని ఏటవాలుగా ఒంగి ఒడుపుగా నీటిలోకి విసిరేవాడు. ఓమోస్తరు పలకలు దేరినరాయి అయితే నీటిమీద రెండు కప్పగంతులేసి మునిగిపోతుంది. కానీ ఈరోజు ముత్యం విసిరిన గుడ్డిగవ్వకి చిల్లుండడంవల్ల బుడుంగుమని పడ్డచోటే మునిగిపోయింది.

ooo

లోపల వనజ వంటింట్లో కూరలూ, గిన్నెలూ, పప్పులూ, ఉప్పులూ కౌంటరుమీద అమర్చుతోంది. మరో గంటలో స్నేహబృందం దిగుతుంది.

గిరిబాబుకి ఇంటరులో ఇంగ్లీషుపాఠాలు చెప్పిన శేఖరం వాళ్ళ అమ్మా, నాన్నలకి దేశం చూపించడానికి కార్లో బయల్దేరేడు. దూరప్రయాణాలకి ప్లేనెక్కినా, శేఖరం వీలయినంతవరకూ కారులో తిరగడానికే ఎక్కువ ఇష్టపడతాడు దారిలో అవసరమయినప్పుడు ఆగొచ్చని. ఆ రోజు ఓంప్రథమంగా తల్లిదండ్రులని తీసుకుని దగ్గర ఊళ్ళు చూపించడానికి కారులో బయల్దేరేడు.

మధ్యాహ్నం పన్నెండయింది. గిరికి ఆఫీసు అట్టే దూరం కాదు. రోజూ కాకపోయినా అవసరమయినప్పుడు లంచికి రాగల దూరమే. ఇవాళ స్నేహితులు వస్తున్నారు కనక అతను కూడ లంచిపేళకి ఇంటికొచ్చేడు. అతను తలుపుదగ్గరకి వచ్చే సమయానికే శేఖరం కారు ఇంటిముందు ఆగింది. గిరి నవ్వుతూ రెండడుగులు అటేసి నిలుచున్నాడు వాళ్ళందరూ కారు దిగేవరకూ.

శేఖరం కారాపి, దిగి తల్లిదండ్రులకి తలుపు తీసి పట్టుకుని, వాళ్ళు దిగింతరవాత ట్రంకు తీసేడు. సూట్‌కేసులు తీయబోతుంటే గిరి దగ్గరికి వచ్చేడు. మప్పితంగా పెద్దలకి నమస్కారాలు చెప్పి, “మీరు పదండి, నేను తెస్తాను సామాను,” అంటూ శేఖరానికి అడ్డు పడ్డాడు. అంటే నిజంగా అతనే తెస్తాడని కాదు. తమ్ముడు ముత్యానికి సౌంజ్ఞ చేసేడు కళ్ళతోనే.

శేఖరం మొహమాటపడుతూనే చేతిలో పెట్టెలు వదిలేసి గిరిని అనుసరించేడు. ఆ వెనక సోమయ్యగారూ, కోటమ్మగారూ నెమ్మదిగా వారిని అనుసరించేరు అటూ ఇటూ ఉన్న పూలమొక్కలు చూస్తూ. తలుపుదగ్గర వనజా, బాబీ నిలబడ్డారు స్వాగతం చెపుతూ.

ముత్యం కారుదగ్గరికి పెళ్ళి మొత్తం మూడు రెళ్ళు ఆరు పెట్టెలూ ఒకొకటే లోపలికి తీసుకొచ్చి రెండో అంతస్థులో అతిథులగదిలో పెట్టేడు. తరవాత వంటింట్లోకి పెళ్ళి కాఫీలు తెచ్చేడు అందరికీ.

గిరి ఇబ్బందిగా చూస్తూ, “కూచో, నీ కాఫీ ఏదీ?”అన్నాడు కానీ ముత్యం కూచోలేదు. పనుందన్నట్టు తలతో అటు చూపి పెళ్ళిపోయేడు లోపలికి.

కోటమ్మ "సాయం చేయనా?" అంటూ వంటగదిలోకెళ్ళింది కానీ అక్కడ ఆవిడకి చేసేదేం కనిపించలేదు.

ముత్యం కరివేపాకు రెమ్మలు వనజకిచ్చి, అక్కడే నిలబడ్డాడు. ఆవిడ నాలుగు వంకాయలు, కూరలు తరుక్కునే కత్తి అతనిముందు పడేసింది. అతను తలొంచుకుని వంకాయలు తరగసాగేడు.

కోటమ్మ వాళ్ళిద్దర్నీ చూస్తూ గతం తలబోసుకోసాగింది, "ఏమిటో కాలం. చూస్తే నాలుగుతరాలు గడిచిపోయినట్టుంది. నిన్నా, మొన్నా ఇంటినిండా గలగల్లాడుతో పదిమందిమి ఆడవాళ్లం తిరిగేవాళ్ళం ఎప్పుడు చూసినా. ఒకరికొకరు పనులు పురమాయించుకోటాలు లేవు. ఎప్పుడు చూసినా ప్రతి ఒక్కరికీ చేతినిండా పనే. ఏ రోజు చూసినా ఇల్లు సత్తరవులా ఉండేది వచ్చేవాళ్లూ పోయేవాళ్ళూను. మాతాత అసలు సహపంక్తిన రెండోవిస్తరి లేకుండా అన్నానికి కూచునేవాడే కాదు."

వనజ నవ్వుతూ వింటోంది. ఇండియానించి వచ్చినవాళ్ళకి రెండే విషయాలుంటాయి మాటాడ్డానికి. అయితే ఇక్కడున్న సౌఖ్యాలూ లేకపోతే అక్కడ ఆరిపోతున్న సంప్రదాయాలూను.

ముత్యం తరిగినకూర ముక్కలు మరోసారి నీళ్ళతో కడిగి, వదినగారికిచ్చి, సింకులో పడేసిన గిన్నెలు కడగడం మొదలుపెట్టేడు. ముత్యం వచ్చి ఏడాదయింది. ఈ ఏడాదిలోనూ ఇలాటి కథలు కొన్ని వందలసార్లు విన్నాడు. నలుగురు చేరినప్పుడల్లా ఇవే కబుర్లు.

ముందుగదిలో శేఖరంతండ్రి సోమయ్య అటూ ఇటూ చూసి లేవబోతుంటే, గిరి చూసి, "ఏం కావాలండీ?" అనడిగేడు.

"ఏంలేదు బాబూ, కొంచెం మంచినీళ్ళు ... నేను తెచ్చుకుంటాలే," అన్నారు సోమయ్య.

"మీరు కూచోండి, నే తెస్తా," అని ముత్యాన్ని కేకేశాడతను.

ముత్యం మంచినీళ్ళు తెచ్చి ఆయనకి ఇచ్చి లోపలికెళ్ళిపోయేడు. గిన్నెలు కడగడం అయిపోయనతరవాత బాబీ పక్కన కూచున్నాడు. బాబీ లెక్కలు చేసుకుంటున్నాడు. తనకి తెలీనివి ముత్యాన్ని అడుగుతున్నాడు.

“పిల్లాడిచదువులో కూడా సాయం చేస్తున్నాడే. మంచి అబ్బాయినే సంపాయించారు. ఈ రోజుల్లో మనూర్ల ఒళ్ళొంచి పని చేసే పాలేర్లు కనిపించట్లేదసలు,” అంది కోటమ్మ.

వనజ ఉలిక్కిపడి, “అయ్యయ్యో పాలేరు కాదండీ. మా మరిది. రెండేళ్ళక్రితం జబ్బు పడ్డాడు, గొంతు పూడుకుపోయింది. ఇక్కడ ఆపరేషను చేయించడానికి తీసుకొచ్చేం,” అంది గబగబా.

“మరి ఆపరేషను అయిందా?”

వనజకి మహా సంకటం అయిపోయింది ఏ వంకా చుట్టం కాని ఈవిడకి తను సమాధానం చెప్పకోవలసిరావడం!

“ఏదీ? ఎప్పటికప్పడు అలానే అయిపోతోందండీ. ఆదిని డాక్టర్లతో సంప్రదింపులూ, పరీక్షలతోనే ఆర్నెల్లు అయిపోయింది. ఇంతలో మా చెల్లెలిపెళ్ళి వచ్చిపడింది. కట్నం కాదు ఖర్చులకంటూ పెళ్ళికొడుకువాళ్ళు పట్టు పడుతున్నారని మానాన్న ఉత్తరాలమీద ఉత్తరాలు గుప్పించేరు. మాదగ్గర లేదంటే నిష్ఠూరం. అదయేసరికి ఇంటిరిపేర్లు. ఏటిఒడ్డున ప్రశాంతంగా ఉంటుందని ఈ ఇల్లు కొన్నాం. గట్టిగా నాలుగు వానలు పడేసరికి ఇంట్లోకి నీళ్ళొచ్చేస్తున్నాయి. పునాదులు కూరుకుపోతున్నాయి. ఈ వేసవిలోనైనా అవుతందేమో చూడాలి,” అంది వనజ గుక్క తిప్పకోకుండా.

“అది కాదు నేనన్నది,” అన్లేదు కోటమ్మగారు. వింటూ ఊరుకొంది. చాలామంది అంతే. మనం ఒకటడిగితే వారొకటి చెబుతారు. వారికారణాలు వారికుంటాయి అలా చెప్పడానికి మరి అని ఆవిడ అనుభవం.

పక్కగదిలో గిరిబాబు మాటలు వినిపిస్తున్నాయి, “ఏమిటో మాస్టారూ, ఇక్కడ ఇన్ని కబుర్లు చెబుతారు కానీ నిజంగా మనిషికి కాదు వీళ్ళు విలువనిచ్చేది. Time is money అంటారు గానీ వాళ్ళటైముకే ఎక్కువ విలువ. మనం ఎంత చేసినా ఇంకా ఇంకా చేయించుకోవాలనే చూస్తారు. మీరు విన్నారో లేదో కానీ మనం రెండింతలు పని చేస్తే వాళ్ళు తమవారికి ఇచ్చేదాన్లో సగం చేత బెడతారు. అది కూడా అక్కడికేదో మననుద్ధరిస్తున్నట్టు పోజు పెడుతూ.”

“విలువలు వేరూ, బజారుధరలు వేరూను,” అన్నారు సోమయ్యగారు నవ్వుతూ. అవును మరి. అవతలిమనిషి ఎదటివాడి సామర్థ్యం కాదు చూసేది. ఆ సామర్థ్యం తనకెంత ఉపయోగపడుతుంది అన్నదాన్ని బట్టే విలువ కట్టడం. ఎవరిమటుకు వారికి వాళ్ళ ధనం మాత్రమే ఘనంగా కనిపిస్తుంది కానీ తాను ఎదటివాడిశ్రమకి విలువ కడుతున్నాననుకోడు.

వనజ వచ్చింది భోజనాలకి లేవండంటూ.

ముత్యం బల్లమీద కంచాలూ, గ్లాసులూ అమర్చేడు. ఎనిమిదిమందికి సరిపోయే బల్ల. అందరూ కూర్చున్నారు. బాబీపక్కన ముత్యం కూర్చున్నాడు.

గిరి మళ్ళీ మొదలు పెట్టేడు, “మనవాళ్ళందరూ మేం ఇక్కడ డాలర్లు కుప్పలుతిప్పలుగా సంపాయించేస్తున్నాం అనుకుంటారు కానీ ఎంత కష్టపడితే వస్తాయవి. మనవాళ్ళన్నట్టు అవేం చెట్టున కాయవు కదా. అసలు చదువు పూర్తయేసరికే ఆస్తులు హరించుకుపోయేయి. ఎలాగో అయిందనిపించేం కానీ ఉద్యోగంలో చేరేక తెలిసింది నిజంగా కాయకష్టానికున్న విలువ. రోజుకి ముప్పై గంటలు గిలగిల్లాడినా ఎప్పుడు ఏ కష్టమరు ఏ చిక్కుల్లో ఇరికిస్తాడోనన్న బెదురే. ఏ కంపెనీ ఎప్పుడు మూత పడుతుందో, ఎప్పుడేం పుట్టి మునుగుతుందో అనుకుంటూ అనుక్షణమూ బెంగే. ఇవాళున్న ఉజ్జోగం రేపుంటుందన్న భరోసా లేదు. ఇంత కష్టపడి సంపాయించిన సంపాదనమీద ఇంటిల్లిపాదీ ఆశలు పెట్టుకుంటారు కదా. ఈ మధ్య మాస్నేహితుడొకడు - మా ఆఫీసులోనే ఉంటాడు

- దాదాపు కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు. తమ్ముళ్ళచదువులూ, చెల్లెళ్ళకి చదువుల్తోపాటు పెళ్ళిళ్ళూ, - వీటితో ఆరిపోతున్నాననని. పైగా వాళ్ళ మేనమామ ఎప్పుడో వాళ్ళమ్మ పెళ్ళికి పదివేలు అప్పు చేశాట్ట అది ఇప్పటికీ దెప్పుతూనే ఉంటాట్ట. 'ఎన్నిమార్లు తీర్చేనో చెప్పలేను ఆ పదివేలూను. ఆయనో నేనో హరీమనేవరకూ తీరేలా లేదది' అన్నాడు,'' అంటూ నవ్వేడు గిరి. ఎంచేతో గానీ పొరుగువాడిబాధలంత చక్కని సబ్జెక్టు దొరకదు కాలక్షేపం కబుర్లకి.

''టైము చూసుకో,'' అంది వనజ.

అతను గతుక్కుమని వాచీ చూసుకుని, గబగబ నాలుగు మెతుకులు కతికి, ''సాయంత్రం మాటాడుకుందాం. మీరు పడుకోండి కొంచెంసేపు,'' అని చెప్పేసి వెళ్ళిపోయేడు.

సాయంత్రం గిరి కొంచెం ఆలస్యంగా వచ్చేడు. హాల్లో కూచుని తెలుగుసినిమా ఏదో చూస్తున్నారందరూను. హాయ్ అన్నాడు బాబీ తండ్రిని చూసి. వనజా, శేఖరమూ గిరిమొహం చూసి గతుక్కుమన్నారు. అతనిమొహం పాలిపోయి ఉంది. ఆర్నెల్లనుండీ అన్నం తిననివాడిలా నీరసపడిపోయేడు.

''ఏంవయిందీ? ఒంట్లో బాగులేదా?'' అంది వనజ లేచి దగ్గరికి వస్తూ.

గిరి ఏమీ లేదన్నట్టు సైగ చేసి లోపలికెళ్ళిపోయేడు. వనజ అతన్ననుసరించింది. ఓ పావుగంట తరవాత ఇద్దరూ హాల్లోకి వచ్చి సంగతి చెప్పేరు. ఆ నాటితో అతని ఉద్యోగం సరి.

''ఐయాం సో సారీ,'' అన్నాడు శేఖరం.

సోమయ్యగారు అయ్యో అన్నారు.

గిరి నెమ్మదిగా వివరాలు చెప్పేడు. మేనేజ్మెంటు కొంగ్రొత్తపద్ధతుల్లో కంపెనీ పునరుద్ధరించదలుచుకున్నార్ట. గిరిస్థానంలో అప్పుడే యేల్ నించి దిగివచ్చిన యువకుడిని వేసుకున్నారు. గిరిని పొమ్మనలేదు కానీ అతనికి చూపిన మరో స్థానం మాత్రం అతని సామర్థ్యానికీ, అర్హతలకీ తగింది కాదు. ''కాదు, కాదు, అలా

అనుకోకు. ఇందులో కూడా నువ్వు పైకి రావడానికి బోలెడు అవకాశాలున్నాయి,'' అన్నాడు మేనేజరు. గిరి ఉడికిపోతూ ఇల్లు చేరుకున్నాడు. వారం రోజులు వ్యవధి ఇచ్చేరు అతనికి జవాబు చెప్పడానికి.

''నిన్న మనం అనుకున్నాం ఈమాటే కదండీ. మీరు చెప్పండి మాష్టారూ. ఒక మనిషి శక్తి సామర్ధ్యాలకి విలువ ఎలా కడతారు ఎవరైనా?'' అతని గొంతులో నిన్నటి ఔద్ధత్యం లేదు మచ్చుకైనా.

శేఖరం చాలాసేపు మాటాడలేదు. తరవాత నెమ్మదిగా, ''ఎవరి కొలమానాలు వారివి గిరీ. నీకున్న సామర్ధ్యానికీ వాళ్ళకి కావలసిన సామర్ధ్యాలకీ పొందిక లేకపోవచ్చు కదా. వాళ్ళు చూసేదల్లా ఎంత చవగ్గా వాళ్ళపని అయిపోతుందనే. నీ దృష్టిలో నీ డాలరుకున్న విలువే వారి దృష్టిలో వారిడాలరుకుంటుంది. ఆ రెండు దృక్కోణాల్లోనూ తేడా నీకు తెలిసే ఉంటుంది.''

లేదు. తనకి ఆ రెండు దృక్కోణాల్లోనూ తేడా కనిపించడంలేదు. అది అతని దృష్టిలోపం అనడానిక్కూడా లేదు. క్లాసులోనూ పుస్తకాల్లోనూ విశ్లేషించే తేడా కాదది. మాష్టారు చూడకుండా గిరి పళ్ళు కొరుక్కున్నాడు.

పరిస్థితులు గమనించి శేఖరం వాళ్లూ తెల్లార్తూనే ప్రయాణం కట్టేరు.

''అదేంటండీ రెండు రోజులుంటాం అన్నారు కదా. ఉండండి. ఫరవాలేదు. ఆమాత్రం పెట్టలేకపోం,'' అన్నారు గిరీ, వనజా నొచ్చుకుంటూ.

''మీరు పెట్టలేరని కాదు గిరీ. పెదరు బావుంది. అమ్మా, నాన్నా పెద్దవాళ్ళు కదా. అట్టే శ్రమ తట్టుకోలేరు. ఇప్పుడు బయల్దేరితే మధ్యాన్నానికల్లా ట్విన్ సిటీస్ చేరుకుంటాం. మళ్ళీ వస్తాంలే,'' అని శేఖరం సర్ది చెప్పేడు.

''బ్రేక్‌ఫాస్టు తిని వెళ్ళండి,'' అంది వనజ.

''నాకేం పాలుపోడంలేదు మాష్టారూ, మీసలహా ఏమిటి?'' అనడిగేడు గిరి సోమయ్యగారిని. ఆయన మాష్టారు కాకపోయినా పెద్దవాడు కనక తత్తుల్యుడే మరి.

సోమయ్య నెమ్మదిగా తన అభిప్రాయం వివరించేరు, "గిరీ, ఆ రెండో ఉద్యోగంలో చేర్తావో లేదో నాకు తెలీదు. కానీ నాకు అర్థం కానిది చెప్తాను. ఇక్కడికొచ్చేక లేదా ఈ కాలంలోనే అనుకో ఎంతసేపూ తానెంత రాబట్టుకోగలనన్న యావే కనిపిస్తోంది ఎవర్ని చూసినా. ఈ తగ్గింపు ధరలూ, ఉచితంగా ఇచ్చే వస్తువులూ చూడు. కారు కొంటే సైకిలు ఉచితం, నువ్వు సైకిలుకోసం కారు కొనవు. కారు కొంటే వచ్చే సైకిలుధర కారుధరలో ఇమిడి ఉంటుందని కూడా నీబుద్ధికి తెలుసు, అయినా సరే, కారుతో పాటు సైకిలు తెచ్చుకుని మహదానందం పొందుతావు. అలా ఉచితంగా వచ్చిన వాటితో మావాడింట్లో ఓ గది నిండిపోయింది. పూర్వం మా తాత ఒక కొబ్బరికాయ కొంటే మరో కొబ్బరికాయ కొసరడిగేవాట్ట. ఆ మాట చెప్పి మా అమ్మ నవ్వుతూండేది. నిన్న అందుకే అన్నాను విలువలు వేరూ, బజారుధరలు వేరూనని. ఉదాహరణకి నువ్వు నీ రెస్యూమెలో నీకు కర్ణాటకసంగీతం వచ్చుననీ అంచేత నీ కాతాదార్లతో కర్ణపేయంగా మాటాడి ఒప్పించగలననీ రాస్తావనుకో. అది నీ మేనేజరుకి నచ్చితే సరే. లేకపోతే "నాకు కావలసింది నీ business acumen కానీ నీసంగీతం కాదయ్యా" అని కొట్టిపారేస్తాడు. అంటే నీ విద్యలో తనకి పనికొచ్చేదానికి మాత్రమే విలువ కట్టేడతను. నీ అవసరాన్నిబట్టీ నీ ఓపికని బట్టీ నువ్వు నీ ధర కట్టుకున్నావు. ఇంతకీ నీ ప్రశ్న - ఈ సంగతి అందరికీ తెలిసినా ఎవరూ పట్టించుకోరు ఎంచేత?"

గిరికి ఆయనమాటలు అర్థం కాలేదు. తను అడిగిందేమిటి, ఆయన చెబుతున్నదేమిటి?

ముత్యం సామాను తెచ్చి కారులో పెట్టేడు. సోమయ్యగారికేం అనిపించిందో ముత్యందగ్గరకొచ్చి అతనిభుజం తట్టి, చేయందుకుని ఆ చేతిలో ఓ పచ్చకాయితం పెట్టేరు.

ముత్యం వద్దంటూ తలూపేడు కానీ ఆయన తనచేత్తో అతనిగుప్పిడి మూసి వెళ్ళి కార్లో కూచున్నారు. కారు కదిలేక గిరీ, వనజా లోపలికెళ్ళిపోయేరు.

ముత్యం అక్కడే నిల్చున్నాడు స్తబ్ధుడై. అతని గుప్పిట్లో నోటు నలుగుతోంది. మనసు నలికిలపాములా మెలికలు తిరుగుతోంది. అమ్మమాటలు జ్ఞాపకం వచ్చేయి, "గుప్పిడి మూసినంతసేపే గారడీ,"

బాబీ పక్కన నిల్చుని "ఏంటది నీచేతిలో? చూపించు, చూపించు," అంటున్నాడు చెయ్యి లాగుతూ.

ముత్యం ఓ క్షణం వాడివేపు చూసి, తన ముష్టి చూసుకున్నాడు. తనున్న పరిస్థితుల్లో దాని విలువెంత?

"చూపించు," బాబీ వదలకుండా చెయ్యి పుచ్చుకు లాగుతున్నాడు.

ముత్యం వేళ్ళు సడలి సుతారంగా కలువరేకుల్లా విచ్చుకున్నాయి. ఓ పిల్లగాలొచ్చి అతని చేతిలోని కాయితం నొల్లుకుపోయింది. నిన్నటి గవ్వే నయం, కాస్త ఊపు కావలసివచ్చింది విసరడానికి.

ఆ గుడ్డి గవ్వపాటి చెయ్యలేదీ పచ్చ కాయితం!

ooo

(షికాగో తెలుగువెలుగు, ప్రత్యేకసంచిక, ఆటా 2004, లో ప్రచురితం.)

# 9. పరీక్ష!

కాంతకి తెలుగుపాఠాలు చెప్పే ఉద్యోగం దొరికింది అమెరికాలో. వచ్చి ఒళ్లో వాలింది అక్షరాలా!

ఆవిడ అమెరికా వచ్చి ఆరేళ్లయింది జాగ్రఫీ ప్రొఫెసరు మూర్తికి ఇల్లాలిగా. తరవాత మూడేళ్ల బాలకృష్ణుడికి అమ్మస్థానం కూడా సంపాదించుకుంది. అమెరికాకొచ్చేక అదనంగా కలిగిన వసతి హోమ్మేకరు స్థానం. అంటే ఇల్లు కట్టడం కాదు, కాపురం నిలబెట్టుకోడం. అంచేత ఆవిడ ఉద్యోగాల వేటకెళ్లలేదు.

అలాటి శుభసమయంలో "తెలుగు చెప్తావా?" అంటే కాంతకి హాచ్చర్యమ్ ముంచుకొచ్చేసింది. దానివెనకున్న కథా కమామీషు మొదలెట్టాలంటే కొండవీటి చాంతాడంత అవుతుంది గానీ సూక్ష్మంగా జరిగింది ఇదీ ...

దాదాపు పాతికేళ్లకిందట అఖిలజగత్తుని ఏకచ్ఛత్రాధిపత్యంగా ఏలుతున్న అమెరికా ప్రభుత్వం మొత్తం మానవజాతిని గ్లోబలైజు చెయ్యడానికి సిద్ధమయిన శుభసందర్భంలో వాళ్లకి అర్థమయింది భాషబలం. ఇండియాలాటి దేశాలనించి జనాలు తండోపతండాలుగా అమెరికాకి తరలి వస్తుండడంచేత వాళ్లభాషని ఏదోవిధంగా గుర్తించాలని నిర్ణయించుకుని ప్రభువులు గ్రాంటులు గ్రాంటు చెయ్యడం మొదలెట్టారు. ఆ సమయంలో ఓ చిన్న యూనివర్సిటీవారు చరిత్ర ప్రొఫెసరు జాన్ హేస్టింగ్స్‌గారిని తెలుగు చెప్పమన్నారు. ఎందుకంటే, ఆయన చిన్నప్పుడు తండ్రిగారు మతప్రవక్తగా తెలుగుదేశంలో ఉండడంచేత హేస్టింగ్ దొరగారికి తెలుగుదేశంలో కొంత కాలం గడిపే భాగ్యం కలిగింది. తెలుగు ఆటోమేటిగ్గా వచ్చేసింది. ఆయన మొదట్లో ఉత్సాహంగానే తెలుగు చెప్తూ వచ్చేరు కానీ కానీ ఈమధ్యే అది ఆయనకి కష్టమవడం మొదలెట్టింది.

ఎందుకంటే, ఆయనకి ప్రొఫెసరుగా టెన్యూర్ తెచ్చుకునే సమయం ఆసన్నమయింది. దానికోసం ఆయన పడవలసిన పాట్లు చాలా ఉన్నాయి. ముందు అర్జెంటుగా ఓ పుస్తకం ప్రచురించాలి. (చూసారా, పుస్తకాలు ఎలా ప్రచురింపబడతాయో). ఇంతకీ ఈ కారణాలన్నిటి మూలానా, తెలుగు చెప్పడానికి మరో మనిషిని వేసుకోమని ఛైరుని అడిగేరు.

ఆ ఛైరు "కొత్తలెక్చరరు పదవి పుట్టించడానికి డబ్బుల్లేవు. కావలిస్తే, ఓ టియేని ఇస్తా. ఎవరైనా ఉంటే చూడండి," అని సలహా యిచ్చేరు.

మామూలుగా teaching assistant అంటే స్టూడెంటు అయివుండాలి. ఆమీదట, తెలుగుపాఠాలు చెప్పే ఇష్టం ఉండాలి. తెలుగు చెప్పగలిగిన జ్ఞానం కూడా ఉండాలి. హేస్టింగ్స్‌గారు పదేళ్లుగా తెలుగు బోధిస్తున్నా, తమకి కావలసినస్థాయికి వచ్చి, ఆ ఆసక్తి కలిగిఉన్న అమెరికన్ తెలుగు స్టూడెంటుబాబులెవరూ తయారవలేదు వారి హయాంలో. అంచేత, రూలు కొంచెం సవరించుకుని, "ఊళ్లో వున్న మరోమనిషిని చూసి పట్టుకురా," అన్నారు ఛైరుగారే మళ్లీ.

ఇదీ వెనకటి వృత్తాంతం.

ప్రస్తుతం జాన్ హేస్టింగ్స్‌దొర తనకి సహాయకుడిని వెతిక్కుంటున్నారు. సుదీర్ఘంగా ఆలోచించగా, జాగ్రఫీ ప్రొఫెసరు మూర్తి జ్ఞప్తికి వచ్చేడు. ఆ మూర్తి ఎక్కడ ఉంటాడా అని దిక్కులు చూస్తూంటే, గాజుగోడల్లోంచి, ఫేకల్టీలౌంజిలో కాఫీ చప్పరిస్తూ, కనిపించేడతను గ్రహాలన్ని అనుకూలస్థానాల్లో ఉండడంచేత కాబోలు.

హేస్టింగ్స్ వెంటనే లౌంజిలోకి చొరబడి, మూర్తిపక్క చేరి, హై అన్నాడు ఎంతో సంతోషంగా.

మూర్తి కూడా తిరుగుటపా హై చెప్పేడు.

రెండోప్రశ్న, "మీభార్య ఎట్లు కలదు?"

"బాగుంది," అన్నాడు మూర్తి సాలోచనగా. తనకి ఈయనగారితో అట్టే బాంధవ్యం లేకపోవడంచేత ఆ ప్రశ్న అసందర్భంగా తోచి కొంచెం తికమక అయింది అతనికి.

"ఆమెకి మాస్టర్స్ డిగ్రీ ఉందని నువ్వు చెప్పినట్టు నాకు జ్ఞాపకం వస్తోంది. ఏమైనా ఉద్యోగము చేయుచున్నదా?"

మూర్తి ఈసారి నిజంగా గుమ్మయిపోయేడు. తానెప్పుడు తనభార్య ఉద్యోగాలు వెతుక్కుంటోందని ఎవరితోనూ అనలేదు. "అవును. ఆమెకి ఎకనమిక్స్‌లో మాస్టర్సు డిగ్రీ ఉంది. లేదు. ఉద్యోగం చెయ్యడంలేదు," అన్నాడు ఆయనప్రశ్నలకి అదే వరసలో జవాబులిస్తూ..

"నాకో ఆలోచన వచ్చింది. మేం తెలుగు బోధించేవారికోసం చూస్తున్నాం. ..." అన్నాడు హేస్టింగ్స్ ఎటో చూస్తూ.

"కాంత ఎప్పుడూ తెలుగు చెప్పలేదు పూర్వం. దేశంలో బాంక్‌లో పనిచేసింది."

"ఆమె నేటివ్ స్పీకరు కదా. అక్షరాలు వచ్చుకదా. ఆమెకి చదవడం, రాయడం వచ్చు కదా."

"అవును. వచ్చు. వచ్చు మరియు వచ్చు."

"అడిగి చూడండి. ఆమెకి ఇష్టమయితే, నన్ను కలవమని చెప్పండి."

"సరే, తనతో మాటాడి చెప్తాను."

"అలాగే. అట్టే టైము లేదు మరి. ఏదో ఒక సంగతి నాకు త్వరగా చెప్పండి. ఛెయిర్ అవుట్‌సోర్స్ చెయ్యమంటున్నారు," అని గుమ్మంవేపు నాలుగడుగులేసి, ఆగి, విలాసంగా వెనక్కి తిరిగి, "జీతం పెద్దది కాకపోవచ్చు కానీ ఆంధ్రాలో బాంకుసంపాదనతో పోలిస్తే చాలా ఎక్కువే కదా," అన్నాడు హేస్టింగ్స్.

మూర్తికి ప్రాణం చివుక్కుమంది. స్థానబలం అనుకున్నాడు కసిగా.

000

కాంత బట్టలు వాషర్‌లో పడేసి, హాల్లో కూర్చుంది పుస్తకం పట్టుకుని.

మూర్తి గరాజిలో కారు పెట్టి, లోపలికి వస్తూ, "కిట్టు ఏడీ?" అనడిగేడు యదాలాపంగా.

కాంత కాఫీ పెట్టడానికి లేచింది, "పక్కవాళ్లపిల్లలతో పార్కుకి వెళ్లేడు" అంటూ.

మూర్తి ఆవిడవెనకే వంటింట్లోకి నడిచేడు.

"ఏంటి కథ?"

"ఏం. వంటగదిలోకి రావడానికి నాకధికారం లేదా?" అన్నాడు మూర్తి సీరియస్‌గా.

కాంత నవ్వేసి, కాఫీ కలపసాగింది.

ఇద్దరూ చెరోకప్పూ పుచ్చుకుని హాల్లోకి వచ్చేరు.

మూర్తి ఏదో చెప్పాలనుకుంటున్నాడన్నది కాంతకి స్పష్టమయింది. "ఎంతసేపు సస్పెన్సు? చెప్పేదేదో చెప్పేస్తే, నీపాట్న నువ్వు టీవీలో వార్తలు చూసుకోవచ్చు. నాపాట్న నేను బట్టలుతుక్కోడమో, పుస్తకం చదవడమో చేసుకుంటాను," అంది కాంత.

మూర్తి ఉలిక్కిపడి, ఏంలేదని గట్టిగా నొక్కి వక్కాణించి ఆ తరవాత నెమ్మదిగా, "జాన్ అని హిస్టరీ ప్రొఫెసరు నీకు గుర్తుందా? కిందటేడు ఆఫీసుపార్టీలో కలిశాం."

"ఆఁ. పొడుగ్గా, సన్నగా రివటలా ఊగిపోతుంటాడు. ఆయనేనా?"

మూర్తి నవ్వేడు. "ఇక్కడ పొడుగ్గా లేనిదెవర్లే కానీ ఆయనే."

"ఏం? ఏమంటాడు?"

మూర్తి తటాపటాయిస్తూ, "ఏంలేదు. మధ్యాన్నం లౌంజిలో కనిపించి ఏదో సలహా చెప్పేడు."

"ఆఁ."

“ఏంలేదు. నువ్వు తెలుగు చెప్తావా అని అడిగేడు. అదే ... నీకు ఇష్టమయితేనే ...”

“నేనేమీ ఉద్యోగాలకోసం చూడ్డంలేదు కదా. పైగా నాకు తెలుగులో డిగ్రీ లేదు కదా,” అంది కాంత ఆశ్చర్యపోతూ.

“నేనూ అదే చెప్పేను ఆయనకి. నీకిష్టమయితేనే ...”

ఉరుములేని పిడుగు! ఈయనకి నేను ఉద్యోగం చెయ్యాలని ఉందా? తను చెప్పలేక జాన్‌ని అడ్డం పెట్టుకుని చెప్తున్నాడా? ఆమాట తనే చెప్పొచ్చు కదా. జాన్నీ, మరో వెంకన్ననో వంక ఎందుకూ. .. ఆలోచనలతో ముందు చిరాకేసింది. తరవాత కోపం వచ్చింది. తరవాత అడగదలుచుకున్న మాట వచ్చింది, “నేను ఉద్యోగం చెయ్యాలనుందా నీకు?” అంది మూర్తిమొహంలోకి గుచ్చి చూస్తూ.

“నాకుంది అన్లేదు నేను. ఆయన చెప్పినమాట నీకు చేరేసేనంతే. నేను కేవలం వార్తాహరుడిని మాత్రమే. పైగా నీకు తెలుగులో డిగ్రీ లేదని కూడా చెప్పేను,” అన్నాడు మూర్తి కూడా చిరుకోపంలాటి చిరాకు ప్రదర్శిస్తూ.

“నువ్వు నన్ను అపార్థం చేసుకుంటున్నావు” అని కూడా చేర్చేడు ముందుజాగ్రత్త కొంత తీసుకుని.

కాంత నవ్వింది, “సరే, నేను నిన్ను అపార్థం చేసుకోను. నిజ అర్థమే చేసుకుంటాను. ఇంకేమిటి ఇతర వివరాలు?”

“శాంతించేవా?”

“..చేను.”

“దేవిగారిఅనుజ్ఞ అయితే చెప్తాను.”

“అయింది.”

“ఏంలేదు. మామూలు ఉద్యోగాల్లా పగలంతా 9 టు 4 ఆఫీసులో ఫైళ్లతో కుస్తీ పట్టఖ్ఖర్లేని పని. వారానికి మూడురోజులు క్లాసు ఉన్నప్పడు మాత్రమే వెళ్లి

వచ్చేయడమే. పాఠాలు ఇంట్లోనే తయారు చేసుకోవచ్చు. అది కూడా ఆఫీసుటైం కిందే లెఖ్ఖ. పైగా నీకు ఈ నాలుగ్గోడల చెరలోనించి బయట పడ్డట్టు కూడా ఉంటుంది కదా." అన్నాడు హడావుడిగా ఎవరో తరుముకొస్తున్నట్టు.

కాంత వింటూ అతన్ని చూస్తోంది.

మూర్తికి హుషారు పుంజుకుంది. పిచ్ మరికొంచెం పెంచి, "ఆలోచించుకో. నీయిష్టం. మరో నాలుగురాళ్లు చులాగ్గా కలిసొస్తాయంటే కాదనడం ఎందుకు?"

కాంత వింటూ ఉండుట కంటిన్యూ చేస్తూంది.

"పైగా నీబాంక్ సంపాదనకంటే నాలుగు రెట్లు."

"ఏంటీ?" కాంత ఉలిక్కిపడింది. కళ్లలో విస్ఫులింగాలు. తనబాంక్ ఉద్యోగాన్ని అంత తేలిగ్గా తీసిపారేయడం అన్యాయం, అక్రమం … "దానికీ దీనికీ పోలికేమిటి? నీకూ తెలుసు కదా ఆ జీతంతో అక్కడ పనిమనిషీ, వంటమనిషీ, చాకలీ .. ఇన్ని సేవలు సాధ్యం. అక్కడిసంపాదనకీ, బతుక్కీ ఇక్కడ వాటితో పోలికేమిటి?"

మూర్తి నాలుక తెగేలా కరుచుకున్నాడు. తెగి రక్తధారలు కురుస్తున్నట్టు ఊహించుకున్నాడు. మొహం హృదయవిదారకంగా మార్చుకుని, "మళ్లీ … ఆ మాటలు నావి కావు. నేను వార్తాహరుడిని మాత్రమే," అన్నాడు.

ఆ పూటంతా అలా ఒకరిమీద ఒకరు కోపాలు పడుతూ లేస్తూ గడిపేలా ఉన్నారిద్దరూ.

"బాగుంది వరస. సరే. నీవార్తాహరుడి స్టేటస్‌తోనే ఇంకా ఏదైనా చెప్పవలసింది ఉందా?" అంది కాంత.

కాంతుడు తల అడ్డంగా ఆడించేడు నిస్సహాయంగా.

కాంత జనాభాలెక్కల్లో ఉద్యోగస్థురాలుగా నమోదు అయింది.

ooo

“ఏముంది ఇక్కడ తెలుగు చెప్పడం అంటే అక్షరాలూ, మాటలూ నేర్పడమే” అనుకున్న కాంతకి అచిరకాలంలోనే అదేమీ అనుకున్నంత సులభసాధ్యం కాదని అర్థమయింది. తన పని అఆలు దిద్దించడం అనుకోడం న్యాయమయిన వివరణ కాదు. అంత కన్నా త్రీరింగ్ సర్కస్ అనడం నయం. లేదా జాన్సన్ మహాశయుడు చెప్పినట్టు ఊరకుక్కలు వెనకకాళ్లమీద నడవడంలాటిది అనొచ్చు. కారణం తనకి తెలిసిన స్కూళ్లకీ, పాఠాలకీ అమెరికాలో స్కూళ్లకీ, పాఠాలకీ, విద్యార్థులధోరణికీ మధ్య గల తేడా సహస్రాంతం. బంగాళాఖాతం అంత అఖాతం. తనరోజుల్లో మేష్టర్లు చెప్పేరు. విద్యార్థులు విన్నారు. పంతులు జ్ఞానం ఇచ్చేవాడు. పిల్లలు పుచ్చుకునేవారు. ఇచ్చేవాడంటే పుచ్చుకునేవాడికి భక్తి. ఇది మన సాంప్రదాయం. అమెరికాలో విద్యావిధానం దానికి పూర్తిగా విరుద్ధం. ఇక్కడ ఇచ్చేవాడు విద్య ఇచ్చేవాడు కాదు. పంతులికి జీతం ఇచ్చేవాడు. మిగతా వాతావరణం అంతా ఆ వాదనమీద ఆధారపడి ఉంటుంది!

కాంతకి ఈపాఠం మొదటివారంలో నేర్పబడింది. క్లాసులో ముగ్గురే విద్యార్థులు. ఇద్దరు హెరిటేజిగాళ్లు. అంటే వాళ్ల తండ్రులూ, తాతలు తెలుగువాళ్లు. ఒకమ్మాయి మాత్రం అమెరికను. తెలుగువాళ్లలో అనిత అమెరికాలోనే పుట్టి, అమెరికాలోనే పెరుగుతున్న దేశీ. రెండేళ్లకోసారి విజిటుకొచ్చే అమ్మమ్మదగ్గర నాలుగు తెలుగు ముక్కలు పట్టుబడ్డాయి ఆ అమ్మాయికి. అంచేత, “నాకు తెలుగొచ్చు” అంటుంది గొప్ప ఆత్మవిశ్వాసంతో. రెండో విద్యార్థి ఫాన్.

000

ఫాన్ ఎనిమిదేళ్లపుడు, విజయవాడలో ఉండగా, మేరీ హాక్ అనే అమెరికన్, దయార్ద్ర హృదయురాలు, ఇండియా చూడ్డానికి వెళ్లడం తటస్థించింది. కుర్రవాడు చిన్నవాడే అయినా చురుకుచూపులవాడు, మెరిక బంగారంలాటివాడు. ఆవిడ దిగిన హొటల్ దగ్గర తచ్చాడుతూ, ఆ హొటల్లో

దిగినవారికి చిన్నచిన్నపనులు చేసిపెడుతూ, రాజాలాగ రోజులు గడిపేసుకుంటూన్న వాణ్ణి చూస్తే మేరీకి ముచ్చటేసింది. ఆహ్, ఎంత డ్రైవూ, ఎంత చొరవా, ఎంత తెలివీ అనుకుని, ఆ అబ్బాయికి అమ్మా, బాబూ లేరని తెలుసుకుని, "నాతో వచ్చేస్తావా, చదువు చెప్పిస్తాను" అంది. అప్పట్లో ఫాను పేరు ప్రేమకుమారు. ప్రేమకుమారుకి విజయవాడ వీధులయితేనేమి, అమెరికా రోడ్డులయితేనేమి అనిపించిందేమో "ఓహ్, యాస్" అన్నాడు విసురుగా హుషారుగా తలెగరేసి.

ఆ తరవాత మేరీ రెండు దేశాల ప్రభుత్వాలకీ అర్జీలు పెట్టుకుని, ప్రార్థించి, అనేకవిధాల పోరు పెట్టి, హోరెత్తుతూ అరిచి, వాదించి, వాళ్లలో ఏమూలో దాగుకొన్న మానవత్వాన్ని మేలుకొలిపి గెలిచి, ఆ ఎనిమిదేళ్ల కుర్రవాడిని అమెరికాకి తీసుకొచ్చుకుంది. ప్రేమకుమార్ అమెరికా చేరేసరికి పదేళ్లవాడయేడు. మేరీ ప్రేమ్ అన్న పేరు అలాగే ఉంచింది it has a nice ring to it అనీ, తాను వాడిని ఇక్కడికి తీసుకువచ్చినా, వాడిసంస్కృతీ, సాంప్రదాయాలు మర్చిపోరాదనీ... ప్రేమ్‌కి మాత్రం ఈ లోకం, ఇక్కడి తీరూ ఆదిలో మహా గందరగోళం అయిపోయింది. అతనికి తెలిసిన ఒకే ఒక భాష మాటాడేవారు చుట్టుపట్ల లేరు కాగడా పెట్టి వెతికినా. స్కూల్లో స్నేహితులు లేరు. మిగతా పిల్లలకి వాడి యాస, బాస, వేషం - అన్నీ హాస్యంగానే ఉన్నాయి. తైవాన్లో తయారయి వాల్మార్ట్‌లో అమ్ముతున్న చొక్కాలూ, జోళ్లూ అన్నీ హా, హా, హీ, హీ..

"మీనాన్న కుట్టేడా ఆ చొక్కా?"

"ఆ జోళ్లు ఎక్కడ దొరికేయిరా బాబూ నీకు?"

ఫాన్‌కి వాళ్ల వేళాకోళాలు దుర్భరం అయిపోయింది. ఇంట్లోంచి పారిపోయేడు. అదృష్టవశాత్తు, వాడిని మేరీ తొందరగానే పట్టుకుంది. వాళ్లింటికి కొంచెం దూరంగా ఉన్న పార్కులో బెంచిమీద పడుకుని నిద్ర పోతుంటే చూసి,

ఇంటికి తీసుకొచ్చింది. అప్పటినుండీ, వాడికి స్థానికసంస్కృతి కూడా నేర్పాలని తోచింది ఆవిడకి. వాణ్ణి కూర్చోబెట్టి ఓ రోజు కొన్ని ధర్మసూత్రాలు వివరించింది. అందులో కొన్ని - నువ్వు ఎవరికంటే తక్కువవాడివి కావు. ఇక్కడ అందరూ సమానులే. నిన్ను తక్కువగా చూసే హక్కు ఎవరికీ లేదు. నీమీద ఎక్కి తొక్కే అధికారం లేదు. నువ్వు అలా వాళ్లని చెయ్యనియ్యరాదు. నిన్ను నువ్వు సదా పరిరక్షించుకోవాలి. అది నీధర్మం. విజయం నీకు ఎవరో ఇవ్వరు. నువ్వే సంపాదించుకోవాలి. విజయం అంటే ఇతరులని నువ్వే అధిగమించి, నీసామర్థ్యం నువ్వే ఋజువు చేసుకోవడం. నిన్ను నువ్వు గౌరవించుకోకపోతే, ఇతరులు నిన్ను గౌరవించరు. ...

ఇవన్నీ బంగారపు మచ్చు తునకలు సరే. బాగానే ఉన్నాయి చెప్తున్నప్పుడు వినడానికి. చిక్కెక్కడంటే ఇలాటివి చెప్పడం సులువు. క్రియలో ఎలా రూపు కడతాయో చెప్పడం కష్టం అని చెప్పడానికి ఫాన్ అవలంబించిన పద్ధతులు చాలు. మేరీ బోధించిన ధర్మసూక్ష్మాలు ప్రాతిపదిక చేసుకుని, ఆ చిన్నిబుర్ర సొంత సూత్రాలు తయారు చేసుకుంది. అందుకు అతని కురచ కాయం, చిలిపికళ్లూ, వసివాడని మోమూ పనికొచ్చేయి మరీ గట్టి చిక్కుల్లో చిక్కుకున్నప్పుడు కూడా. తరవాత అలవాటయింది. అందులో భాగంగా పేరు ఫాన్ అని మార్చుకున్నాడు.

మేరీ ట్యూషను పెట్టించీ. తనే దగ్గర కూర్చుని చదివించీ, వాడు హైస్కూలు డిప్లమా సంపాదించుకునేలా చేసింది.

ooo

మూడో అమ్మాయి జూలీ అమెరికన్. తనకి చాలామంది తెలుగు స్నేహితులు ఉండడంచేత తెలుగు భాషా సంస్కృతులమీద అభిమానం కలిగిందని చెప్పింది. ప్రస్తుతం బాయ్ ఫ్రెండ్ కూడా తెలుగుబిడ్డే.

“అయితే నీకు తెలుగు కొంచెం వచ్చా?” అంది కాంత.

"ఓహ్, లేదు. లేదు. అసలు వాళ్లింట్లో ఎవరూ తెలుగు మాటాడరు. చాలా చక్కటి ఇంగ్లీషు మాటాడతారు. నాకు ఆశ్చర్యం వేసింది కూడాను," అంది జూలీ చిర్నవ్వుతో.

ఉన్న ముగ్గురిలోనూ జూలీకి మాత్రమే మరో భాష నేర్చుకునే విషయంలో స్పష్టమయిన అవగాహన ఉన్నట్టుంది. తనకి ఏమీ తెలీదనీ, క్రమపద్ధతిలో నేర్చుకోవాలనీ అర్థం చేసుకుంది. నేర్చుకుందాం అన్న శ్రద్ధ ఒక్క ఆ అమ్మాయిలోనే కనిపించింది కాంతకి. ఆ అమ్మాయి క్రమశిక్షణ చూస్తే కాంతకి ముచ్చటేసింది కూడాను.

ముగ్గురికీ భాష నిర్మాణం గురించిన అవగాహన కావాలి. మాతృభాష తెలుగు అయినవారికి కాస్త త్వరలోనే పట్టుబడుతుంది వాళ్లకి నేర్చుకుందాం అన్న తపన ఉండాలే గానీ.

ooo

కాంత ఓనమాలు ఉచ్చారణతో ప్రారంభించింది. ముందు కొన్ని చిన్న చిన్న మాటలు చెప్పి, కొంతసేపు పలకడం నేర్పి తరవాత రాయడం ప్రాక్టీస్ చేయించింది. అదే వాళ్ల హెూంవర్క్. మర్నాటికి వాళ్లకి ఆ పది మాటలు రాయడం, చదవడం, స్పష్టంగా ఉచ్చరించడం రావాలి. భాష బలం ఉపయోగంలోనే కనక మాటలూ అర్థాలూ వాళ్ల నాలుకలమీద ఆడితేనే భాష వచ్చినట్టు. అంటే కంఠతా బట్టాలి. భాషకి అదే ముఖ్యం.

"ఈతలాగే భాష కూడాను. మిమ్మల్నో పెద్దచెరువులోకి తోసేస్తే, మీరు కాళ్లూ చేతులూ కొట్టుకుంటూ తీరం చేరడానికి ప్రయత్నిస్తారు కానీ ఈత కొట్టుట ఎట్లు అన్న పుస్తకం చూసుకుంటూ కూర్చోరు కదా. అలాగే భాష కూడాను. మీరు ఎవరితోనైనా మాటాడాలంటే ప్రతిమాటా handbookలో వెతుక్కుంటుంటే సంభాషణ ఎలా సాగుతుంది? మాటలూ, అర్థాలూ, వాటిని వాడుకునే తీరూ క్షుణ్ణంగా తెలిసి ఉండాలి. మాటలు మీ నాలుకచివరనుండాలి అక్షరాలా."

అనిత ఒప్పుకోలేదు. "అదేం కాదు, కాంతా. కంఠతా పట్టడం పూర్వకాలపుపద్ధతి. అసలు అందుకే ఏషియన్ దేశాలు ఇంకా అలా వెనకబడి ఉన్నాయి. వాళ్లింకా పాత రాతియుగం పద్ధతులు పట్టుకు వేలాడబట్టే దేశం అలా ఏడుస్తోంది. చివికిపోయిన పాతపుస్తకాలే పట్టుక్కూర్చున్నారు అక్కడ. ఇక్కడ అమెరికాలో మనకి బలం ఏంటో తెలుసా? మేధ ఎక్కడుందో కనుక్కుని దాన్ని పనిలో పెట్టడం మన బలం. అదీ తెలివంటే. మేధని ఎలా ఉపయోగించుకోవాలో తెలియడం తెలివంటే." అంది చూపుడువేలితో కణతలమీద దరువేస్తూ.

కాంతకి నోట మాట రాలేదు ఆ పిల్లమాటలతో. ముఖ్యంగా "మనబలం" అన్నమాటలో ఊపుకి. ఆవిడకి తనకీ ఆ అమ్మాయికీ విలువల్లో తేడా ఆ క్షణంలో కొట్టొచ్చినట్టు కనిపించింది. మనదేశంలో పంతుళ్లని పేరు పెట్టి పిలవరు. ఏం నేర్వాలో, ఎలా నేర్వాలో పిల్లలు పంతుళ్లకి చెప్పరు. ఆవిడకి తెలిసిన సంస్కృతిలో జ్ఞానం కలవారు పంతుళ్లు. పిల్లలధర్మం పంతుళ్లు చెప్పింది వినడం, అర్థం చేసుకోడం, ఇచ్చిన హెంవర్క్ చెయ్యడం ... ప్రశ్నలు ఆ తరవాత నెమ్మదిమీద, బాగా ఆలోచించుకున్నమీదట వస్తాయి కానీ నేర్చుకోడం వాదనలతో మొదలు కాదు.

కొన్ని క్షణాలు పట్టింది జవాబు చెప్పడానికి. "నువ్వు చెప్పింది నిజమే మామూలుగా నేర్చుకునే విషయంలో. కానీ కొన్ని విద్యలు నేర్చుకున్నప్పుడు వాటిమీద గట్టి పట్టు సాధించాలి వాటిని నిజంగా వాడుకోవాలంటే. అలాటి నేర్పుల్లో భాష ఒకటి."

అనితకి నమ్మకం కలగలేదు. "నాకదేం అక్కర్లేదు. నేను కుప్పలుతిప్పలుగా సంపాదిస్తాను. నాలుగుడబ్బులు పారేస్తే అనువాదాలు చేసేవాళ్లెవరో ఒకరు దొరక్కపోరు. ప్రస్తుతం ఇక్కడ నాక్కావలసిందల్లా ఓ C ఈ రెండోభాష requirement దాటడానికి." అంది.

ooo

తనకి సి వస్తే చాలని అనిత ప్రకటించేక, క్లాసు నడపడం దినదినగండం అయిపోయింది.

"నీ హోంవర్క్ ఏదీ?

"సారీ. చెయ్యలేదు. వేరే పని తగిలింది."

"ఏమయింది?"

"నా స్నేహితుడికుక్కకి నలతగా ఉంటే డాక్టరుదగ్గరికి తీసుకెళ్లేను."

"నీస్నేహితుడే ఎందుకు తీసుకెళ్లలేదు?"

"అతనికి కెమిస్ట్రీ లాబ్ ఉండింది."

మరో ప్రశ్న వెయ్యడానికి కాంతకి నోరు రాలేదు. మళ్లీ అడిగితే కుక్క నాహోంవర్క్ తినేసింది అంటుందేమోనని భయమేసింది.

000

"భూతకాలం క్రియాపదాలతో వాక్యాలు రాయమన్నాను. రాసేవా?"

"భవిష్యత్తులో రాస్తాను."

మరోరోజు కొన్ని మాటలు చెప్పి, వాటితో చిన్నకథ రాసుకురమ్మంది.

మర్నాడు అనిత తీసుకొచ్చిన కథలో తను ఇచ్చినమాటలు లేవు. ఇంటర్నెట్‌లో కథ ఒకటి కాపీ చేసుకొచ్చింది! అది ప్లేజియారిజం అనీ, ఈమాట ఛైర్‌కి తెలిస్తే, ఆ పిల్ల గ్రేడు యఫ్ అవుతుందనీ నిజంగా ఆ అమ్మాయికి తెలీదా? ఇది తనకి పరీక్షా? - కాంత ఓపిగ్గా ఆమాట వివరించడానికి ప్రయత్నిస్తే, అనిత మూతి ముడుచుకుని, "నేనే రాసేను. మీరు నన్ను నమ్మకపోవడం మర్యాద కాదు" అంది.

కాంతకి నవ్వాలో ఏడవాలో అర్థం కాలేదు. ఇంత బతుకూ బతికి ఇంటెనక చచ్చినట్టు "మర్యాదలగురించి నీదగ్గరా నేర్చుకోవాలి?" అనుకుంది మనసులో.

000

“ఇది కాదు నేను రాయమని చెప్పింది. నిన్నటిపాఠంలో ఇచ్చిన కొత్తమాటలతో వాక్యాలు రాయమన్నాను.”

“నాకు ఆమాటలతో వాక్యాలు తోచలేదు. అంచేత కర్వ్ విసిరితే … ”

ఇలా నువ్వా-నేనా కుస్తీపట్లతో రోజులు జరుగుతుండగానే కథ మరో మలుపు తిరిగింది.

“వచ్చే సెమెస్టరు నేను ఒక్కదాన్నే ఉంటాను క్లాసులో. ఇదంతా నేర్చుకోడానికి కావలసినంత టైము,” అంది అనిత, వాలుకంట ఫాన్ వేపు చూపు విసిరి.

ఫాన్ ఇకిలించేడు. కేతిగాడూ, బంగారక్కా అనుకుంది కాంత.

మరో రోజు మళ్లీ “డబ్బిచ్చుకుంటున్నది నేనూ,” అంది అనిత క్లాసులో. చూడగా చూడగా ఆపిల్ల నిజ అమెరికనులని తలదన్నేలా ఉంది.

ఆ మూడు ముక్కల్లో అంతరార్థం తెలుస్తూనే ఉంది. వచ్చేయేడు అనిత ఈ క్లాసు తీసుకోకపోతే, క్లాసుండదు. తనకి ఉద్యోగం ఉండదు. పళ్లు గిట్ట కరిచి, అప్పటికి ఓర్చుకుంది కానీ మనసులో మండిపడుతోంది. ఈ పిల్ల ఆకతాయితనం సహించే ఓపిక తగ్గిపోతోంది. అక్కడికీ ఓపినంత శాంతం మొహాన అద్దుకుని, స్వరం బాగా తగ్గించి అత్యంత మర్యాదతో చెప్పి చూసింది భాషతాలూకు ప్రాథమిక అవగాహన ఉండడం ఎంత అవసరమో. ఏ భాషకైనా ముందు దాని నిర్మాణక్రమం తెలియాలి. అందులో షార్ట్ కట్స్ లేవు. తెలిస్తే తెలిసినట్టూ, లేకపోతే లేదు. అంతే.

000

మూర్తితో చెప్పింది కాంత క్లాసులో అనితవాలకంగురించి. మూర్తి చప్పరించేసి, “పోనిద్దూ” అన్నాడు. అతను అంత తేలిగ్గా తనమాట తీసిపారేయడం బాగులేదు. ఆవిడకి తనేదైనా చేబడితే ఫలితాలు కనిపించాలి. ఫలితాలు అన్నమాట అనిత పదకోశంలో లేదు. మ్.. ఉంది కానీ అది కాంత

వివరణలోకి పట్టేది కాదు. అనిత ఆలోచనల్లో ఉన్న ఫలితాలు వేరు. ఇదంతా కాంత అతనికి వివరించబోయింది..

మూర్తి అంతా విని, "చూడు. నువ్వు టీచరువి. నువ్వు తయారు చేసిన కోర్స్ కంటెంటు ఫాలో అయి తీరాలని గట్టిగా చెప్పు," అన్నాడు.

"చెప్పేను అన్ని రకాలుగానూ. వినడంలేదు. పట్టపగ్గాల్లేకుండా పేట్రేగిపోతోంది."

"చూడు, కాంతా. నువ్వొకటి అర్థం చేసుకోవాలి. ఇది అమెరికా. వీళ్ల ధోరణి వేరు. ఇక్కడ పెరిగిన మన పిల్లల ధోరణి వేరు. ఇక్కడి పద్ధతులు వేరు. నువ్వేదో మనూళ్లో ఉన్నట్టు పాఠాలు చెప్తానంటే కుదర్దు. వాస్తవం ఆలోచించు. అనితకి కావలసిందల్లా satisfying the second language requirement. అంతకంటే ఎక్కువ మనం ఆశించలేం ఆ పిల్లదగ్గర్నుంచీ. నాకు తెలుసు ఏ బయాలజీ క్లాసులోనో అయితే ఇలాటి ఆటలు సాగవు. ఆ అమ్మాయి ఆడదు. ఈ దేశంలో వాళ్లకి వాళ్ల ప్రయారిటీస్ తెలుసు. నువ్వు దీన్ని పట్టించుకో నక్కర్లేదు. నిజానికి తెలుగు నువ్వే కాదు మరోళ్లు చెప్పినా ఇంతే. ఆ అమ్మాయి తత్త్వం అదీ," అన్నాడు నచ్చచెబుతూ.

ooo

మిడ్ టెర్మ్ పరీక్షలు. రాబోయే శుక్రవారం పరీక్ష అనీ, గత నాలుగు వారాల్లో చెప్పిన పాఠాలు చదవమని చెప్పింది కాంత. ఇంకా పరీక్షలో ఎన్ని ప్రశ్నలు, ఎలాటి ప్రశ్నలు, ఎన్నిటికి జవాబు ఇవ్వాలి కనీసధర్మంగా లాటివి దాదాపు గంటసేపు వివరించింది. ఉదాహరణలు కూడా ఇచ్చింది.

ఎంత చెప్పినా అనితకి ఏదో ఒక అడ్డుపుల్ల వెయ్యకపోతే తోచదు. "ఓపెన్ బుక్ చెయ్యండి," అంది.

సరేనంది కాంత ఈ పిల్లకి ఓపెనయినా, క్లోజుడు అయినా ఒకటే అనుకుని.

శుక్రవారం వచ్చింది. కాంత పరీక్షాపత్రం ఇచ్చింది. ముగ్గురూ పుస్తకాలు తెరిచారు. అనిత పుస్తకం పేజీలు తిరగేస్తోంది కానీ తాను చెప్పిన పాఠందగ్గర కాదు. రెండు నిముషాలు చూసి విసుగేసి, దగ్గరికెళ్లి, చెప్పింది, "ఈ పాఠం కాదు." అని.

ooo

రాత్రి భోజనాలయేక, కాంత పరీక్షకాయితాలు ముందేసుక్కూచుంది. అనిత "సి" తప్ప మరో గ్రేడు పుచ్చుకోను గాక పుచ్చుకోను అంటూ పంతం పట్టుక్కూచున్నట్టుంది పేపరు చూస్తే. కావాలనే తప్ప అన్ని తప్పులు ఎవరూ చెయ్యలేరు. సగానికి సగం ఇంగ్లీషు పదాలే రాసింది. ఆఖరికి ప్రశ్నల్లో ఉన్న తెలుగుమాటలకి కూడా ఇంగ్లీషు మాటలే రాసింది. మిగతా రాసినమాటలు తప్పులతడకలు. కనీసం ప్రశ్నల్లో ఉన్న తెలుగుమాటలయినా కాపీ చెయ్యొచ్చు కదా. ఎలా చూసినా పొగరు అనే అనిపించింది కాంతకి ఆ పిల్లతీరు.

ఫాన్ సంగతి వేరు. అతనికి ఈ దేశం వచ్చిందగ్గర్నుంచీ యుద్ధమే. ఫాన్ పదకోశంలో నిత్యజీవితంలో వాడుకునే సాధారణపదాలు కొన్ని ఉన్నాయి. విజయవాడ వీధుల్లో బతుకు వెళ్లదీసుకునే ఏ పిల్లవాడికైనా తేలిగ్గా పట్టుబడే మాటకారితనం ఉంది. చదవనూ, రాయనూ వస్తుంది కాస్త పాటు పడితే. కానీ, అతను నేర్చిన పాఠాల్లో పాటు పడడం అన్నది లేదు. దానికి తోడు అనిత పదే పదే చెబుతోంది, "What is important is not working hard but working smart" అని. అంచేత అతను వర్కింగ్ స్మార్ట్ కి సిద్ధం అయేడు.

"మీరు చాలా అందంగా ఉన్నారు," అన్నాడు కాంతతో ఒక రోజు.

మర్నాడు చాక్లెట్ తెచ్చి ఇచ్చేడు ఆవిడకి. ఇంకో రోజు ఒక రోజాపువ్వు. మరో రోజు "సినిమాకి వస్తారా?" అని అడిగేడు. ఇంకా తను చదువుతున్న అన్ని క్లాసులకీ ఆవిడే టీచరయితే ఎంతో బాగుండు అంటూ తన రహస్య కోరిక కూడా వెలిబుచ్చేడు.

అతనిధోరణి కాంతకి మొదట ఇబ్బందిగా ఉండి, రాను రాను భరించడం కష్టమయే స్థాయికి చేరుకుంది. అతను చదువుమీద ధ్యాస పెట్టాలనీ, తనయందు చూపుతున్న ప్రత్యేకశ్రద్ధ అనుచితమనీ చెప్పింది. ఆవిడ హెచ్చరిస్తున్నకొద్దీ అతను పెచ్చు రేగిపోయేడు.

అలాటి రోజుల్లోనే మరో ప్రమాదం వచ్చిపడింది అకస్మాత్తుగా.

ఆ రోజు సాయంత్రం మూర్తి ఆలస్యంగా ఇంటికొచ్చేడు. మామూలుగానే ఇంట్లో అడుగెట్టినా, వదనకమలం మాత్రం వడలిపోయి ఉంది.

"ఏమయింది. అలా వున్నావేం?" అంది కాంత.

"ఏం లేదు. ఎలా వున్నాను?"

"ఏమయిందో చెప్పరాదా?"

"ఏంలేదన్నానా. ఏదో అంటూ ఉంటారు. నువ్వేం పట్టించుకోకు."

"ఎవరు ఏమిటి అంటున్నారో తెలిస్తే కదా నేను ఏమిటి పట్టించుకోనక్కర్లేదో తెలిసేది. ఈ చిందులు మానేసి అసలు సంగతి చెప్పరాదూ?"

"చెప్తున్నా కదా పెద్దవిషయం కాదని. పిల్లలు వాళ్ల చిరాకులన్నీ టీచర్లమీద రుద్దడం మామూలే."

"చ్ఛట్. అసలుసంగతేమిటంటే?"

"క్లాసులో ఇతర టీచర్లగురించి ఏమయినా అనడం బాగుండదు. హేస్టింగ్స్ టీచింగ్ గురించి నువ్వేదో అన్నావన్నాడు నొచ్చుకుంటూ."

"ఏమిటీ?" కాంత ఎగిరిపడింది కూర్చున్న చోటే. "ఎవరన్నారామాట? నేనెందుకంటాను సాటి టీచరుగురించి కానీ మరో టీచరుగురించి కానీ.... " ఆవిడకి ఆవేశంతో ఆపైన నోట మాట రాలేదు.

"హుమ్. ఎవరో చెప్పినట్టే ఉంది ఆయనకి నువ్వేదో అన్నావని. నేనక్కడికీ చెప్పేను నువ్వు అలా అనే మనిషివి కాదని."

“ఏమన్నానని చెప్పేరు?”

“ఏదో ... ఈ దరిద్రపు వ్యాకరణం ఎవరు నేర్పేరు అనో ... ఏదో అలాటిదే... జాన్ నాకు అట్టే వివరాలు ఇవ్వలేదు కానీ మరొక ప్రొఫెసరుగురించి క్లాసులో మాటాడకూడదు అన్నాడు.”

“అది శుద్ధ అబద్ధం.”

“సరేలే. క్లాసులో మరో ప్రొఫెసరుమాట తేకు.”

“అంటే ... నువ్వు కూడా నేనాయన్ని ఏదో అన్నాననే అనుకుంటున్నావా? నేనసలు అతని పేరెత్తలేదని చెప్తున్నా కదా.”

కాంతకి అంతా గందరగోళంగా ఉంది. ఎవరు చెప్పి ఉంటారు? ఎందుకు పుట్టించి ఉంటారు ఈ పుకార్లు? అనితేమో అని అనుమానం వచ్చింది కానీ ఎలా ఋజువు చెయ్యడం?

ooo

ఫాన్‌కి తెలుగుక్లాసులో కూర్చుంటే, విజయవాడ వీధులు గుర్తొస్తాయి. తేడా ఏమిటంటే, ఆ రోజుల్లో అతను తల్లులతోనూ తోబుట్టువులతోనూ వరసలు కలపకుండా నాలుగుమాటలు మాటాడలేదెప్పుడూ. ఇక్కడ ఈ పంతులమ్మ చెప్పేభాష సభ్యమానవులభాష. అది ఒక బాధ. అతనికి సంబంధించినంతవరకూ అదో చెత్తవాదన. అసలు ఈ రోజుల్లో ఎవరూ అలా మాటాడ్డం లేదు. తనకి తెలుగు వచ్చు. తనకి వచ్చిన తెలుగుతో ఏ తెలుగువాడితోనైనా హాయిగా మాటాడేయగలడు.

“అయితే మరి ఈ క్లాసు ఎందుకు తీసుకుంటున్నావు?”

ఫాన్ బుజాలెగరేశాడు. “ఏమో. ఫన్ అని. యూ నో ఫన్, ఫాన్ ... గెటిట్? హా హా.”

అతను ఈక్లాసులో అడుగెట్టడానికి మొదటికారణం మేరీ. అతను తన మాతృభాష, సంస్కృతి మరిచిపోరాదన్న సదుద్దేశంతో మేరీ అతడిని ఈ క్లాసులో

బలవంతంగా చేర్పించింది. మొదటిరోజు కాంతని చూసినప్పుడు ఫాన్‌కి హాయిగా అనిపించినమాట నిజమే. కానీ, ఆవిడ చదువుకోమని పట్టు బడుతుంటేనే చిరాగ్గా ఉంటోంది.

కాంతకి అలాగే ఉంది. హెూంవర్క్ మాటకొస్తే, రెండుమాటలతో ముగించేస్తున్నాడు.

‘‘రాయలేదు.’’

‘‘ఏం?’’

‘‘తెలీలేదు.’’

‘‘ఏమిటి తెలీలేదు.?’’

‘‘ఈమాటలకి అర్థాలు.’’

‘‘నీకిచ్చిన ఎక్సర్సైజుకి చివర్లో కొత్తమాటలు, అర్థాలతో ఉన్నాయి. చూశావా?‘‘

‘‘ఓ.. ప్చ్.’’

ఫాన్ కాయితంవేపు కొంచెంసేపు చూసి, ‘‘ఈ మాట లేదు.’’ అన్నాడు.

‘‘అది కిందటివారం ఇచ్చింది. లేదా, నీడిక్షనరీలో చూడొచ్చు కదా.’’

ఈ మధ్య కొన్ని రోజులుగా ఫాన్ రోజూ డిక్షనరీ క్లాసుకి తెస్తున్నాడు. క్లాసులో ఉన్నంతసేపూ అది ఎదురుగా బల్లమీద పెట్టుకుని, ఏదో నోట్సు గిలుకుతూనే ఉంటాడు.

డిక్షనరీ ఇంటిదగ్గర చూసుకోమనీ, క్లాసులో పాఠాలు వినమనీ ఓ రోజు హెచ్చరించింది.

‘‘జాన్ చెప్పేరు డిక్షనరీ చూడమని.’’

కాంతకి మూర్తి చెప్పిన సుభాషితాలు గుర్తొచ్చేయి. శాంతంగా ఉండడానికి శతవిధాల ప్రయత్నిస్తూ, ‘‘నిజమే. డిక్షనరీ మంచి సాధనం భాష నేర్చుకోడానికి. కానీ ముందు క్రియాపదానికి రూట్ ఏదో తెలిస్తే కానీ డిక్షనరీలో చూడలేవు.

రూట్ ఎలా తెలుస్తుందో క్లాసులో తెలుసుకోవాలి. అంచేత నువ్వు క్లాసులో చెప్పినవి క్లాసులో వింటే, డిక్షనరీ ఇంటిదగ్గర చూసుకోవచ్చు" అంది

అందులో ఒక్క ముక్కయినా విన్నాడో లేదు, "వాటెవర్" అన్నాడు ఆ పుస్తకం నేలమీద పడేసి.

ooo

సెమెస్టరు అయిపోయింది. కాంత తన ప్రియవిద్యార్థుల పరీక్షాపత్రాలు ముందేసుకు కూర్చుంది. మూడు బొత్తుల్లోనూ ఒక బొత్తి ఆవిడకళ్లముందు ప్రత్యేకంగా తాండవమాడుతోంది. అది ఫాన్ జవాబుల బొత్తి. మొదట ఒక తప్పు దగ్గర చిన్న టిక్కు పెట్టింది. తరవాత రెండో తప్పు, ... మూడో తప్పు ... మళ్లీ వెనక్కి వెళ్లి కరెక్టు జవాబు రాసింది ఒకటి, రెండు చోట్ల. లైనుకి మూడు తప్పులు! నమ్మలేకుండా ఉంది. ఫాన్ కావాలనే గజిబిజి చేసినట్టుంది పేపరంతా. ఇది తనకే పరీక్షా? అతని ఆధిక్యత నిరూపించుకోడానికా?

ఇంతకంటే పదిరెట్లు బాగా చెయ్యగలడు. ఈ పేపరు మరో ప్రొఫెసరెవరైనా చూస్తే, సి కూడా ఇవ్వరు. కాంత ఆలోచనలో పడింది.

అతనికి తెలిసిన పదాలు, వాక్యనిర్మాణం తీసుకుంటే ఎబి ఇవ్వొచ్చు.

వ్యాకరణం చూస్తే సి కి తగును. .

క్లాసులో పొగరు చూస్తే డి ఇచ్చినా తప్పులేదు.

ఆవిడ కాయితాలు ఎదురుగా ఉన్న బల్లమీద పడేసి, కళ్లు మూసుకుంది ఈ గ్రేడింగ్‌లో factors ఆలోచిస్తూ - విద్యార్థుల attitude factor, వాళ్ల అవసరాల factor, తన ఉద్యోగం factor, యూనివర్సిటీలో మూర్తి position factor, సాటి ప్రొఫెసర్లలో అతని పరువు factor, వాళ్ల సాంగత్యం నిలుపుకోవలసిన అవసరం factor, department prestige factor, bell curve factor, తన ఉద్యోగం factor, ఆదాయం factor, అన్నిటికంటే ముఖ్యంగా వచ్చే semester enrollment factor ...

కటకటా! ఈ ఫ్యాక్టరులతో. తల సెక్టర్, సెక్టర్ ....ఎవరికి ఈ పరీక్ష?

"మామీ, మామీ ... .." హఠాత్తుగా తుళ్లిపడింది బాబు కేకలతో... "త్రీ .. బాబీ .. లైత్. .. బీ... తీ .. ...." పెన్సిలుతో ఆ పేపర్లమీద వాడు గిలికిన బీ, సీ... మహోత్సాహంగా చూపిస్తున్నాడు గెంతులేస్తూ.

కాంత ఎగిరి పడి, ఒక్క ఉదుటున వాడిచేతిలోంచి పెన్సిలు లాక్కుంది, హెూ, హెూ, నో, నో, అంటూ. ఆ తరవాత ఆ కాయితాలవేపు పరీక్షగా చూసింది. చిరునవ్వు పెదవులమీద లాస్యం చేసింది కొంటెగా.. "భలే పని చేసేవురా బంగారు నాన్నా. విశ్వరహస్యం బోధించిన బాలకృష్ణుడా!" అంటూ వాణ్ణి దగ్గరికి తీసుకుని గుండెలకి హత్తుకుంది ఆ చిన్నవాణ్ణి.

ఆ పూట తన రచనావిలాసంతో తాను అమ్మని రక్షించాడని తెలీసేలేదు పాపం ఆ బాలకృష్ణుడికి!

(జూన్ 24, 2010.)

# 10. డాలరుకో గుప్పెడు రూకలు

ఎన్నారయ్యొస్తున్నడెన్నారయ్యొస్తున్నడంటూ ఒకటే హహావుడి.

ఊరంతా గుప్పుమంది. కార్చిచ్చులా కమ్ముకుంది వార్త ఇరుగుపొరుగుల ఏడామడల దూరం. ఎన్నారయ్యొస్తున్నాడంట.

ఇరవయ్యేళ్ళనాడు దేశంవెల్లిన కుర్రకుంక ఎంతో ఎత్తు ఎదిగిపోయి ఇరుచేతులా సంపాదించేసి ఘనకార్యాలు సాధించేసి ఈనాడు యూయస్సమ్మతో కాఫీరంగు కూతురితో, సీమ టపాకాయలాటి కుమారుడితో.

చుట్టపుచూపుగా తల్లిదండ్రుల్నీ, తాతముత్తాతల్నీ, మేనమావల్నీ, బావమరుదుల్నీ గోళీకాయలాడిన నేస్తాల్నీ, ఎరిగినవాళ్ళనీ, ఎరగనివాళ్ళనీ, పాత చుట్టరికాలు తిరగదీయడానికీ, కొత్త స్నేహాలు కలుపుకోడానికీ ఎన్నారయ్య వొస్తున్నాడంట!

చిన్నప్పుడెప్పుడో తిరణాల్లో తప్పిపోయిన బాలుడు తిరిగొచ్చినంత సంబరం. గోడలకి రంగులేయించేరు. గుమ్మాలకి తోరణాలు కట్టించేరు. పడగ్గదిలో సరికొత్త బాతురూమూ, నట్టింట టెలిఫోనూ, కిటికీలకి పరదాలూ, ఫ్రిజిలో బ్రెడ్డూ, జామూ, బాటిల్డు వాటరూ ... ఎంత చేసినా ఏదో తక్కువైనట్టు రవంత అసంతృప్తి!

ఏం కావాలేంకావాలని ఎన్నిమార్లడిగినా, ఎన్ని విధాల చెప్పినా వారు చెప్పినది వీరి తలకెక్కదు. వీరు చెప్పినది వారికయోమయం, అగమ్యగోచరం.

మొత్తమ్మీద ఆ రోజు రానే వచ్చింది. ఎన్నారయ్యగారు వేంచేశారు. మహోత్సాహంతో భార్యాబిడ్డలతో ధగధగ మెరుస్తున్న శాంసనైటు సూటుకేసులతో. పిల్లలు మొహాలు వేలాడేశారు కానీ యూయస్సమ్మ మాత్రం ఒపిగ్గా సుతారంగా పెదాల చిర్నవ్వు పులుముకుని పరువు నిలబెట్టుకుంది.

ఇడ్లీలు బ్రేక్ ఫాస్ట్. పిల్లలు సాంబారు తినలేకపోయేరు కానీ కొబ్బరి పచ్చడితో ఎలాగో అయిందనిపించేరు.

పెద్దావిడ నొచ్చుకుంది. బ్రెడ్డుంది తినమంది. పోనీ పళ్ళు తినకూడదా అంది. మరేదేనా చెయ్యనా అని అడిగింది.

"ఫరవాలేదమ్మా. కారాలు తింటారు కానీ పొద్దున్నే స్పైసీ ఫుడ్డు తినలేరు," అంటూ ఎన్నారయ్య సర్ది చెప్పేడు. "వాళ్ళంతే. ఏఁవీ తినరు. అక్కడయినా ఇంతే," అన్నాడు.

భార్య అవునంటూ తలాడించింది సందర్భానుసారం సంభాషణసారం గ్రహించి.

కూతురు అమెరికాలో సూ, ఇండియాలో సుసీ.

"సుసి లేదు, మసి లేదు. నేను మాత్రం చక్కగా సుశీలమ్మా అని పిలుచుకుంటా," అన్నారు బామ్మగారు.

"అయాం నో అమ్మా," అంది ఆ మాత్రం తెలుగు తెలిసిన కూతురు.

"చెప్పేను కదా ఇదో నాటకం అని. సుశీలమ్మ నీ రోలనుకో," అని తండ్రి ఇంగ్లీషులో అనునయించేడు.

గత ఆర్నెల్లుగా వాళ్ళకెన్ని విధాల చెప్పొచ్చో అన్న విధాలా బోధించేడాయన. ఆఖరికి "మనం ఓ చిన్న నాటకం ఆడుతున్నాం అనుకో"మన్నాడు. "మనం పాత్రధారులం. స్క్రిప్టు మీ సొంతం. ఇక్కడ మీరేం చేసినా చెప్పినా ఈ నాలుగు రోజులే. ఆ తరవాత వాళ్ళదారి వాళ్ళదీ మనదారి మనదీను. మనఁవే అనుకుంటున్నాఁవో వాళ్ళకి తెలీదు. వాళ్ళేం అనుకుంటున్నారో మనకి అఖ్ఖర్లేదూ, లెక్క లేదూ," అన్నాడు.

ఇంత ఉపన్యాసమూ బుగ్గయిపోయింది. పిల్లలు మొహాలెత్తలేదు. బుంగమూతి చెదర్లేదు.

అదయింతరవాత ఊరు చూడ్డానికెళ్దాం అని పిల్లలు సరదా పడ్డారు. కానీ గుమ్మం ముందు పోగయిన జనాల్ని చూసేసరికి నీరు గారిపోయేరు. "నేను చెప్పేను కదా. వీళ్ళకి మనం కొత్త. వీళ్ళెప్పుడూ తెల్లవారిని చూసి ఉండలేదు మరి," అంటూ వాళ్ళని బలవంతాన ఈడ్చుకెళ్ళేడు వీధిలోకి. తీరా రోడ్డెక్కింతరవాత "నేను వీళ్ళకి ఊరు చూపిస్తున్నానా, వీళ్ళని ఊరివారికి చూపిస్తున్నానా?" అన్న అనుమానం రాకపోలేదాయనకి. ముక్కుతూ మూలుగుతూ నాలుగు వీధులూ తిరిగొచ్చేరు.

"మా స్కూలు చూపిద్దాం నాన్నా," అన్నాడు చంద్రుడు. ఎన్నారయ్య తమ్ముడికొడుకు.

సరేనని పదండంటే పదండంటూ వీధిన పడేసరికి పన్నెండయింది.

నాలుగ్గోడలమధ్య ఓ తాటాకుల తడక రెండు క్లాసులన్నట్టు సూచిస్తోంది. ఓ నల్లబల్ల అవసరాన్నిబట్టి గదులు మారుతూంది.

సీమబాబుగా చెలువొందుతున్న సీమ టపాకాయ చుట్టూ చూసి "స్కూలేదీ" అనడిగేడు. "Where are the toys?"

యూయస్సమ్మ అస్పష్టంగా సౌంజ్ఞ చేసింది అటు చూడమన్నట్టు.

పిల్లలు చెట్టుమీద కోతి కొమ్మచ్చి, చెట్టుకింద కబడ్డీ ఆడుకుంటూ కనిపించేరు.

నింటెండోలూ, వర్చువల్ రియాలిటీలతో పెరిగిన పిల్లలకి అర్థం కానిది, "What do these children do for fun?"

చంద్రుడికి ఆ ప్రశ్న అర్థం కాలేదు. "ఏంటి నాన్నా?" అని తండ్రినడిగేడు. బియే చదివి బ్లాక్ డెవలప్మెంట్ ఆఫీసరుగా పని చేస్తున్న తండ్రికి కూడా అర్థం కాడంలేదు ఈ అమెరికా పిల్లల ఆంగ్లభాష. "ఏదోలే ఆళ్ళగోడు," అని చప్పరించేశాడు.

మర్నాడు పట్నం ప్రయాణం పెట్టుకున్నారు. షాపింగ్! బజారనగానే ప్రాణం లేచొచ్చింది పిల్లలకీ పెద్దలకీ కూడా. కానీ అక్కడా అయోమయమే. ఇండియాలో షాపులవాళ్ళు అమెరికను జనాల్ని ఎంతగా మోసం చేస్తారో విని విని తల వాచిపోయింది వాళ్ళకి. అంచేత వాళ్ళు చాలా జాగ్రత్తగా చెయ్యదలుచుకున్నారు షాపింగు.

"ఈ బొమ్మెంత?"

"720 రూపాయలు."

"330 ఇస్తానంతే."

"తమకి తెలీందేవుందండీ. 700 ఇయ్యండి పండుగపూట"

"350. అంతే."

"మరి మాఁవెల బతకాలి సార్ మీరే సెప్పాల,"

"మరో కొట్లో చూద్దాం పదండి."

560 రూపాయలకి ఖరారయింది బేరం.

కనిపించిన ప్రతీదీ ఇదెంత అదెంత అంటూ కావల్సిందీ అక్కర్లేనిదీ ఒకటే గొడవ సీమబాబు. అతనికదో ఆటగా ఉంది. మంచి గంధపుచెక్కతో చేసిన ఏనుగు బొమ్మొకటి ఎంతో అందంగా కనిపించిందతనికి. "ఎంత?" అని అడిగేడు.

"రెండువేల రెండు వందలు," అన్నాడు షాపువాడు.

"అంటే ఎన్ని డాలర్లు?" అనడిగేడు మళ్ళీ.

"ఎంతయితే నీకెందుకు. నేను కొంటున్నాను కదా. కావలిస్తే తీసుకో," అన్నాడు ఎన్నారయ్య.

"నేనెంత ఖర్చు పెడుతున్నానో నాకు తెలియఖ్ఖర్లేదా?" అంటూ మొరాయించేడు ఎలవెన్నుకి అలవాటయిన కుర్రాడు.

"బోలెడు డబ్బు తగలేసి ప్రవేటు స్కూలికి పంపిస్తున్నాను. చెప్పు ఎన్ని డాలర్లో?" అన్నాడు ఎన్నారయ్య కుమారుని తెలివితేటలూ తనభాగ్యమూ తెలివిడి చేస్తూ.

యూయస్సమ్మకి కొడుకుపరువు నిలబెట్టవలసిన అవుసరం తెల్లమవగా, "నీ ఆర్గనైజరేదీ?" అనడిగింది ఇంగ్లీషులో.

సీమబాబుకి తన తెలివితేటలు ప్రదర్శించుకునే అవకాశం వచ్చింది. గొప్పగా జేబులోంచి ఆర్గనైజరు తీసి డాలరుకెన్ని రూపాయలని అడిగేడు.

"46"

సీమబాబు "కీ"లన్నీ నొక్కి లెక్క తేల్చేలోపున "47.8" అన్నాడు చంద్రుడు చటుక్కున.

సీమబాబు డిసపాయింటుమెంటుని కప్పిపుచ్చడానికి వాణ్ణి మరోపక్కకి లాక్కెళ్ళింది యూయస్సమ్మ.

పిల్లలు చెయ్యేసిన ప్రతి వస్తువూ వెయ్యో, రెండువేలూను. చంద్రుడు అమ్మో అమ్మో అంటుంటే సీమ ట.కా. కూడా అమ్మో అమ్మో అంటూ వంత పాడేడు. తనకొచ్చిన తొలి తెలుగు పదం!

సగానికి సగం తగ్గించి బేరాలాడేరు. వెయ్యి రూపాయలవస్తువు ఆరువందలకి ఖరారు చేసుకుని తాము మోసపోలేదని పరమానందపడిపోయేరు.

ఓ కొట్లో నాలుగు చొక్కాలు తీసుకుని డబ్బిస్తుంటే కొట్టువాడు ఓ తువాలు పడేశాడు సంచిలో కొసరుగా. అందరూ ఆనందపడిపోయేరు కానీ సూకి అది మాహా అవమానంగా తోచింది. ఆ కొట్టువాడు తమ అమాయకత్వానికి నవ్వుకుంటున్నాడో, జాలి పడుతున్నాడో.

ఆ రోజు బేరాలకి చిరాకు పడింది పదమూడేళ్ళ సూ అనబడే సూసన్ మాత్రమే. ఆ పిల్లదృష్టిలో 20 డాలర్లవస్తువు పన్నెండు డాలర్లకి కొన్నట్టు లెక్క. ఎందుకింత ఆరాటం?

స్టేషనులో కూలీలతో 40 రూపాయలకీ 30 రూపాయలకీ బేరం ఆడుతున్నప్పుడు కూడా ఆ పిల్లకి మహా అన్యాయంగా తోచింది. పట్టుమని ఓ డాలరు కూడా కాదు. ఎందుకంత బాధ? వాళ్ళనోటికాడ కూడు తీసేస్తున్నట్టు నొచ్చుకుందా అమ్మాయి.

మొత్తమ్మీద ఇండియా ప్రయాణం అయిందనిపించుకుని ఆవురావురంటూ తమ ఇల్లు చేరి హమ్మయ్య అనుకున్నంతసేపు పట్టలేదు. గుండెలు పగిలే దుర్వార్త మోసుకొచ్చేరు పొరిగింటివారు.

ప్రయాణానికి ముందు సీమబాబు ముద్దుగా పెంచుకుంటున్న కుక్కపిల్ల హంటర్ని పొరుగువారికి ఒప్పజెప్పేరు రెండువారాలపాటు చూసుకోమని. పొరిగింటి మేరీయాన్ సూసన్ ఒకే వయసువాళ్ళు. మేరీయాన్ హంటర్ని ప్రాణపదంగా చూసుకుంటానని మాటిచ్చింది. మాట నిలబెట్టుకుంది కూడా ఒకవిధంగా చూస్తే.

ఎన్నారయ్య కుటుంబం తిరిగొచ్చే ముందు రోజు, మేరీయాన్ హంటర్ని వాక్కి తీసికెళ్ళింది. రోడ్డు దాటుతుంటే, నలుగురు కుర్రాళ్ళు స్పోర్ట్స్ కారేసుకుని, తప్ప తాగి, ఒళ్ళు మరిచి, ఆ దారిన పోతున్న ఈ రెండు జీవాలమీదకీ పెట్టేశారు కారు. ఘోరం జరిగిపోయింది క్షణాలమీద. రెండు కుటుంబాలకీ ఒక్కలాటి బాధే. ఏం చేసినా తీరని క్షోభ.

కూతురిగురించి వారూ కుక్కపిల్లగురించి వీరూ వాపోతూ రోజులూ వారాలూ గడుపుతున్నారు.

ఎన్నారయ్య మరో కుక్కపిల్లని తెస్తానన్నాడు కానీ సీంబాబు ఒప్పకోలేదు. అదెప్పటికీ హంటరవదు పొమ్మన్నాడు.

నిదానంమీద సినిమాలకీ, షికార్లకీ తిప్పి నింటెండోలూ గట్రా కొనిపెట్టి ఆ పిల్లాడిని ఓదార్చడానికి ప్రయత్నిస్తున్నారు కుటుంబంలో అందరూ.

ooo

కొడుకు కొత్తగా విడుదలయిన సీడీలు కావాలంటే తండ్రీ కొడుకూ మ్యూజిక్ స్టోరులో జొరబడ్డారు. సూసన్ తల్లితో మార్షల్ ఫీల్డ్ వేపు దారి తీసింది. స్ప్రింగ్ డిజైన్లు చూడ్డానికి.

షాపులో అడుగెట్టగానే ఆ అమ్మాయి కళ్ళబడింది ఎదురుగా రాక్‌మీద వేలాడేసిన షాల్.

''మామ్'' అంటూ తల్లిని కేకేసింది. అది అచ్చు ఇండియాలో తాము కొన్నలాటిదే. అక్కడ షాపువాడు ఆరొందలయాభై చెప్తే, నాలుగొందల ఇరవై రూపాయలకి ఒప్పించి తృప్తి పడ్డారు. అదే షాల్ ఇక్కడ నూటయాభై డాలర్లు! అంటే ఎన్ని రూపాయలో? దీన్ని దోపిడి అని ఎందుకనరో?

ఆ తరవాత సినిమా చూసి, చైనీస్ రెస్టారెంటులో భోంచేసి ఇంటికొచ్చేరు.

దాదాపు 250 డాలర్లు ఖర్చయిందాపూట.

''అంటే ఎన్ని రూపాయలు?'' అనడిగింది సూ.

''అదేం ప్రశ్న?'' అన్నాడు తండ్రి.

''మనం ఇక్కడ డాలర్లలో సంపాదిస్తాం. డాలర్లలో ఖర్చు పెడతాం,'' అంది తల్లి విశ్వరహస్యం బోధిస్తున్నట్టు.

''యూ డమ్మీ,'' అన్నాడు సీంబాబు.

తనప్రశ్నలో అంతరార్థం వారెవరికీ అర్థం కాలేదన్న సంగతి ఆ పిల్లకి మాత్రమే అర్థం అయింది.

ooo

(ఇ-పత్రిక 2001లో తొలిసారి ప్రచురితం. కొన్ని సంకలనాల్లో ప్రచురితం.)

# 11. విధీ, హతవిధీ!

నా కాండోలో రిపేరొచ్చిందని మేనేజరుని పిలిచేవరకూ నాకు విధి వైపరీత్యాలగురించిన ఆలోచనలు రాలేదు.

వంటింట్లో కొళాయి చుక్కలు చుక్కలుగా కారుతుంటే మేనేజరుకి ఫోను చేశాను. నాకసలు ఫోనులో మాటాడ్డం సరిపడదు. నామాట వాళ్లకర్థం కాదు, వాళ్లమాట నాకర్థం కాదు పెళ్లిమంత్రాల్లాగే. పురోహితుడు “మమ” అనమన్నప్పుడల్లా “మమ” అన్నట్టే.

రెండు రోజులు ఎదురు చూశాను మేనేజరు అర్జెంటుగా వచ్చేసి, నవ్వుమొహంతో నా కొళాయి బాగుచేసేసి, నన్నానందపరిచేసి వెళ్తాడని. వారంరోజులయింది. ఎక్కడా జాడ లేదు. తెగించి మళ్లీ పిలిచాను. నాలుగు రోజులయింది. మళ్లీ ప్రయత్నించేను. ఎంత గింజుకున్నా ఆ జవాబులమిసీనే కాని మనిషిగొంతు వినే యోగం లేకపోయింది.

దాంతో, మా అసోసియేషను ప్రెసిడెంటుకి ఫోను చేశాను. ఆయన, "కాల్ ద మేనేజర్" అన్నారు. మేనేజర్ని కాల్చేశాననీ, తిరుగుజవాబు లేదని మనవిచేసుకున్నాను ఓపినంత మర్యాదగా.

సెక్రటరీకి చెప్పుకోమన్నారు.

సెక్రటరీని పిలిస్తే, మళ్లీ మెషీను ఎదురుచుక్క!

మరో వారంరోజులయేయి ఈ ప్రదక్షిణాల్తో.

నా ఓపిక చచ్చిపోతూంది. నెలకి ఎనిమిదివందలు విచ్చు డాలర్లుచ్చుకుంటున్నాడు మాకాంప్లెక్సు మొత్తమ్మీద. కనీసం ఫోనులో జవాబైనా చెప్పడేం ఆ మేనేజరుడు అని మండిపడ్డాను మనసులోనే.

మళ్లీ ఫోన్చేసి, ఇరవైనాలుగ్గంటలలోగా అతను నాకు జవాబు ఇవ్వకపోతే, మా లాయరుతో చెప్పిస్తానని మెసేజి పెట్టేను.

ఆ సాయంత్రం నా ఫోను మోగింది. మా మేనేజరే.

చెప్పేను నా అవస్థ. కాండోలో రిపేర్లు నా బాధ్యతే అన్నాడు.

"ఆ సంగతి నాకు తెలుసు. కాని ఎవర్ని పిలవాలో నాకు తెలీదు. నీకు తెలుసేమోనని అడుగుతున్నాను."

"మా బ్రదరు చేస్తాడు కాని, నేను వాడిపేరిస్తే అది conflict of interest అవుతుంది."

నాకేం చెప్పాలో తోచలేదు.

"నీకు తెలిసినవాళ్లు ఇంకెవరూ లేరా?"

"లేరు," అని ఫోను పెట్టేశాడు, మరో మాటకి అవకాశం లేకుండా.

నేను మా రియాల్టరు మాటలు గుడ్డిగా నమ్మేనో, సరిగ్గా అర్థం చేసుకోలేదో ఇప్పుడు చెప్పడం కష్టం. కాండో కొన్నప్పుడు జెన్నీ మా రియాల్టరు "నువ్వేం కష్టపడక్కర్లేదు, గడ్డి కొయ్యక్కర్లేదు, మంచెత్తిపోసుకోనక్కర్లేదు, పైకప్పూ, నీళ్ల హీటరూ పన్చేస్తాయో లేదో అంటూ తెల్లారి లేచింది మొదలూ కటకటలాడనక్కర్లేదు ... అంటూ ఊకదంపుడుగా నేను పట్టించుకోనక్కర్లేనివి ఆవిడ పెద్ద పనస చదువుతూంటే పొంగిపోయానే కాని నేను పట్టించుకోవాల్సినవేమిటో కానుకోలేదు. అదే నా కొంప ముంచింది. చెప్పిందిలెండి చివర్న కాండోలోపలిభాగంలో మాత్రం ఏవేనా రిపేర్లొస్తే నీదే బాధ్యతని. కాని ఆ వెంటనే అప్పటి ఓనరుడు ఇల్లు మాంఛి కండిషన్లో ఉంచేడనీ, బోలెడు ఖర్చు చేసి పకడ్బందీగా వాసయోగ్యం చేశాడనీ కూడా చెప్పడంతో బోల్తా పడిపోయాను.

కొంతకాలం బాగానే సాగింది. నేను ‘‘ఒహొూ నా కాండో జీవితమూ’’ అంటూ పాడుకోడం సాగించేను. అడిగినవాళ్లకీ, అడగనివాళ్లకీ కాండో సౌకర్యాలు వల్లె వేస్తూ వచ్చాను కూడా, వంటగదిలో కొళాయి కారడం మొదలయేవరకూ.

మొదట్లో ఉండీ ఉడిగీ ఒకటీ, రెండూ చుక్కలు కారుతూ వచ్చేయి. నేనే కొళాయి సరిగ్గా కట్టేయలేదేమోననుకుని గట్టిగా మొట్టితే ఆగిపోయాయి ఓ రోజు. మరో రోజు కొళాయికొమ్ముచ్చుకు మరోవేపుకి తిప్పితే రోగం కుదిరిపోయింది. అంతేగాని ఏకధారగా కురియలేదెప్పుడూ మన కథానాయికల్లా.

రానురాను టుప్పటుప్ప డప్పలచప్పుడు చెప్పలో రాయిలా బాధించసాగింది. అది నాకొక్కదానికే కాదని తెలిసేసమయం కూడా వచ్చింది దరిమిలా. కింది కాండోలో వున్న శాండి ఓ రోజొచ్చి తలుపు తట్టింది.

తలుపు తీసి ‘‘ఏమిటయింది?’’ అన్నాను అయోమయంగా.

ఆవిడ కాస్త భారీమనిషి. రూల్సువిషయంలో నిక్కచ్చిమనిషని మా బిల్డింగులో అందరూ చెప్పకుంటారు.

"మీ కొళాయి కారుతున్నట్టుంది," అంది అమెరికనింగ్లీషులో.

నాకు తెలీదూ? "అవును. రిపేరు చేయిద్దామనుకుంటున్నాను," అన్నాను, కాస్త బూకరింపుగానే.

"ప్లమరుని పిలిచావా?"

"మధ్యాన్నం పిలుస్తాను."

"ఎవర్ని పిలుస్తావు?"

"తెలీదు. చూస్తున్నాను. "

"కాల్ పైప్ డాక్టర్ ."

నాకు నవ్వొచ్చింది. ఈమధ్య అందరూ డాక్టర్లే. పైప్ డాక్టర్, రగ్ డాక్టర్, ... అంటూ ఈ డాక్టరేటులు ఎవరికి వారే పట్ట ప్రదానాలు చేసేసుకుంటున్నారు.

డాక్టర్లెవరూ ప్లాస్టక్ ఫిక్సర్అప్పర్, బ్రెయిన్ రిపేరర్లాంటి టైటిల్సు వాడుతున్నట్టు లేదింకా!

"సరే," అన్నాను శాండీతో.

"నెంబరుందా?"

"యల్లోపేజీలు చూస్తాను."

"4502253. రాసుకో," అథార్టీగా చెప్పి, తాను మూడో షిఫ్టు పనిచేస్తాననీ, అంచేత నిద్ర లేకపోతే కష్టం అనీ, నా కొళాయి కారుతుంటే తనకి నిద్రాభంగం అనీ ఓ చిన్న ఉపన్యాసం యిచ్చి, నేను వెంటనే ఆ సంగతేదో చూస్తానని మాట పుచ్చుకుని గాని కదిలింది కాదు ఆ మహాతల్లి. చెప్పొద్దూ, నాక్కళ్లనీళ్ల పర్యంతం అయిందంటే నమ్మండి. అయినా వీళ్లు మరీను ఒక్క పిసరు కూడా ఓర్చుకోలేరు. లాన్‌మోవర్లో చెయ్యిపెట్టేసి, వేలు తెగిపోతే, రక్తం ఓడుకుంటూ, రెండోచేత్తో డ్రైవు చేసుకుంటూ ఆస్పత్రికి వెళ్లేను నేను. అదే ఇక్కడ మరొకరైతే ఆంబులెన్సుని పిలిచేస్తారు బోలెడు ఖర్చూ, వాడంతా గొడవా చేస్తూను. హుమ్.

ఆవిడటు తిరగ్గానే ఆవిడిచ్చిన నెంబరు పారేశాను. పనిగట్టుకు ఇచ్చింది కనక నాకు ఆ నెంబరు పిలవాలనిపించలేదు. నూకలు ఊరక చల్లబడవుగదా.

ఆ సాయంత్రం టెలిఫోను డైరెక్టరీ ముందేసుక్కూచున్నాను. ఒకాయనకి నా తెలుగుయాసతో కూడిన ఇంగ్లీషు అర్థం కాలేదు. నా పేరు గుణించేసరికి టతాలు గుణించినంత పనయింది. మరొకడు మూడు వారాలవరకూ తీరదన్నాడు. మరొకటి ఆన్సరింగు మెషీను. నా పేరూ, నెంబరూ, పిలిచినకారణం, టైమూ వగైరా వివరాలిస్తే తమకి వీలయినంత వెంటనే మారుబలుకుతామనీ. నాకేం నమ్మకం లేదు అన్ని వివరాలు ఆ మెషిను ఆకళించుకోగలదని. మా పొరుగు శాండీ ఇచ్చిన నెంబరు తీశాను చెత్తబుట్టలోంచి, ఏం చేస్తాం? వాసుదేవుడంతటివాడికే తప్పలేదు, మానవమాత్రులం మనంవెంత? నా పూర్వజన్మ సుకృతం లేదా నా "గుడ్

కర్మా" కావచ్చు ఆ పైపుడాక్టర్ ఫోనందుకున్నాడు. ఆపూట మరెవరో కాన్సిల్ చేశారనీ, అంచేత వెంటనే రాగలననీ అన్నాడు.

"ఛార్జీలెంతవుతాయి?" అనడిగేను, గుండెలు చిక్కబట్టుకుని.

"రావడానికి నలభై, అసలు బాధేమిటో కనుక్కోడానికి అరవై, ఆ పైన అది కుదర్చడానికి గంటకి యాభై, ... "

ఏంచెప్పను? సరే రమ్మన్నాను. గంటలతరబడి ఆ పైపులన్నీ వూడదీసి, ఇల్లంతా నానాకంగాళీ చేసి, ఏమీలేదని చెప్పి రెండువందలడాలర్లు ఛార్జీ చేసినా నేం చెయ్యగలిగిందేం లేదు.

వంటింట్లో డాక్టరుగారు ఆపరేషను చేస్తుండగానే ఉత్తరాలొచ్చాయి. అమ్మ రాసింది, రాములు పోయాడని. నాగుండె కలుక్కుమంది.

రాములంటే మాయింట్లో నాచిన్నప్పటి డ్రైవరు. అప్పటికింకా ఈ రోజుల్లోలా విధులకీ, బాధ్యతలకీ నిర్వచనాలు రాయని రోజులు. డ్రైవరంటే కేవలం డ్రైవు చేసేవాడూ, తోటవాడంటే కేవలం తోటపన్చేసేవాడూ అని నిర్ధారణ కాని రోజులు.

రాములు మాయింట్లో డ్రైవరుగా చేరేనాటికి, నాకు నాలుగేళ్లుంటాయేమో. మానాన్నగారు కాంపుకెళ్తే, మాఅమ్మ అతన్ని మాయింట్లో పడుకోమనేది. నన్ను బీచికీ, సినిమాలకీ అతన్నిచ్చి పంపేది. రాములెప్పుడూ, ‘‘అది నాపని కాదం’’టూ రొకాయించలేదు.

ఆ తరవాత, పోలమ్మతో పెళ్లయింది అతనికి.

ఓ రోజు అలవాటుప్రకారం, అమ్మ "చిన్నమ్మ సినిమా అంటోంది. రాములూ, సాయంత్రం కాస్త పెందరాళే వచ్చీ" అంది.

రాములు తలొంచుకు నిలబడ్డాడు.

"ఏం, మాటాడవేం?"

రాములు నసిగేడు. అమ్మకి అర్థం కాలేదు. ఏమిటీ అని మళ్లీ అడిగింది.

"అదేనమ్మగారూ, పోలి ఇంటికాడ ఒక్కత్తీ వుంటానికి బయపడతాది."

"అయ్యో, అవును మరి. ఒక్కదాన్నీ ఒదిలీకు. దాన్ని కూడా తీసుకురా. సుబ్బులుతో చెప్తాను, సినిమానించి ఒచ్చేక, ఇద్దరూ అన్నంతినేసి పొండి. లేకపోతే, ఆ వెనకగది ఖాళీగానే వుంది కదా. అక్కడ పడుకుని తెల్లారేక పోదురుగాని."

అలా రాములూ, పోలమ్మా మాయింటివాళ్లకిందే లెక్క అయిపోయారు. ఆ రోజులలాటివి.

రాములు గవర్నమెంటు వుద్యోగం వచ్చిందని, మాయింట్లో పని మానేస్తానని చెప్పినరోజు నేనెంత గొడవ చేశాననీ! అతను వెళ్లడానికి వీల్లేదని ఒకటే ఏడుపు. అతనూ, ఆమ్మా కూడా అప్పుడప్పుడు వచ్చి నన్ను సినిమాలకీ, బీచికీ తీసుకెళ్తాడనీ పదే పదే హామీలిచ్చినా నేనొదిల్తేనా! ఆఖరికి విసుగేసి, అమ్మ "అతన్తో వెళ్లిపో" అంది. నేను సరేనంటూ, గబగబా వెళ్లి, రెండు పరికిణీలూ, జాకట్లు తెచ్చుకుని తయారయిపోయాను. అమ్మ నవ్వితే, రాములు తలొంచుకు స్థంభంచాటుకి తప్పుకున్నాడు. అప్పట్లో అతను కూడా నవ్వుతున్నాడనే అనుకున్నాను కాని ఇప్పుడాలోచిస్తే, అతను కూడా బాధపడి వుంటాడనిపిస్తోంది. మాయిద్దరిమధ్య అనుబంధం అలాటిది.

వుత్తరం మరోమారు చదువుకున్నాను. రాముల్తోపాటే ఆ రోజులు కూడా పోయాయి.

"డన్" అన్నాడు, ప్లమరు పని పూర్తి చేసి, బిల్లందిస్తూ.

నాక్కళ్లు తిరిగేయి. ఎందుకని అడక్కండి.

000

(apweekly.com లో తొలిసారి ప్రచురించబడింది. ఫిబ్రవరి 2006)

# 12. అడవిదారంట!

మనూ గబగబ అడుగులేస్తోంది అడవిదారంట.

గుట్టలంట, ఏటిగట్లంట

పొదలంట

దాట్లేస్తూ

బండలు దూకుతూ

గబగబ సాగి పోతోంది

చీకటులు చిన్నగా కమ్ముకొస్తున్నాయి

మనూ మనోవీధిలో నానారకాల ఆలోచనలు ...

Forgiveness seminarట! తనతో పని చేసే ఎమిలీ వెళ్ళింది ఆ సెమినార్‌కి.

ఏమిటో వాళ్ళక్కడ బోధించేది?

ఎవరు ఎవరికి క్షమాపణలు చెప్పకోవాలో ఎవరు ఎలా నిర్ణయించగలరు?

తనవిషయంలో ఏం జరిగింది?

అహ్! మనూ మెడమీద వాలిన కందిరీగని విదిలించి కొట్టింది రాతిగుట్టమీద జాగ్రత్తగా అడుగులేస్తూ.

తొలిసారి తనకి ఎదురుదెబ్బ తగిలింది ఎప్పుడు చెప్మా?

పదేళ్ళప్పుడు కాబోలు - పక్కింటి అబ్బాయి తనని వాళ్ళజట్టులో చేర్చుకోను అన్నప్పడు ...

తను తెచ్చుకున్న పిప్పరమెంట్లు తాను వాళ్ళకి ఇవ్వనన్నప్పుడు.

వాళ్ళెప్పుడూ మనూకి తమ పిప్పరమెంట్లు ఇవ్వలేదు. తను మాత్రం ఎందుకు పంచాలి వాళ్ళకి?

వాళ్ళతో ఆమాటే చెప్పింది మనూ, "మీరెప్పుడూ మీరు తెచ్చుకున్న పిప్పరమెంట్లు నాకు ఇవ్వలేదు. నేను మాత్రం మీకెందుకివ్వాలి?"

"ఇవ్వకపోతే మేం నీజట్టుండం. నువ్వు మాతో ఆడ్డానికి వీల్లేదు" అన్నాడా అబ్బాయి. పెద్ద గుండాలా ఉంటాడు.

"ఆడకపోతే ఫోండి. నేనే ఆడుకుంటాను," అంది మనూ వేరే చెట్టుకింద కూర్చుని.

మర్నాడు మామూలుగా అందరూ కలిసి ఆడుకున్నారు. పాడుకున్నారు. ముందురోజు కత ఎవరికీ గుర్తులేదు. అదేనా క్షమించడం అంటే? మన్నించడానికీ మరిచిపోడానికీ తేడా ఉందా లేదా?

ఆరోజు ఏం జరిగిందో మనూకి అర్థం కాలేదు. తను ఆ పిల్లలదగ్గర్నుంచీ దూరంగా వెళ్ళిపోయింది. అదే పని చేసినట్టుంది వాళ్లమీద! ...

మనూ భుజంమీద వాలిన మరో కందిరీగని చటుక్కున ఓ దెబ్బ వేసి నడక వేగం పుంజుకుంది.

సాయంత్రం నాలుగవుతోంది. ఎండచురుకుదనం తగ్గుముఖం పట్టింది. చీకటి పడకుండా ఈ అడవిలోంచి బయట పడాలి.

కందిరీగలు ఝుమ్మని ముసురుకుంటున్నాయి. పట్టు విడవని భట్టి విక్రమార్కుడిలా చంపుకు తినేస్తున్నాయి. కానీ తను వాటికి లొంగదు అంత తేలిగ్గా. తన పంతం మాత్రం సామాన్యమా? ఈ ఈగలూ దోమలూ తనని ఏమీ చెయ్యలేవు. వాటికి తనని హింసించే హక్కు లేదు.

మనూ పెదవులమీద చిరునవ్వు మొలకెత్తింది. కందిరీగలకేం తెలుసు హక్కులగురించి? కొయ్యబొమ్మలకెక్కునా కోమలులసారు ... హీహీ. .. వాటికెందుకు హక్కుల సొల్లుకబుర్లు? స్నేహాలు పోతాయని బెంగ పడాలా?

కోర్టులకీడుస్తారేమోనన్న బెదురా? ఏమీ లేదు ...ఔచ్. మెడమీద మరో కందిరీగ. మను పళ్ళు గిట్టకరుచుకు నడుస్తోంది.

అడుగులతో సమాంతరంగా ఆలోచనలు సాగుతున్నాయి. మళ్ళీ ఎప్పుడు తగిలింది చెప్మా రెండో దెబ్బ? మరో కందిరీగ ఎప్పుడు కుట్టింది?

మిల్వాకీ స్నేహితురాలిముందు తన మనోవేదన వెళ్ళబోసుకున్నప్పుడు ... మనూకి వెంటనే తెలీలేదు. తెలిసినప్పుడు గుండె గిలగిల్లాడింది. ఒక మనిషి మరో మనిషిని ఎందుకు హింసిస్తాడో, ఆ హింసలో ఎలాటి ఆనందాన్ని పొందుతాడో మనూకి అర్థం కాలేదు ఎంత తలబద్దలు కొట్టుకున్నా. అందులోనూ వారికి ప్రత్యేకించి కలిసొచ్చేదేమీ లేనప్పుడు. మనూ తన స్నేహితురాలితో తన బాధ చెప్పుకున్న ఆరునెలలకి కాబోలు మరో మిత్రురాలినించి ఫోనొచ్చింది, "ఇలా అని విన్నాను, నిజమేనా?" అని.

మనూకి నోట మాట రాలేదు మొదట. తేరుకున్న తరవాత "నీకెలా తెలిసింది?" అనడిగింది. ఆ మిల్వాకీ స్నేహితురాలు న్యూజెర్సీలో స్నేహితురాలికి చెప్తే, ఆవిడ టెక్సస్‌లో స్నేహితురాలికి చెప్తే, ఆవిడ వాషింగ్టన్‌లో మరో నెచ్చెలికి చెప్తే. .. ... అలా అలా .... మళ్ళీ మనూదగ్గరికొచ్చింది వార్త.

మనూకి మతి పోయినంత పనైంది. ఆత్మీయురాలన్న విశ్వాసంతో చెప్పుకున్న మనోవేదనని ఊసుపోకకి ఆసమ్మ బూసమ్మ కబుర్లలా వాడుకుంటారని తను అనుకోలేదు. బహుశా వీళ్ళలో ప్రతి ఒక్కరూ రెండోవారికి "మళ్ళీ ఎవరితో అనకేం, మనూకి తెలిస్తే బావుండదు," అనే ఉంటారు కూడా. అప్పటివరకూ ఈ దేశంలో కూడా మనవాళ్ళు ఇలా ప్రవర్తించగలరనుకోలేదు. ఇది సాంప్రదాయంలో భాగమే కానీ ఈ దేశం వచ్చేక స్థానిక సాంప్రదాయాలకి అలవాటు పడతారు అనుకుంది. నిజానికి స్థానికపద్ధతిలోనే చాలామంది మనూని పని గట్టుకు పిలిచి "నీకు మాటాడాలనుంటే చెప్పు, మేం ఉన్నాం," అన్నారు. మనూకి మాత్రం అది చాలా ఎబ్బెట్టుగా తోచింది. తన ఊళ్ళోనే ఉంటే

అదో దారి. అక్కడ ఎవరూ "ఫలానా టైములో ఫలానా చోట కలుసుకుందాం, రా, నీబాధలు చెప్పకుందువు గానీ," అంటూ స్థల కాల నిర్ణయాలు చేసుకోరు. "ఇది రహస్యం, మరొకరి వ్యక్తిగతవిషయం" అన్న సంగతి కూడా ఎవరికీ తట్టదు. కానీ ఈ దేశం వచ్చేక అలా కాదు అనే అనుకుంది. తన ప్రాణస్నేహితురాలికి కూడా ఈ విషయం తెలుసనే అనుకుంది. అదే తన అజ్ఞానం. అలా అనుకోడం మనూ తెలివితక్కువతనం. హ్మ్. ... నుదుటిమీద కసిక్కున కుట్టింది మరో కందిరీగ నిక్కము నిక్కము అంటూ.

మనూ ఈ పోటులకి అలవాటు పడిపోతోంది. షా అంటాడు **మేజర్ బార్బరాలో** "మొదట తగిలిన దెబ్బ కన్నా రెండోదెబ్బకోసం ఎదురు చూడ్డం ఎక్కవ బాధాకరం" అని. మనూ మళ్ళీ వచ్చే కందిరీగలకోసం ఎదురు చూస్తూంది. ఇవి ఎందుకు కుడతాయో? అదొక ఆటా వాటికి? వాటివల్ల మనిషికి కలిగే బాధ ఎలాటిదో వాటికి తెలుసా? హఠాత్తుగా మనూకి తల్లిమాటలు గుర్తొచ్చేయి. పాములగురించి అంటూ ఉండేదావిడ. తెల్లారి లేస్తూనే "నరుడికంట నేను పడకుండా, నాకంట నరుడు పడకుండా కాపాడు తండ్రీ," అని ప్రార్థిస్తాయిట అవి. ప్రార్థించే పాముల్ని ఊహించుకోబోతే నవ్వొచ్చింది మనూకి. చ్. చ్. మరో పురుగు!

మ్. దాదాపు దశాబ్దం అయిపోతోంది ... ఆరోజు ...

తను డ్రైవ్ చేస్తోంది. "ఇదుగో, ఇవాళ్టి పాఠం" అంటో ఓ అరపేజీ కాగితప్పుక్క చేతికందించేరు ప్రొఫెసరుగారు.

"నేను తయారు చేసుకున్నాను వేరే పాఠం. ఇది చెప్పలేను," అంది మనూ.

ప్రొఫెసరుగారు వీలయింత ఎత్తుకి ఎగిరిపడ్డారు కారులోనే. ఆఖరికి ఉపసంహారంగా "నేను సంవత్సరాలతరబడి కష్టపడి తయారు చేసిన ప్రోగ్రాం నువ్వు క్షణాలమీద మురిగ్గుంటపాలు చేస్తున్నావు," అన్నారు.

"అలా అనుకుంటే నేను మానేస్తాను. మీరే చెప్పకోండి," అంది మనూ. ఆ తరవాత తను ఆ ఉద్యోగం వదిలేసింతరవాత మరొకావిడని తీసుకొచ్చి పెట్టేరు అదే పనిలో. ఆ కొత్త మనిషి పాఠాలు చెప్పడంలేదు, "క్లాసుకొచ్చి ఏడుస్తూ కూర్చుంటుంది, మీరు కొంచెం ఈ స్టూడెంట్లకి ట్యూషను చెప్పండి" అని డైరెక్టరుగారు మనూని అడిగినప్పుడు తనకి గొప్ప ఉపశమనం ... అది తనకొక నైతికవిజయం. ఆహా భగవంతుని లీలలు అనుకుంది భుజంమీద వాలిన మరో ఈగని చూస్తూ. తను వేసుకున్న అరచేతి మందం చొక్కాలోంచి ఆ పురుగు కోరలు దిగడం అసంభవం! ఇది forgiveness కవచం అనుకోవచ్చేమో.

మనూ నడక వేగం హెచ్చించింది. తను తొందరగా ఈ అడవిలోంచి బయట పడాలి. ఎండపొడ గుబురుకొమ్మల్లోంచి కనీ కనిపించనట్టు ఉంది. అక్కడా అక్కడా ఉండీ ఉడిగీ పచ్చని కొమ్మలమధ్య నల్లగా కమ్ముకొస్తున్న మబ్బులు కనిపిస్తున్నాయి. ఛ్. గోముఖవ్యాఘ్రాలు, కొవ్వెక్కిన గండ్ర మక్షికాలు.

"మనం, మనం ఇండియనులం, మనకి మనమే సాయం అంటూ తీయగా కబుర్లు చెప్పి తమకి కావలసిన సమాచారం సేకరించుకుని తన్ని గంగలో దింపి సొంత లాభాలు మాత్రమే చూసుకున్న "మనవాళ్ళు!" - ఈదేశం వచ్చేక మనవాళ్ళు ఎంతగా మారిపోతారో అప్పడే అర్థమయింది మనూకి. "నువ్వు నాలాభం చూడు. నేను నాలాభం చూసుకుంటాను" అన్న తత్వం తొలిసారిగా చూసింది వాళ్ళదగ్గర.

మనూ దీర్ఘాలోచనలో పడింది.

ఆ అమ్మాయి పేరు గుర్తు రావడం లేదు. అసలు పరిచయం కూడా ఒక దుర్ఘటన మూలంగా. ఆవిడమొగుడు కారు ప్రమాదంలో హఠాత్తుగా పోయేడు. ఊళ్ళో ఉన్నవాళ్ళందరూ ఆదుకున్నారు. వంతులేసుకుని ఆవిడదగ్గర కూర్చున్నారు ఆవిడతాలూకువాళ్ళు దేశంనించి వచ్చేవరకూ. అలాటిరోజుల్లోనే

ఒకావిడ మనూని పిలిచి కొంచెంసేపు ఆవిణ్ణి కనిపెట్టుకుని ఉండమంటే సరేనంది. తీరా వెళ్లింతరవాత ఏ మాటాడాలో, ఏం చెయ్యాలో తెలీలేదు. ఆఖరికి ఆవిడే జాలిపడి తనతో మాట కలిపింది. ఆ రోజు ఉదయం మనూని పిలిచి తాము ఇల్లు కొనే విషయం మాటాడతానని చెప్పేడుట అతను.

"పిలిచారా?" అని అడిగిందామె. "లేదం"ది మనూ. ఆయన తనని పిలిచేలోపునే కారుప్రమాదం జరిగిపోయింది. మనూకి అయ్యో అనిపించింది. క్షణాలమీద ఎంత భయంకరమైన మార్పు ఒక్కొక్కరి జీవితాల్లో!

ఆ కుటుంబం క్రమంగా కోలుకోసాగేరు. తరవాత ఇల్లు కూడా కొన్నారు మనూద్వారానే. అప్పట్నించీ ఆవిడకి ఆత్మీయురాలయిపోయింది. నిజానికి అలాటి ఆత్మీయతలు మనూకి ఇష్టంలేదు. బిజినెస్ అయిపోయింతరవాత ఎక్కడికక్కడ తెగతెంపులు చేసుకునే తత్వం తనది. కాని ఆవిడ వదల్లేదు. తల్లిలాటిదానివంది. నీకోసం ఏదైనా చేస్తాను అంది. నీకంటే నాకు ఆప్తులు లేరు అంది. అన్ని కబుర్లూ క్షణాలమీద ఎగిరిపోయేయి మళ్ళీ రెండో ఇల్లు కొనేవేళకి. వాళ్ళమూలంగా తను చాలా నష్టం భరించవలసివచ్చింది. దాదాపు చిప్ప చేతికొచ్చినంత పనయింది.

ఆ రోజుల్లోనే తన కుర్చీలూ, బల్లలూ, గిన్నెలూ తప్పేలాలూ తీసుకెళ్ళేది. మళ్ళీ ఇవ్వడం అంటూ లేదేదీ. తనకంటే పదింతలు ఆదాయం ఉన్నవాళ్ళు తన వస్తువులకి ఆశ పడ్డం ఏమిటో! తరవాత మాటాడ్డం మానేసింది. మనూ పిలిచి అడిగింది తనవస్తువులు తిరిగిమ్మని. తెస్తానందావిడ కానీ తేలేదు. మాచెడ్డ కోపం వచ్చింది తనకి. ఛీ అనిపించింది. తిట్టాలనిపించింది. అరిచి గోల పెట్టాలనిపించింది. ఏం లాభం? వాళ్ళకి చీమ కుట్టినట్టయినా లేదు. తెల్లారి లేచి అద్దంలో మొహం ఎలా చూసుకుంటారో? రాత్రి నిద్ర ఎలా పడుతుందో? అన్నం ఎలా దిగుతుందో?

వాళ్ళకే బాధా లేదు. తనకే ఆలోచనలతో నాలుగు రోజులు అన్నం సయించలేదు. నెల రోజులు నిద్ర పట్టలేదు. మనసు మొద్దు బారిపోయింది. తననంత క్షోభ పెట్టినవాళ్ళకి మాత్రం ఏ బాధా లేదు. వాళ్లు conscience-disabled కాబోలు. అంతరాత్మలని ఇనప్పెట్టెల్లో దాచుకునో, చిలక్కొయ్యకి తగిలించేసో వీధిలోకి వస్తారేమో ...

మనూ ఉలికిపడి చూసింది ... "అయ్యో దారి తప్పి చాలా దూరం వచ్చేసినట్టున్నాను" వెనుదిరిగి కొంతదూరం నడిచి మళ్ళీ తనమార్గంలో పడింది.

కందిరీగలు గుంపుగా మనూ చెవిదగ్గర రొద చెయ్యసాగేయి. చేతిమీద వాలి కుట్టేయి. చురుక్కుమంది. కుట్టినచోట ఎర్రగా కందిపోయింది. నొప్పి మెదళ్ళో నరాల తాకింది.

"కొన్నాళ్ళకి అలవాటయిపోతుంది. నొప్పి తెలీదు."

"మరిచిపోతావులెద్దూ."

"నాలుగు రోజులూరుకుంటే నొప్పీ గిప్పీ అన్నీ అవే మాయమయి పోతాయి."

"వారు ఏమి చేయుచున్నారో వారికి ఎరుక లేదు. నీవు వారిని క్షమించవలెను."

నలుగురూ ఆడే చిలకపలుకులు. దంపుళ్ళపాటలు.

రోజులు గడుస్తున్నాయి కానీ మరుపో అలవాటో అర్థం కావడంలేదు. నిజంగా నొప్పి అలవాటు అవుతుందా? నిజంగా ఎవరైనా ప్రాణాంతకమయిన వేదన మరిచిపోగలరా? ఓ చెయ్యో కాలో విరిగిపోతే మరుపు ఎలా సాధ్యం? మహా అయితే ఆ భాగం లేకుండా పనులు చేసుకోడం నేర్చుకుంటాం కానీ కాలో చెయ్యో లేదన్న స్పృహ ఎక్కడికి పోతుంది? సంగతి ఎలా మరిచిగలం? ఈగలు ముసిరి గుంపులు గుంపులుగా వచ్చి విసిగిస్తున్నాయి. అసలు ఈగలు

ఎందుకు కుడతాయో? తాము కుట్టి బాధిస్తున్నామని వాటికి తెలుసా? సరదాకా? కుట్టడమే ఈగలకి సరససల్లాపాలా?

మనూ మరిచిపోయేననే అనుకుంది. తనని ఈ విషయాలు ఇహ బాధించవనే అనుకుంది. ఆ రోజులలో ఒక రోజు ...

కొందరు విద్యార్థులని ఇండియాలో ప్రాజెక్టు చెయ్యడానికి తీసుకొచ్చింది. తన చిన్ననాటి స్నేహితురాలిని సాయం అడిగింది. అక్కడే మొదలయింది తగువు. తన ప్రొజెక్టుకీ ఆవిడప్లానులకీ పొంతన కుదరలేదు. తను అడిగేదొకటీ ఆవిడ చేసేదొకటీ. ...

"వాళ్ళు ఒక ప్రత్యేకమయిన పనిమీద వస్తున్నారు. ఇంకేమీ కుదరదు," అంటుంది మనూ

"మనదేశ సౌభాగ్యం వాళ్ళకి చూపించక్ఖర్లేదా?" అంటుందామె.

ఆమాట సబబే కానీ ప్రత్యేకించి ఈ సమయంలో సాగదు,

"అది కాదు నేననేది."

"నేననేది ఏమిటంటే ..."

"నామాట ..."

"నీ మూర్ఖత్వం నీదే. నీకే సరదాలూ లేవు. నీ మూర్ఖత్వాన్నే అందరిమీదా రుద్దుతానంటే నేను జరగనివ్వను."

మనూ విభ్రాంతురాలయింది. ఇన్నాళ్ళ తమస్నేహం నిజమైన స్నేహమే అనుకుంది. ఇప్పుడు తెలుస్తోంది ఇది చిన్ననాటి చుట్టరికం కాదు. తన వ్యక్తిత్వం కాదు ఇప్పుడు ఆమెకి కావలసింది. ఇప్పుడు తనకి కొత్తగా ఆవహించిన అమెరికన్‌త్వం! ప్రోజెక్టుమాట పక్కకి తోసి పంతాల్లోకి దిగుతున్నట్టుంది. మూడు దశాబ్దాలలో తాను గమనించని కొత్త కోణం తన స్నేహితురాలి తత్వంలో గోచరించింది హఠాత్తుగా. చాలా బాధ కలిగింది. .. .ఎమిలీతో చెప్పింది.

"Will you forgive her?" ఎమిలీ అడిగింది.

ఝుమ్మని కందిరీగల ఘీంకారం మాట తోచనివ్వడం లేదు. ఏముంది క్షమించటానికి? ఆవిడ అభిప్రాయం అదీ. తనెవరు కాదనడానికి. నిజంగా ఆలోచిస్తే, ఆవిడ కూడా అలాగే అనుకోవచ్చు కదా, "నేను మనూని క్షమించగలనా?" అని.

ఇన్నేళ్ళు తెలియని కొత్త విషయం - ఆవిడకి తనమీద గల అభిప్రాయానికి ప్రాతిపదిక తనవ్యక్తిత్వం కాదు తన యన్నార్రై స్టేటస్ - అన్నది అర్థమయింది. ఇక మీదట తను చేసే ప్రతి పనిలోనూ, ఆడే ప్రతిమాటలోనూ తనకి ఆ జ్ఞానం తాలూకు ఛాయలు ఉంటాయి. అది తన consciousnessలో ఒక భాగం అయిపోయింది. అందులో మళ్ళీ మార్పు రావచ్చు మరొక అనుభవంతో. ప్రస్తుతానికి మాత్రం ఇంతే.

ఓ బండరాయికి కాలు కొట్టుకుని తూలి పడబోయి నిలదొక్కుకుంది. ఆచుకోడానికి అందిన కొమ్మ పట్టుకుంది. కొమ్మలమధ్య నున్న తేనెతుట్ట కదిలి కందిరీగలు పొలో మంటూ లేచి మనూ చుట్టూ కమ్ముకున్నాయి.

కారుమేఘాల్లా ముసురుకొస్తున్న కందిరీగలని తప్పించుకుంటూ, చేతులతో విసురుకుంటూ గబగబా అడుగులేస్తోంది మనూ. సుదూరాన దిగంతాల చిన్నవెలుగు కనిపించింది. దక్షిణంగా వీస్తున్న గాలి వెన్ను నిమురుతూ సుగంధపరిమళాలు మోసుకొచ్చింది.

"నువ్వు మాకు ఓ గిఫ్టువి," అన్నారు వాళ్ళ డైరెక్టరు.

"ఆఁ?" అంది మనూ అయోమయంగా చూస్తూ.

స్టూడెంట్సుకి ప్రోజెక్టుగురించి తాను బాగా చెప్పిందిట. వాళ్లు ఆయనకి ఆమాటే చెప్పి హర్షం వెలిబుచ్చేరుట. ఆమాటే ఆయన మనూకి చెప్పి అభినందించేరు ఆరోజు.

సుదూరాన మరో మేఘం గర్జించింది. ఆకాశంలో ఓ మెరుపు మెరిసింది. తన గుండెల్లో చిన్న పగులేసి చిమ్మిన జీవజలతో కనులు చెమ్మగిల్లేయి.

ఏనాడో విన్నమాట "ప్రోగ్రాంని నువ్వు మురిగ్గుంటపాలు చేస్తున్నావు" - మనసులో తళుక్కున మెరిసింది తటిల్లతలా క్షణంలో సగంసేపు. ఆనాడు కుట్టిన కందిరీగ నొప్పి ఈనాడు తెలుస్తోంది!

మళ్ళీ ఉరిమింది ఆకాశం. మనూ దాదాపు పరుగు పుచ్చుకుంది. దేవుడా! కుంభవృష్టి కురిసేలోపున నన్ను ఇల్లు చేర్చు తండ్రీ!

ఎండిన ఆకులు కదిలిన శబ్దం. మనూ ఉలికిపడి చుట్టూ చూసింది.

"ఊళ్ళోకేనా?" ఎత్తయిన బండమీద కూర్చుని సేద తీర్చుకుంటున్న అమెరికన్ ఇండియన్ వృద్ధురాలు ప్రశ్నించింది ప్రసన్నవదనంతో.

అవునంది మనూ ఈవిడ ఎప్పటికి చేరేను కొంప అనుకుంటూ మనసులో.

ముసలావిడ ఊతకర్ర సాయంతో లేచి, "ఇటు వెళ్దాం రా," అంది మనూ చెయ్యి అందిపుచ్చుకుని.

"అది చుట్టుతిరుగు అవుతుంది. చాలా దూరం."

"హా. తొందరేల? అందరం చేరేదక్కడికే."

"వర్షం వచ్చేట్టుంది. తుప్పగా తడిసిపోతాం."

"అదుగో" అంది ఆవిడ చెవి ఒగ్గి వింటూ, ఎటో చూస్తూ.

మనూ ఆవిడమొహంలోకి పరీక్షగా చూసి తన మనసుని ఆచి పట్టుకు గమనించసాగింది.

దూరాన మధురాతిమధురంగా పిట్టల కువకువలు వినిపించేయి. అటు పక్కన చిన్న కొలనులో బాతులు విలాసంగా పచారు చేస్తున్నాయి.

కుడిబుగ్గమీద వాలిన దోమని మనూ తోసీలేదు ఈసారి. ఈ దోమ తనతో ఎంత దూరం వస్తుందో చూడాలి ...

నిదానంగా ఆ అమెరికనిండియను వృద్ధురాలి చేయి పుచ్చుకుని నడవసాగింది. మనసు ఇప్పుడు ప్రశాంతంగా ఉంది.

# 13. అంతిమ క్షణాలు

తెల్లటి దుప్పటి, తెల్లటి గలేబులు, తెల్లటి దుస్తుల్లో నర్సులూ, డాక్టర్లూ ...

గోడవార బల్లమీద ఎవరో ఆప్తులు పంపిన పువ్వులు, గోడమీద ఏ అనామకుడో గీసిన బొమ్మ ...

కళ్ళు మూసుకున్నాను. కనురెప్పల్లోంచి లీలగా అవే బొమ్మలూ, పువ్వులూ మానసాకాసాన మెదుల్తున్నాయి.

నర్సు వచ్చి "మిమ్మల్ని చూడ్డానికి ఎవరో వచ్చేరు. మీ ప్రాణస్నేహితుల్ట," అంది స్వచ్ఛమైన అమెరికనింగ్లీషులో కూడబలుక్కుంటూ. నాలాగే ఆ అమ్మాయి కూడా వలసపక్షే!

ఈ జనాలు సగానికి సగంమంది ప్రాణ స్నేహితులనే అంటారు.

"నువ్వంటే నాకు చాలా ఇష్టం."

"నీతో కాలం గడపడం నాకు చాలా ఇష్టంగా ఉంటుంది."

"నువ్వు అందంగా ఉన్నావు. నీజుత్తు బావుంది. నీజోళ్ళు బావున్నాయి." ఇదే మగాడయితే "టై బావుంది."

నాకు నవ్వొచ్చింది. వాళ్ళు ఇంగ్లీషులో చెప్పే సొల్లు కబుర్లు తెలుగులో హాస్యాస్పదంగా ధ్వనిస్తాయి. మన సంస్కృతి అలాటిది మరి.

ఇంతకీ నాకు నిజంగా స్నేహితులు ఉన్నారా? అసలు స్నేహం అంటే ఏమిటో?

"ఇప్పుడు వీలు కాదని చెప్పు,"అన్నాను.

"మీరంటే చాలా ఇష్టంలా ఉంది. చాలా ప్రశ్నలడిగేరు. ప్రాణమిత్రురాలు అన్నారు."

నాకేఁవంత ఉత్సాహంగా లేదు. వద్దన్నట్టు సౌంజ్ఞ చేశాను.

“సరే, నిద్ర పోతున్నారని చెప్తాను,” అని నర్సు అనేసి వెళ్ళిపోయింది.

నాజీవితంలో నాకు మిత్రులకి కొదువ లేదు. ప్రాణమిత్రులసంగతి సరే సరి. “తల్లిలాటిదానివి, చెల్లిలాటిదానివి,” అంటూ ఒట్లూ ప్రమాణాలూను. తల పండిపోయింది కాని ఇలాటి విషయాల్లో నేను అట్టే ఎదగలేదు. అంచేత ఎవరేం చెప్తే అదే నమ్ముతూ వచ్చేను. నిజానికి నాకెవరూ లేరు. నేనే కోరీ వేడీ సృష్టించుకున్న లోకం ఇది.

నేను చచ్చిపోతే ఏమవుతుంది? నన్ను చూడ్డానికెవరొస్తారు? ఈ కాయం ఏమవుతుంది? -లాటి ఆలోచనలు నాకింతవరకూ రాలేదు.

హాలీ జ్ఞాపకం వచ్చింది. మన మతం, ఆచారాలంటే బోలెడు కుతూహలం. తనకి కాన్సరని తెలిసేవేళకి నలభై దాటేయి. మరో నాలుగేళ్ళు బతికింది. అందులో మూడొంతులు డాక్టర్లూ, మందులూ, పరీక్షలూ, కెమొథెరపీ, డైట్ - వీటితోనే సరిపోయింది ఆ నాలుగేళ్లూ. నిజానికి ఒక విధంగా చూస్తే తను కూడా ఒంటి పక్షే. ఇంకా చెప్పాలంటే ఇక్కడ అందరూ అంతే. ఎవరికి వారే యమునా తీరే!

మరో రెండు నెలలకి చనిపోతుందనగా కాబోలు వచ్చింది ఇక్కడ స్నేహితుల కడసారి చూపులకి. అప్పట్లో నాకు తోచలేదు కానీ అలా పోతాం అని ముందే తెలియడం, పోయేముందు తనకి తృప్తి కలిగించే కొన్ని పనులయినా చేసుకోగలగడం కూడా అదృష్టమేనేమో. అమ్మ ఫలానా రోజున పోతుందని తెలిస్తే నేను ఏం చేసి ఉండేదాన్నో ... ఎవరైన ఏం చేస్తారో?

అసలు హాలీ వచ్చింది కానీ నిజానికి తను చచ్చిపోతానని మనసారా నిక్కచ్చిగా నమ్మిందా? మందులు పని చేసి, ఇంకా కొంతకాలం బతుకుతానేమో అన్న ఆశ రవంతైనా లేదా ఆవిడకి?

మాయ ఎక్కడుందో? ఆవిడకి తాను హాలీ స్నేహితురాలనని చెప్పకోడం గొప్ప సరదా. అసలు మాయ అందర్నీ తన ప్రాణస్నేహితులనే అంటుంది. నేను ఒక్కదాన్నీ ఉంటున్నానని తెలిసిన దగ్గర్నుంచీ ఒకటే పోరు. పార్టీలకీ, సినిమాలకీ, సంగీత కచేరీలకీ … ఒకటేమిటి ఎక్కడేం జరిగినా నాకు రిపోర్టు ఆఘమేఘాలమీద అందేది. నాకు అవి నచ్చవు అంటే వినిపించుకుంటేనా?

హాలీ వచ్చినప్పడు అడిగేను "మాయని పిలవనా?" అని.

అంత నీరసంలోనూ చేతులెత్తి దణ్ణం పెట్టేసి నవ్వుతూ అంది, "నీకు పుణ్యముంటుంది ఆ పని మాత్రం చెయ్యకు," అని.

ఆ తరవాత రెండుసెలలకి మరొక స్నేహితురాలు పిలిచి చెప్పింది హాలీ పోయిందనీ రానున్న ఆదివారం ఫలానాచోట మెమోరియల్ సర్వీసు పెడుతున్నామని. హాలీకి ఇలాటి కర్మకాండ నచ్చదని నాకు తెలుసు. కొంత అయిష్టంగానే బయల్దేరేను. చాలామంది వచ్చినట్టున్నారు. వీధిపొడుగునా కార్లే. నా కారు పక్కవీధిలో పెట్టవలసివచ్చింది చోటు లేక. కారు దిగి నడుస్తున్నాను. అందరూ తలో మాటా చెప్తారు ఆవిడ మంచితనం, తెలివితేటలు, ఆశయాలు, ఆశలు … ఏవేవో. నేనేం చెప్పను? చెప్పడానికేం ఉంది? అసలు హాలీకి అలాటి ఆలోచన ఉందా? నేనేమీ చెప్పకపోతే ఏమైనా అనుకుంటుందా? అనుకోదని నాకు తెలుసు. తెలియని సంగతి ఏమిటి అంటే హాలీకి ఇప్పడు ఈ జరుగుతున్న తంతుగురించిన స్పృహ ఉండునా? ఉండదా? గుమ్మందాకా వచ్చేను. అందరూ జోళ్ళు గుమ్మందగ్గర వదిలి లోపలికెళ్ళేరు. అలా చెయ్యమని అక్కడ ఒక కాయితం మీద రాసి ఉంది. నేను ఒంగి జోళ్ళు విప్పబోతూ తలెత్తి చూసేను. మాయ మాటాడుతోంది. హాలీ తనకెంతటి ఆప్తురాలో తనూ హాలీ ఎన్నెన్ని విషయాలు చర్చించేవారో …

హఠాత్తుగా ఓపలేనంత నిస్పృహ కమ్ముకుంది నామనసులో. ఏవో చేదు తలపులు …

గిరుక్కున వెనక్కి తిరిగి రెండంగల్లో వచ్చి కార్లో పడ్డాను. ఇంటికొచ్చి తనకిష్టమయిన కర్మసన్యాసయోగం చదువుతుంటే తను నాపక్కనున్నట్టే అనిపించింది.

000

నర్సు మళ్ళీ వచ్చింది మందూ, మంచినీళ్లూ తీసుకుని.

"భయం లేదు. నీకు బాగవుతుంది. సరేనా?" అంది బుజ్జగిస్తున్నట్టు.

నేను సరేనన్నట్టు తలూపేనే కానీ అదంతా నటనే అనుకోకుండా ఉండలేకపోయేను. ఆవిడ నర్సింగుచదువులో అదొక భాగం. పేషంట్సుకి ధైర్యం చెప్పాలి. హమేషా ఖుషామత్ చేస్తూ వాళ్ళని హుషారులో ఉంచాలి.

నాకు భయం లేదు. ఆమాట చెప్తే ఆ పిల్ల నమ్మదు.

ఏమిటో ..

చావంటే భయం

చావుకోసం నిరీక్షణ

చచ్చింతరవాత ఏమవుతుందోనన్న చింత ... ...

చిన్నప్పుడు చదివిన కథలు జ్ఞాపకం వచ్చేయి. చాలా కథలు చావుతోనే ముగుస్తాయి ఎంచేతో మరి. ఇప్పుడు తలుచుకుంటే నవ్వొస్తోంది. చావుతో జీవితం అంతమయిపోతుందా? ఆ ఒక్క జీవి చుట్టూ, ఆ జీవిని కేంద్రంగా పెట్టుకుని ఎన్ని బతుకులో? ఆ ఒక్కమనిషి ఉండడంవల్లో లేకపోవడంవల్లో ఎంతమంది జీవితాలు ఎన్ని రకాలుగా మారిపోతాయో!

ఈ దేశంలో అలా కాకపోవచ్చు. ఎవరిబతుకులు వారివే కనక. ఎంతసేపూ తానెంత కాలం బతకగలుగుతానన్న యావ ఒక్కటే!

నేను ఇంతకాలం బతికి సాధించిందేమిటి? ధనకనకవస్తువాహనాలు, సంసారం, పిల్లలు, బంధువులూ, పరిచయాలూ -- ఒకదానివెంట ఒకటి వచ్చి

పోయేయి ఏటివాలులో కోటి పరకలు. ఇప్పుడు ఉన్నా ఒకటే లేకున్నా ఒకటే. కాకపోతే అనుభవాలు రెండో విడత మొదలవుతాయేమో!

శోభన్ బాబు నాచెయ్యి పుచ్చుకుని పక్కనున్న రమాప్రభకి కన్ను గీటేడు.

''డాక్టరుబాబూ, నువ్వట్టుకున్నది నాచెయ్యి, ఆ నర్సమ్మది గాదు,'' మనసులోనే నవ్వుకున్నాను. ఎవరిబాధ వారిది, ఏం చెప్తాం!

నర్సు ఒకడుగు ముందుకొచ్చి నిలబడి కార్డియోగ్రాఫుపేపు చూపించింది.

నా జీవతరంగాలనీ, ఆటుపోటులనీ చూపించవలసిన కార్డియోగ్రాఫు నా అదృష్టంలాగే సీదాగా సరళరేఖగా భాసిస్తోంది నీలితెరమీద.

హఠాత్తుగా గదిలో కలకలం.

ఇంకేవో మిషన్లు తెచ్చేరు. యమపాశాన్ని తప్పించి పోతున్న ప్రాణాన్ని ఆపి పట్టుకోడానికి, శ్రీమహావిష్ణువు చక్రం వేసినట్టు.

సరళరేఖలో మార్పు లేదు.

మరో పెద్ద డాక్టరొచ్చేడు. ''ఇప్పుడేం చేద్దాం?''

''ఏ స్పెషలిస్టుని పిలుద్దాం?''

వారందరికీ నన్ను బతికించాలనే తపన. డాక్టరుకి ఇది తన పరువుప్రతిష్ఠలకి సంబంధించిన విషయం. ఓ పాతకథ జ్ఞాపకం వస్తోంది. ఓ పేషంటు ఓ సర్జను దగ్గరికి వచ్చేడుట ఆపరేషనుకోసం.

ఆ సర్జను ''నీకేం భయంలేదు. నేను రోజుకి పది ఆపరేషనులు చేస్తాను. నా సక్సెస్ రేటెంతో తెలుసా పదింట తొమ్మిది,'' అన్నాడుట మహోత్సాహంతో అతనికి ధైర్యం చెబుతూ.

''ఇవాళ మీరు ఎన్ని చేశారు ఇప్పటికి?'' అనడిగేడు పేషంటు.

''తొమ్మిది.''

ఆ తరవాతేం అయిందో చెప్పక్కర్లేదు కదా!

నేను నవ్వుకోడం వారెవరూ గమనించలేదు. వాళ్ళెవరికీ నామొహం గమనించే తీరిక లేదు.

''వీలునామా రాశారా?'' ఎవరో ఎవర్నో అడుగుతున్నారు రహస్యంగా నాకు వినిపించదనుకుని.

''లేదు. అక్కడికీ చిలక్కి చెప్పినట్టు చెప్పేం అందరం. వింటేనా?''

''అదే తెలివితక్కువతనం అంటే. ఇప్పుడు ఏవైనా ప్రాణాంతకమైన నిర్ణయాలు చెయ్యాల్సొస్తే ఏం చెయ్యడం?''

''అంటే?''

''ఇంకెవరైనా రావలిసినవారు వచ్చేవరకూ ఉంచడమా మానడమా అన్నవిషయమే తీసుకోండి మాటవరసకి. ..''

''ష్. నెమ్మదిగా. ఆవిడ వింటే బాగుండదు.''

నన్నెవరికోసం ఉంచక్కర్లేదు. నాకెవరూ లేరని వీళ్ళకెలా తెలుస్తుంది? ఎవరో ఎవరితోనో అన్నమాట గుర్తొచ్చింది. ''చచ్చింతరవాత కట్టె ఉంచడం ఎంత కష్టమో తెలుసా? కాయం కుళ్ళిపోకుండానూ, పురుగులు పట్టకుండానూ ...'' ... వింటుంటే నాకు అసహ్యం, కడుపులో వికారం. వెంటనే అక్కడ్నించి లేచిపోయేను.

మళ్ళీ ఇప్పుడు అదే బాధ అవే మాటల్లో కాకపోయినా. కాని ఈ దేశంలో శరీరం అట్టిపెట్టడం చాలా సుళువు. ఖర్చు మాట అడక్కండి మరి.

అయినా నేనే లేనప్పుడు ఈ శరీరం మాత్రం ''నాది'' ఎలా అవుతుంది? అసలామాటకి అర్థం ఉందా? మొదటిసారి ఇక్కడ వేక్‌కి వెళ్ళడం గుర్తొచ్చింది. పదేళ్ళవుతోందనుకుంటా. ఏదో funeral homeలో ఏర్పాటు చేశారు. ఆ శవంతాలూకు భార్యా, కొడుకూ ఓ పక్కన నిలబడ్డారు. కడసారి చూపులకోసం వచ్చినవాళ్ళు ఒకొకరే వరసగా వెళ్ళి, ఆ భార్యకి ఓ కౌగిలి ఇచ్చి, కొడుక్కి షేక్ హేండిచ్చి, సమ సంతాపం వెలిబుచ్చుతున్నారు. నావంతు వచ్చింది. నేను

కూడా ఆచారంప్రకారం నాసంతాపం వెలిబుచ్చి శవాన్ని చూశాను. నాకు మహా ఆశ్చర్యం వేసింది. అతనిమొహం అంత కళగా ఉంది. అసలు అది శవం అనిపించలేదు. ఆ తరవాత తెలిసింది అదంతా మేకప్ అని. ఆ తరవాత నాకు మళ్ళీ అలాటి నాటకం చూడాలనిపించలేదు. మళ్ళీ ఎప్పుడూ వేక్‌కి వెళ్ళలేదు.

ఒక మనిషి శరీరంలో భాగాలు దాదాపు 270 మందికి పనికొస్తాయిట. హాలీయే చెప్పింది. "నాప్రాణం పోగానే నాశరీరంలో ఏ ఏ భాగాలు ఎవరికి పనికొస్తే వారికి పంచిపెట్టేయండి. నాకు ఏ స్మారకసభలూ గట్రా పెట్టకండి" అన్నాను ఉద్రేకపడిపోతూ.

డాక్టరు గబగబా నాదగ్గరకొచ్చి నాచేతిమీద తట్టి, "ష్ ష్ ఆవేశపడకండి, మంచిది కాదు," అంటూ శాంతపరిచేడు.

వాళ్ళంతా గంటన్నరసేపు నానా తంటాలూ పడ్డారు.

"ప్చ్" డాక్టరు చప్పరించి నా చెయ్యి వదిలేశాడు, "మేం చెయ్యగలిగిందంతా చేశాం."

అప్పుడే గదిలో ప్రవేశించిన రాజబాబుమొహం గల ఆర్డర్లీ డాక్టరుగారి దివాలా మొహం చూసి గిరుక్కున వెనుదిరిగి వెళ్ళిపోయేడు.

మరో నర్సు వచ్చి పువ్వులు చెత్తకుండీలో పారేసి తనకర్తవ్యం నిర్వహించి వెళ్ళిపోయింది గాజకుప్పె తీసుకుని. అవును మరి. అది మరోగదిలో పెట్టడానికి పనికొస్తుంది కదా.

ఏమైందేమైందేమైందీ? ... హలో ... హేయ్ ... ఎవరూ నాతో మాటాడరేం? ఏం జరిగిందో నాకు చెప్పండర్రా దుర్మార్గులారా? - నేను ఆరాటపడిపోతూ కేకలేస్తున్నానో వేస్తున్నానుకుంటున్నానో నాకే తెలీడంలేదు!

ఎవరూ నామాట వింటున్నట్టు లేదు. వినిపించుకుంటున్నట్టు లేదు.

"అయ్యో ఈ ఒక్కరోజు గడిస్తే నూరేళ్ళు. శతాయుష్కురాలవును."

నాకు నవ్వొచ్చింది. చిన్నగా నవ్వుకున్నాను. ఒక్కరోజు తక్కువగా నూరేళ్ళు నిండిపోయేయి.

“తెల్లార్తే ఉత్తరాయణ పుణ్యకాలం. ఈ ఒక్కరోజు ప్రాణం పోకుండా ఆపలేరూ?”

“పోన్లెండి. బతికినంతకాలం లక్షణంగా బతికింది. ఆఖరికి హంసలా ఎగిరిపోయింది.”

గూటిలోని చిలకా ఎగిరిపోయే ... గూడు చిన్నబోయే .. హ్మ్. చిన్నబోయెనా?

సరే చచ్చిపోయేనన్నమాట! ఇప్పుడింక వాళ్ళేం చేస్తారో చూడొచ్చన్నమాట. ఇంతకాలం వేధిస్తున్న అనుమానాలన్నీ తీరిపోయే సమయం ఆసన్నమయింది. ఒస్. చావంటే ఇంతేనా ... వాళ్ళమాటలు నాకింకా వినిపిస్తున్నాయే! గదంతా తెల్లటి వెలుగు. అందరూ తెల్లటి దుస్తుల్లో నీడల్లా తిరుగుతున్నారు.

“తరవాతిసంగతి ఏమిటి? ఏం చెయ్యడం?” ఎవరో ఎవర్నో అడుగుతున్నారు.

అంటే యముడుగారు ఇంక రాలేదా? లేక నన్ను ఎక్కడికి పంపడం- స్వర్గానికా నరకానికా అన్నది ఇంకా తేలలేదా? మామూలుగా భూమ్మీద ఉండగానే ఈ లెక్కలు తేలిపోతాయనుకున్నానే. అందుకే కదా తప్పు చేసినప్పుడల్లా హడావుడిగా ఏ వెంకన్నకో పోలేరమ్మకో మొక్కుకోడం, ముడుపులు కట్టుకోడమూను.

మరో నర్సు వచ్చి తెల్లటిదుప్పటి నామొహాన కప్పేస్తోంది.

“ఉండండుండండుండండి, ఉండు తల్లీ, నాకు ఊపిరాడ్డంలేదు,” చేతులతో దుప్పటి తోసేయబోయేను. అరె! నాకు చేతులున్నాయి. అవి ఆడుతున్నాయి. ఊపిరుంది. అది ఆడ్డం లేదు. .. హ. మరి గుండెకాయుందా? అది ఆడుచున్నదా?

తడిమి చూసుకున్నాను.

ఇంకా మరీ హాశ్చెర్యమ్. గుండెకాయుంది. అది లబ్ దబ్ మని కొట్టుకుంటోంది.

ఫక్కున హా హా హా హా మంటూ నవ్వేను.

ఎవరో ఎవర్నో కసిరేరు, "తప్పు నాయనా అలా నవ్వకూడదు. అమ్మమ్మ దేవుడి దగ్గరకెళ్ళిపోయింది. అంటే ఇంక మళ్ళీ ఎప్పుడూ నీకు కనిపించదు తెలుసా."

నామనవడు బిక్కు బిక్కు చూపులు చూస్తూ, "నేను నవ్వలేదు." అన్నాడు.

"తప్పు నాన్నా అలా అబద్ధాలాడకూడదు."

"నేను అబద్ధాలాడలేదు"

"మరి ఎవరు నవ్వేరు?"

"అమ్మమ్మే నవ్వుతోంది."

"తప్పు తండ్రీ, అలా అనకూడదు. అమ్మమ్మ ఇంక నవ్వదు. ఆ పుణ్యాత్మురాలు నవ్వే రోజులు అయిపోయేయి."

"అటు చూడు." అన్నాడు నామనవడు నావేపు చూపిస్తూ.

చుట్టూ చేరినవారంతా గిరుక్కున తిరిగేరు నావేపు.

నేను చెయ్యూపేను. నాచేతిలో ఇసిజి గొట్టాలున్నాయి.

వెంటనే డాక్టరు ఉరిమి చూసేడు నర్సువేపు గొట్టాలు సరిగా తగిలించనందుకు.

ఆయనమొహం కళలు తప్పింది. తాను పొరపాటు పడినందుకు విచారించాలో, పేషంటు బతికి తనపరువు నిలబెట్టినందుకు సంతోషించాలో తెలీనట్టు నిలబడిపోయేడు. తరవాత గబగబా వచ్చి గొట్టాలు మళ్ళీ నాకు సరైన పద్ధతిలో అతికించేడు.

నాక్కూడా అర్థమయింది. నేను చచ్చిపోలేదు.

వీళ్ళందరూ యమదూతలో శివదూతలో కారు.

డాక్టరు శోభన్ బాబులా లేడు. నర్సు రమాప్రభలా కనిపించడంలేదు. ఇకమీదట తెలుగు సినిమాలు చూడడం తగ్గించేయాలి.

కానీ ఒకటి మాత్రం నిజం. అంతిమక్షణాల్లో నామనసెలా అల్లాడుతుందో నాకు ఇప్పుడిప్పుడే తెలిసొస్తోంది.

అంతకంటే ముఖ్యం ఇంటికెళ్ళగానే లాయర్ని పిలిచి వీలునామా రాయించేయాలి.

ooo

(నా స్నేహితురాలు శాయిపద్మ ఇసిజి ఉదంతం చెప్పింది. మిగతా కథ కల్పితం. అక్టోబరు 2008లో తెలుగు తూలికలో ప్రచురితం.)

# 14. పెద్దతనం

ఎవరో తట్టిలేపినట్టు ఉలిక్కిపడి కళ్లు తెరిచి చుట్టూ చూసింది కాంచన. ఎదురుగా బల్లమీద వాచీ పదకొండు దాటి పావుగంట అయిందంటోంది. అబ్బ! ఇంత వెలుగేమిటి? అనుకుంటూ మళ్లీ చుట్టూ చూసింది. రెండు నిముషాలు పట్టింది ఇది పగలే అని అర్థమవడానికి. కిటికీలకి కట్టిన తెరల నీలిరంగు వెలవెలా బోతోంది ఆ వెనకనున్న కాంతితో.

తెల్లారుతూనే అలవాటుప్రకారం నాలుగ్గంటలకి లేచి, రెండు కప్పులు కాఫీ తాగి, ఈమెయిళ్లు చూసుకుంది. ఇంకా మత్తుగానే వుంది. అసలు దేశంనుంచి తిరిగొచ్చినదగ్గర్నుంచీ ఏం బాగుండడంలేదు. లాప్‌టాప్ కుక్కపిల్లలా ఒళ్లో పొదువుకుని అదే పనిగా రాసేసుకు పోతుంటే, దానివేడికి ఒళ్లు ఆర్చుకుపోతోంది. దానికి తోడు చిక్కటి కషాయంలాటి కాఫీలు మూడు కప్పులు తాగి తెచ్చుకున్న పైత్యం. .. దాంతో దగ్గూ ..

పోనీ, కెఫీను కాస్త తగ్గించి చూదాం అని ఈరోజు డికేఫ్ తాగితే, కాఫీ తాగినట్టు లేదు. కప్పు కడిగిననీళ్లు తాగినట్టుంది కానీ... ఒళ్లో వున్న లాప్‌టాప్ ఎదురుగావున్న కాఫీబల్లమీద పెట్టి వెనక్కి వాలింది కాంచన.

దేశంలో వున్నన్నాళ్లూ బాగానే అనిపించింది. వెళ్లిన ప్రతిచోటా, కనపడిన ప్రతివారూ "పెద్దవారు, అమ్మగారు, మేడమ్" అంటుంటే అప్పటికి బాగానే వుంది కానీ ఇంటికొచ్చేక పదే పదే అదేమాట మనసులో మెదిలి, నువ్వు పెద్దదాని అయిపోయేవు అని ఎవరో రెండుచెవుల్లోనూ బాకాలెట్టుకుని మరీ హోరు పెడుతున్నారు!

ఇంతవరకూ "మీరింత పెద్దవారనుకోలేదు" "you don't look that old" అన్నమాటే వుంటూ వచ్చింది మరి. సినిమాకెళ్తే, నువ్వు సీనియర్ సిటిజన్‌వా అని మరోసారి అడుగుతారు డిస్కౌంటివ్వడానికి.

"హుమ్. వీళ్లందరూ కలిసి నాకు లేని ఆలోచన నాబుర్రలో పెట్టేశారు అదేదో నల్లమేకా, నలుగురు దొంగలు కథలోలాగ," అనుకుంది కాంచన నోరు కుక్కమూతిపింజెలా పెట్టి. లేదా, "నాకు దిష్టి తగిలివుండాలి" అని కూడా అనుకుంది. పెదాలు అలవోకగా విచ్చుకున్నాయి.

ooo

తను విశాఖపట్నం వచ్చేనని తెలియగానే ఒరిస్సాలో వున్న ప్రమీల రెక్కలు కట్టుకు వచ్చి వాలింది ఊళ్ళో, కూతుర్ని చూడాలన్న మిషతో. కాలేజీలో వున్న నాలుగేళ్లు కవలల్లా కలిసి తిరిగేవారు. రోజు క్లాసులయేక, సాయంత్రం తనింటికి వచ్చేసేది. ఇద్దరూ డాబామీద కూర్చునేవారు పుస్తకాలు ముందేసుకుని. ఏంమాటాడకపోయినా ఏదో హాయి. మనసునిండా నింపుకుని. ప్రమీలది కమ్మని కంఠం. చక్కగా గొంతెత్తి "రావోయి చందమామా" అనో "లాహిరి లాహిరి లాహిరిలో ఓహో జగమే" అనో పాడుతుంటే తను వింటూ … అలా ఎంతసేపో. కిందనించి అమ్మ అన్నాలకి రమ్మని పిలిచేదాకా టైము తెలిసేదే కాదు.

"అబ్బ, నువ్వలాగే వున్నావే .. ఏం మారలేదే," అని ప్రమీల అంటుంటే, కాంచనకి నవ్వొచ్చింది.

"మారని రూపాయిని" అంది కాంచన చిలిపిగా కళ్లు చిట్లించి.

"పోదూ, నువ్వు మరీనూ.. హాయిగా అమెరికాలో స్థిరపడిపోయేవు. గొప్ప రచయిత్రివయిపోయేవు. నీకు గుర్తున్నారా, కామేశ్వరీ, అహల్యా .. మేం నీపేరు పత్రికలో కనిపించినప్పుడల్లా ఎంతో మురిసిపోతాం."

"నువ్వూ ఏం మారలేదు" అంటూ కాంచన ప్రమీలవేపు చూసింది. నిజానికి ప్రమీల బాగానే ఒళ్లు చేసింది. మాటలు సాగదీస్తూ నెమ్మదిగా పలుకుతోంది. కాస్త ఆయాసం కూడా. ఎందుకో తనకంటే పదేళ్లు పెద్దదానిలా అనిపించింది. మాటతీరూ, మనిషితీరూ కూడా బాగా మారిపోయింది.

"నీకేం హాయిగా ఒక్క పిల్లతో సరిపుచ్చుకున్నావు. నాకు ముగ్గురాడపిల్లలు. తరవాత ఇద్దరు మగపిల్లలు. మాఅత్తగారికి మగపిల్లాడు లేకపోతే వంశం ఏమైపోతుందోనని బెంగ. ఆతరవాతివాడు అనుకోలేదులే. ... "

కాంచనకి ఏం చెప్పాలో తోచలేదు.

"నీఆరోగ్యం బాగానే వుందా?" అడిగింది ప్రమీలే మళ్లీ.

"బాగుంది. నాకున్నదదొక్కటే." అంది కాంచన వెల్తి నవ్వుతో.

"అదే మహద్భాగ్యం. నీకు తెలుసు కదా. అప్పట్లో నాకు 19ఏళ్లు. పెళ్లి చేసేశారు. వరసగా పిల్లలూ. తెల్లారి నాలుగ్గంటలకి లేస్తే, రాత్రి పదకొండుకి పడక. ఇంట్లో పనులన్నీ నేనే చూసుకోవాలి. నేను లేకపోతే ఒక్కక్షణం జరగదు మావారికి. ఆయనే కాదు మామగారు కూడా, అమ్మాయీ నా కలం కనిపించలేదు చూడూ, కాగితాలు కాస్త చూసి పెడుదూ, అంటూ .. కాపురానికొచ్చేక పుట్టింటికి వెళ్లలేదు తెలుసా. నువ్వు లేకపోతే ఇల్లు ఎలా నడుస్తుంది అనేవారు మాఅత్తగారు. పిల్లలబట్టలన్నీ నేనే కుట్టేను. ఆవకాయ పెట్టాలంటే కాయలు తెప్పించడం, కారాలూ, ఆవపిండి కొట్టించడం అన్నీ నేనే చూసుకోవాలి. మాఅత్తగారికి ఏమీ తెలీదు. మరి ఆవిడెలా చేసేరో కాపురం," ప్రమీల నవ్వుతూ చెప్తూంటే కాంచన చూస్తూ కూర్చుంది.

ప్రమీల సమర్థవంతంగా ఇల్లు నిర్వహించేనని గర్వపడుతోంది. తను సంతోషించాలి. కానీ మనసులో ఏదో వెల్తి. తామిద్దరిమధ్యా ఎడం ఎంతో ... మరోసారి ప్రమీలవేపు చూసింది.

మోకాళ్లు ఆపరేషను చేయించుకుందిట. రోజూ గంటసేపు వ్యాయమం చెయ్యాలి. ఆమధ్య గుండెల్లో చిన్న నొప్పిలాటిది వచ్చింది కానీ సమయానికి మూడోకూతురు డాక్టరుదగ్గరికి తీసికెళ్లింది. ఇప్పడు నయంగానే వుంది. పిల్లలు చక్కగా చూసుకుంటున్నారు. ఒక్కొకరిదగ్గర రెండేసి నెలలుంటుందిట. .

''ఆడది ఇంటికి మూలస్థంభంలాటిది. మంచికీ చెడుకీ నిలదొక్కుకుని సంసారం చక్కదిద్దుతూ, పిల్లల్ని వృద్ధిలోకి తీసుకురాగల ధైర్యస్థైర్యాలు ఒక్క ఆడదానికే వుంటాయి,'' అంది ప్రమీల ఆయాసపడుతూ.

తల్లిని తీసుకొచ్చిన మూడోకూతురు, రజని, ''పదమ్మా, ఆలస్యం అవుతోంది. వేళకి తిని పడుకోపోతే మళ్లీ రేపు లేవలేవు'' అని, ''వస్తామండీ'' అంది కాంచనవేపు తిరిగి.

''వుంటావా నాలుగురోజులు?''

''లేదు. పెద్దమ్మాయిదగ్గర వుంటున్నాను కదా. ఈనెలాఖరువరకూ అక్కడే వుంటాను. వచ్చేనెల అబ్బాయిదగ్గరికి వెళ్తాను.''

ooo

కాంచన నిట్టూర్చింది. ఎక్కడికి వెళ్లినా, ఎవరు కనిపించినా అదే ధోరణి. ఇరుగింటా, పొరుగింటా, బజారులో, సభల్లో, సన్నివేశాల్లో - మేడమ్, అమ్మగారు, అమ్మమ్మగారు, ... తనకిచ్చే గౌరవవాచకాలు. ఆ సంబోధనలలో మనసంస్కృతి గుర్తొచ్చి మనసు మృదువుగా స్పందించింది. వెనక ఎవరో బామ్మగారంటే తనని అలా అనొద్దని చెప్పినమాట గుర్తొచ్చింది.

హాల్లో కూర్చుని ఆ రోజు పేపరు చూస్తున్న కాంచనకి గుమ్మందగ్గర ఎవరో నిలిచినట్టనిపించి తలెత్తి చూసింది.

రజని ''పన్లో వున్నారా? వేరే పనిమీద ఇటొచ్చి, మీరేం చేస్తున్నారో అని ఆగేనిక్కడ'' అంది.

కాంచన పేపరు మడిచి పక్కన పెడుతూ, "లేదు, ఏసేంలేదు. రా." అంటూ ఆహ్వానించింది సాదరంగా.

రజని లోపలికొచ్చి కాస్త ఎడంగా కుర్చీ లాక్కుని కూర్చుంది.

"మీఅమ్మ వెళ్లిపోయిందా?"

"ఆఁ, నిన్నరాత్రి రైలెక్కించేను. మీరంటే మాఅమ్మకి చాలా ఇష్టం. మొన్న మీరు వెళ్లిపోయింతరవాత రోజంతా మీగురించే చెప్తూనే వుండింది," అంది రజని కళ్లనిండా అభిమానం నింపుకుని.

కాంచన చిన్నగా నవ్వింది, "అవును, ఆరోజుల్లో మాస్నేహం అలాటిది. ఏ అరమరికలూ లేవు. మళ్లీ ఆ రోజులు రావు," అంది. ఆ తలపు రవంత నిస్పృహ కలిగించి, మొహంలో కళ తప్పింది.

ఇద్దరికీ క్షణకాలం మాట తోచలేదు. కాంచన చిన్నగా నవ్వి, "మా అమ్మ కూడా ఇలాగే అంది."

"అంటే?"

"అదే, ఇలా మాటా పలుకూ లేకుండా కూర్చునేవాళ్లం ఇద్దరం గంటలతరబడి డాబామీద. మాకెందుకో అలా ఏమాటా లేకపోయినా ఏం వెలితుండేది కాదు అని.

"రా, డాబా చూపిస్తాను" అంటూ లేచింది కాంచన.

ఇద్దరూ డాబామీదికెళ్లేరు. పిట్టగోడమీదికి వాలినకొమ్మలతో, విరగబూసిన సంపెంగచెట్టూ, చుట్టుగోడకి దగ్గరగా గుత్తులు గుత్తులుగా గంగాబోండాలతో, పింజలతో, సుతారంగా వాలిన మట్టలతో కొబ్బరిచెట్లూ, పెరటిమధ్య దానిమ్మచెట్టూ, పారిజాతం చెట్టూ, దూరంగా మహోధృతంగా ఎగసిపడుతున్న అలలతో దిగంతాలకి పరుచుకున్న సముద్రమూ, ఏరాడకొండమీద లైట్ హౌసూ... కాంచనకి పాతజ్ఞాపకాలు పొంగుకొస్తుంటే, రజనికి కొత్త తలపులు రూపు దిద్దుకుంటున్నాయి.

"మేం ఇద్దరం ఇక్కడ చాపలు పరుచుకు పడుకుని, ఇరవై సెకనులకొకసారి గోడమీద వెలిగే లైట్‌హౌస్ కిరణాలు ఎన్నిసార్లు లెక్కపెట్టేమో. ఇప్పుడు తలుచుకుంటే సిల్లీగా వుంటుంది" అంది కాంచన దిగంతాల్లోకి దృక్కులు సారించి.

"మాఅమ్మకీ మీకూ కూడా ఇలాటి సాయంత్రాలు మాటల్లేకుండా గడిచేయంటే నాకు ఇప్పుడు అర్థం అవుతోంది," అంటుంటే రజనికళ్లలో రవంత ఈర్ష్యఛాయలు తోచేయి కాంచనకి. ఆవిడ చిన్నగా నవ్వుకుంది ఈ కాలపుపిల్లలు అనుకుంటూ.

మరో పావుగంట వుండి, "ఆదివారం మాయింటికి లంచికి రండి," అంది రజని కాంచనవేపు తిరిగి.

"లంచికా?" కాంచనకి ఆశ్చర్యంగా అనిపించింది. వాళ్లమ్మ ఉన్నప్పుడు పిలవలేదు. ఇప్పుడిదేమిటి?

"మీకు వేరే పనుంటే మరో రోజు చూద్దాంలెండి. మీరింకా ఎన్నాళ్లు ఉంటారిక్కడ?"

"లేదులే. ఆదివారం వస్తాను. ఎన్నాళ్లో లేదు. సోంవారం వెళ్లిపోతున్నాను."

"కారు పంపిస్తాను. లేకపోతే నేనే వస్తాను" అని గుమ్మందాకా వచ్చి, "మిమ్మల్ని ఏమని పిలవమంటారు. మొన్న మాఅమ్మతో వచ్చినప్పుడు, మీకు ఆంటీ అంటే ఇష్టంలేదన్నారు కదా" అంది రజని చిరునవ్వు కళ్లలో మెరుస్తుండగా.

కాంచన కూడా నవ్వింది, "నీఇష్టం."

రజని వెళ్లిపోయేక, చాలాసేపు కాంచన ఆలోచిస్తూనే వుంది తనని ఏమని పిలవడం? "ఏమే కాంచనా" అంటూ నోరారా పిలిచింది ప్రమీల ఒక్కర్తే. మిగిలినవారందరికీ అయితే మేడమ్, అమ్మగారు, అమ్మమ్మగారు. కాకపోతే

డాక్టర్ కాంచన, ప్రొఫెసర్ కాంచన. తనకి ఆ డా.లూ ప్రో.లూ లేవని చెప్పేసరికి ప్రాణం సొలుకొచ్చింది.

ooo

ఆదివారం పదిగంటలకి రజని ఫోన్ చేసింది, ''బసంతో ఏదో పనిమీద కారు తీసుకువెళ్లేడనీ, పదకొండున్నరకి తనింటికొచ్చి వాళ్లింటికి తీసుకెళ్తాడ''ని.

సరేనంది కాంచన.

రజని యమ్మెస్సీ బయాలజీ చేసేక, వుద్యోగరీత్యా కలకత్తాలో వుండగా బసంతో చటర్జీతో పరిచయం అయింది. పెళ్లయి పదిహేనేళ్లయింది. ఇద్దరు పిల్లలు. విశాఖపట్నానికి మారి రెండేళ్లయింది.

అన్నట్టుగానే బసంతో పదకొండున్నరకల్లా వచ్చేడు. తొందరగానే వచ్చేస్తానని ఇంట్లో తమ్ముడికీ మరదలికీ చెప్పి కాంచన కారెక్కింది.

ఇల్లు చూడముచ్చటగా వుంది. మూడుగదుల ఫ్లాటు. చక్కగా అమర్చేరు. హాల్లో సోఫాసెట్టూ, గోడలమీద బాపిరాజుగారి చిత్రాలూ, వంటగదికి ఎదురుగా రోజ్‌వుడ్ బోజనాలబల్లా వారి స్తోమతు తెలియజేస్తున్నాయి. ఆరేళ్ల అమ్మాయీ, పదేళ్ల అబ్బాయీ నీటుగా వున్నారు. తెలుగుదేశం వచ్చి రెండేళ్లయినా బెంగాలీ మర్చిపోలేదు. చక్కగా బెంగాలీ, ఇంగ్లీషూ కూడా మాటాడుతున్నారు. తెలుగు కూడా నాలుగుముక్కలు వల్లిస్తున్నారు.

''ఇంగ్లీషుమీడియం స్కూల్లో వేసేం. తెలుగు నేర్పాలని నాకయితే వుంది కానీ ఎక్కడ .. ఏపనికీ తీరికుండదు నావుద్యోగం. ఆయన వుద్యోగం ...'' రజని అంటుంటే కాంచన అడ్డు పడింది.

''బెంగాలీ వాళ్లనాన్న భాష అని నేర్పేవు. బతుకుతెరువుకి అని ఇంగ్లీషు నేర్పేవు. తల్లిభాష తెలుగు మాత్రం నేర్పడానికి టైము లేదంటున్నావు'' అంది చిన్నగా నవ్వుతూ.

"లేదండీ. నాకయితే నేర్పాలనే వుంది. చెప్పేను కదా. ముందు నాకు వస్తే కదా. నాచిన్నతనం భువనేశ్వర్‌లో గడిచింది కనక నాకూ తెలుగు అట్టే ఒంటబట్టలేదు. ఏదో మాఅమ్మవెనక తిరుగుతూ నాలుగు ముక్కలు మాట్లాడ్డం వచ్చింది కానీ చదవడం, రాయడం రాదు."

రజని నాతో మాటాడుతుంటే. బసంతో వచ్చి అప్పడాలు వేయించనా అనడిగేడు. రజని తలూపి, తను కూడా లేచింది కంచాలు పెట్టడానికి. అబ్బాయి హరీష్ మంచినీళ్లు పెడుతుంటే, కాంచనకి ఎదురుగా ఒదిగి కూర్చుంది రుమ.

"కాయితం, కలం తీసుకురా. నీపేరు తెలుగులో రాయడం నేర్పుతాను" అంది కాంచన రుమతో.

రుమ హుషారుగా లేచి వెళ్లి కాగితం తీసుకొచ్చింది.

కాంచన "a circle, a check on top, a hook to the right" అని వర్ణిస్తూ అక్షరాలు రాస్తూంటే రజని భోజనాలబల్లమీద కంచాలూ, గిన్నెలూ అమరుస్తూ ఓరకంట వాళ్లని చూస్తోంది మురిపెంగా.

కాంచన రాయడం పూర్తవగానే, రుమ ఆ అక్షరాలవేపు చూసి, "అవి నావేపునించా, నీవేపునించా?" అనడిగింది.

కాంచన "నీవేపునించే" అని చెప్పి, "చురుకుపాలు ఎక్కువే" అంది రజనితో. రజని నవ్వింది తృప్తిగా.

రుమ తనపేరు తేలిగ్గానే రాసేసి, అన్నపేరూ, అమ్మపేరూ, నాన్నపేరూ కూడా రాయమంది.

రజని, "రండి. తినడం అయినతరవాత మిగతా పాఠం," అంది.

కాంచన మరోమారు రుమని మెచ్చుకుని, భోజనానికి లేచింది.

కబుర్లు చెప్పుకుంటూ భోజనం చేస్తుంటే. కాంచన "నాకు బెంగాలీ చెప్పు. నీపేరేమిటి అని ఎలా అడుగుతారు?" అనడిగింది రుమని..

రుమ చెప్పింది కానీ కాంచనకి ఆవాక్యం పట్టుబడలేదు. మూడు చుట్లయేక, “I will tell you how to say yes and no” అంది.

కాంచనకి నవ్వొచ్చింది.

బసంతో, “downgraded to LKG,” అన్నాడు నవ్వుతూ.

అందరం నవ్వుకున్నాం. భోజనాలయేక, రజనీ, కాంచనా హాల్లోకి వచ్చి కూర్చున్నారు. బసంతో, పిల్లలూ, బల్లమీదున్న కంచాలూ, గ్లాసులూ ఎత్తిపెడుతుంటే, కాంచనకి ముచ్చటేసింది. రజనివేపు చూసింది ఏ అమ్మాయి మాత్రం ఇంతకంటే ఏం కోరుకుంటుంది అనిపిస్తోంది వాళ్లని చూస్తుంటే.

“మీరేమైనా షాపింగ్ చేస్తారా?” అనడిగింది రజని.

“లేదులే. నాషాపింగంతా హైదరాబాదులో అయిపోయింది. మీరు వెళ్లండి. నేనింటికెళ్తాను.”

“లేదండీ, నాకేం పనిలేదు. బసంతో వాళ్లిద్దర్నీ టెన్నిస్ ప్రాక్టీసుకి తీసుకెళ్తాడు. మనం కైలాసగిరికి వెళ్దాం మీకు ఫరవాలేదంటే. చాలా బాగుంటుంది” అంది రజని.

తండ్రినీ పిల్లల్నీ టెన్నిస్ కోర్టులో దింపేసి, రజన కాంచనతో కైలాసగిరివేపు సాగింది.

దారిలో కాంచనకి చాలా విషయాలు తెలిశాయి. “నేను ఏం సాధించాలనుకున్నానో నాకిప్పుడు అర్థం కావడంలేదు. బయాలజీ చదువుతున్నరోజుల్లో రిసెర్చ్ చేసి లోకంలో రోగాలన్నిటికీ కారణాలు కనిపెట్టేసి మందులు కనిపెట్టేసి, బాధలన్నీ తీర్చేసేయాలనుకునేదాన్ని. రిసెర్చ్ సాగలేదు. బసంతోతో స్నేహం, పెళ్లీ, అతనిఉద్యోగంలో అవకతవకలూ, పిల్లలూ, మధ్యలో ఒక మిస్కేరేజీ .. ఎప్పటికప్పుడు ఏదో ఒక అనుకోని అవాంతరం నా పిహెచ్‌డీకి. నేను ఎవర్నో తప్పు పడుతున్నానని కాదు. బసంతో సహకారంలో లోపం లేదు.

పిల్లలు పుట్టేరంటే దానికి వాళ్ళని తప్పుపట్టలేం కదా'' అంది రజని చిన్నగా నవ్వి.

కాంచనకి ఏమనాలో తోచలేదు.

''అమ్మ మాకోసం ఎంత త్యాగం చేసిందో చూడండి. ఏ పూటకాపూట భోజనం దగ్గర్నుంచీ, పుస్తకాలూ, బట్టలూ, చదువులూ అంతా తనే చూసుకుంది. క్షణం విరామం లేకుండా మాకందరికీ సేవలు చేసింది. మాకు బాగా జ్ఞానం వచ్చి మేమే పెళ్లు, పెళ్లంటూ తోలేవరకూ పుట్టింటికి కూడా పెళ్లలేదు. నాన్నగారు ఉన్నారన్నమాటే కానీ అసలు మేం ఇంట్లో వున్నామో లేమో కూడా స్పృహ వుండేది కాదాయనకి. అసలు మేం ఆయనపిల్లలన్న స్పృహ కూడా వుందో లేదో అనుమానమే. ఆయన ఫైళ్లే ఆయనలోకం. ఖర్మం చాలక అమ్మ ఎప్పుడయినా ఓమాట అడిగినా, అవన్నీ తల్లి చూసుకోవాలి. అది నీకర్తవ్యం అనేవారు.''

ఈ పిల్ల ఇవన్నీ తనకి ఇప్పుడు ఎందుకు చెప్తోందో కాంచనకి అర్థం కాలేదు.

''అప్పట్లో నాకు మహా చిరాకేసేది కానీ ఇప్పుడు అర్థం అవుతోంది కొంతయినా. నాకు నిజంగా చెప్పుకోదగ్గ బాధలేమీ లేవు. మంచివుద్యోగమే. చిన్నకంపెనీ అయినా మంచి పేరుంది. నేను సీనియర్ సైంటిస్టుని. బసంతో యూనివర్సిటీలో రీడరు. నాకు అప్పుడప్పుడూ ప్రయాణాలుంటాయి. బసంతో చూసుకుంటాడు ఇంటినీ పిల్లల్నీ. దేనికీ విసుక్కోడు. నాకే ఎందుకిదంతా అనిపిస్తోంది. బాగా సంపాదిస్తే సుఖపడొచ్చు అంటారు. మరి సుఖపడడానికి టైము కావాలి కదా. అందుకే నేను ఉద్యోగం మానేద్దాం అనుకుంటున్నాను.''

''మానేసి ఏం చేస్తావు?''

''ఏమో తెలీదు. ఏవో ఒకట్రెండు ఇండిపెండెంటు ప్రాజెక్టులు వున్నాయి, ఆలోచిస్తున్నాను. కొడైకెనాల్‌లో ఇల్లు కట్టిస్తున్నాం.'' రజని కారు పార్క్ చేసి,

దిగింది. కాంచన కూడా కారు దిగి చుట్టూ చూడసాగింది. దూరంగా శివపార్వతులు కొలువు తీరి వున్నారు. పాలరాతివిగ్రహం అనంతాల్లోకి చొచ్చుకుని ఇదే కైలాసమమేమోనన్న భ్రమ కలిగిస్తోంది. కాలిబాటకి ఇరువైపులా పువ్వులమొక్కలు అందంగా, ఆహ్లాదకరంగా వున్నాయి. బంగాళాఖాతం విరుచుకు పడుతున్న ఉత్తుంగతరంగాలతో నేపథ్యసంగీతాన్నందిస్తోంది ఉల్లాసం కలిగిస్తూనూ ఉచితంగానూ.

కాంచన సముద్రంవేపు చూస్తూ నిలబడిపోయింది. బంగాళాఖాతంలో కనిపించని సుడిగుండాలు వుంటాయంటారు ... ... అప్పట్లో ఈ శిల్పం లేదు. ఈ ఉద్యానవనాలు లేవు. దిగంతాల ప్రతిధ్వనిస్తూ సాగరసంగీతం మాత్రం అప్పటికీ ఇప్పటికీ ఒక్కలాగే వుంది.

''అసలు ఎవరైనా పెళ్లెందుకు చేసుకుంటారండీ?''

కాంచన తృళ్లిపడి రజనిమొహంలోకి పరీక్షగా చూసింది. ఇంతవరకూ చెప్పిన విషయాలు చూస్తే సంసారంలో ఒడుదుడుకులేం వున్నట్టు కనిపించలేదు. అనుకూలుడయిన భర్తా, బుద్ధిమంతులయిన పిల్లలూ, చెప్పుకోదగ్గ ఆర్థికస్థాయీ - సాధారణంగా ఒక మనిషి కోరుకునే అన్ని వైభవాలూ అమరినట్టే వున్నాయి. మరి ఆ ప్రశ్నేమిటి?

రజని కూడా ఆ మాటే అంది. ''నేనిలా అడిగేనని మరోలా అనుకోకండి. అనుభవం వున్నవారూ, విస్తృతంగా లోకం చూసినవారూ కనక అడుగుతున్నాను. ఈనాటి సామాజికవ్యవస్థలో పెళ్లికి గల 'విలువ' అనాలో 'స్థానం' అనాలో తెలీదు - ఏదో అది ఏమిటి అని?''

''నా అనుభవాలు పెళ్లి సౌభాగ్యం వివరించడానికి పనికిరావులే'' అంది కాంచన.

రజని రెండు క్షణాలు వూరుకుని, “ఇప్పుడు నాకు పెళ్లిగురించి తెలిసిన సంగతులు పదిహేనేళ్లక్రితం తెలిసివుంటే, నేను పెళ్లి చేసుకునేదాన్ని కాను,” అంది.

కాంచన నిశ్చలంగా కళ్లప్పగించి చూస్తోంది. సముద్రంలో అలలు విరుచుకు పడుతున్నాయి సమరోత్సాహంతో ఉరకలేస్తున్న యుద్ధాశ్వాల్లా. కాంచనమనసులో మరొక ప్రశ్న అడగాలన్న కోరిక క్షణకాలం రేగి వెనుదిరింది ఆ అలల్లాగే. రజని ఒకవేళ ఇంతకాలం పెళ్లి చేసుకోకుండా వుండి వుంటే, ఇప్పుడు పెళ్లినిగూర్చి తెలిసిన విషయాలు అప్పుడు తెలిసివుంటే, పెళ్లి కావాలనే అనుకునేదా? కాంచన పెదిమలు ఆచి పట్టుకుంది. ఆ ప్రశ్న ఒట్టి తర్కానికి పనికొస్తుందే గానీ ఇప్పుడు అడగదగినది కాదు. ప్రస్తుతం రజని ప్రస్తావిస్తున్నది పదిహేనేళ్ల సాంసారికజీవనం తరచి చూసుకున్నతరవాత తనకి కలిగిన అవగాహన. అది తనతో పంచుకుంటోంది. ఆ అమ్మాయికి కావలసింది జవాబు కాదు. వినేవాళ్లు! అంతే.

మరో గంటసేపు తిరిగి ఇంటికి మళ్లేరు. కాంచనఇంటిముందు కారు ఆపి, దిగింది రజని. అటుతిరిగి తను వచ్చేలోపున, కాంచన తలుపు తెరుచుకుని దిగింది.

రజని ఆమెదగ్గరికి వచ్చి, ఎదురుగా నిలబడి, “మీతో మాటాడడం చాలా తేలిక కాంచనగారూ” అంది.

కాంచన తెల్లబోయింది. ఇదే అమెరికాలో అయితే ఆశ్చర్యం లేదు. మోకాలెత్తు లేని పిల్లలు కూడా పేరు పెట్టి పిలుస్తారు. కొత్తలో తనకి అది ఎబ్బెట్టుగా తోచేది కూడాను. మన సంస్కృతిలో పెద్దవాళ్లని పేరు పెట్టి పిలవడం మర్యాద కాదు. రజని తనని పేరు పెట్టి పిలవడానికి కారణం వయసుమాట వదిలేసి, కేవలం ఒక స్నేహితురాలిగా తనని గుర్తించడమా? లేదా వాళ్లమ్మకీ తనకీ దృక్పథాలలో గల తేడా గమనించడంవల్లనా? ఇదే తొలిసారి ఆ అమ్మాయి

తనని పేరు పెట్టి పిలవడం! ఇంతవరకూ ఏ సంబోధనా లేకుండా జరుపుకుంటూ వచ్చింది దాగుడుమూతలాడుతున్నట్టు. కాంచనకి మాత్రం హాయిగా అనిపించింది.

రజని అదేమీ గమనించనట్టు, చిన్నగా నవ్వి వెనుదిరిగి వెళ్లిపోయింది.

ooo

గాజుతలుపుమీద దబ్ దబ్మంటూ వడగళ్లు చప్పుళ్లు చేయడంతో కాంచన తృళ్లిపడి బయటికి చూసింది. ఆకాశంలో నల్లటి చిక్కటి మబ్బులు దట్టంగా కమ్ముకుని రాత్రి అయిపోయిందేమో అనిపిస్తోంది. మధ్య మధ్యలో మెరుపులు తళుక్కున మెరిసి క్షణకాలం గదినిండా వెలుగు నింపి వెళ్లిపోతున్నాయి. కాంచన అలా చూస్తూ కూర్చుండిపోయింది రజనిని తలుచుకుంటూ చాలాసేపు.

ఆ పిల్లకీ, తనకీ సమస్య ఒకటేనా? పరస్పరం వ్యతిరేకమయిన అనుభవాలనీ, పరిస్థితులనీ ఎలా సమన్వయపరుచుకోవడం? పెళ్లీ, పిల్లలూ, స్నేహాలూ. వయసులో తారతమ్యాలూ, అవి తెచ్చే ప్రత్యేకపరిస్థితులూ ... ఏది కావాలి? కావలసింది సాధించుకున్న తరవాత ఏం చేయాలి? దినదినం మనం చేసేవన్నీ రోజు గడవడానికా, మరేదో సాధించడానికా?

కాంచన తనవయసెప్పుడూ దాచుకోలేదు. ఇప్పుడు పెద్దదాన్నన్నబాధ కంటే ఆ తలపువల్ల వచ్చే ఈతిబాధ ఎక్కువగా వుంది. దానికి కారణం మాత్రం ఇదమిత్థంగా చెప్పలేకపోతోంది.

పెద్దపెట్టున మరో మేఘం గర్జించింది. కాంచన నెమ్మదిగా ముందుకి ఒంగి లాప్‌టాప్ అందుకుని తెరిచింది. నీలితెరమీద పెద్దతనంనీడలు మరింత స్పష్టంగా కనిపిస్తున్నాయి.

బుద్ధి పని చేయడంలేదు. సినిమాకి వెళ్తేనో అనిపించింది. ఆమధ్య ఎవరో అన్నారు జూలీ-జూలియా బాగుందని. జూలియా చైల్డ్‌గురించి చాలా వింది. వాన ..

ఎలాగా వాకింగుకి వెళ్లడం పడదు. వానకోటు అందుకుని సినిమాకి బయల్దేరింది.

కౌంటరుదగ్గర పదిడాలర్లనోటు అందించింది, ‘‘సీనియర్ సిటిజన్’’ అంటూ.

అమ్మాయి క్షణకాలం కాంచనమొహంలోకి చూసి, ‘‘యూ డోంట్ లుక్ ..’’ అంది ఆరు డాలర్లు అందిస్తూ.

కాంచన టికెట్టూ, డబ్బూ తీసుకుని థియేటర్‌వైపు నడిచింది నేలకి జానెడెత్తున గాలిలో తేలిపోతూ - పెద్దదాన్నని చెప్పకోగలిగినందుకో, మూడు డాలర్లు మిగుల్చుకున్నందుకో, అనువయినచోట అంగీకరించడం తెలికో ...

ooo

(తెలుగు తూలిక 11-23- 09)

# 15. కోపం

"ఎన్నిసార్లు చెప్పాలి ఈ నెంబరు పిలవొద్దని," కాంతం గట్టిగా అరిచి ఫోను పెట్టేసింది.

ఆవిడకి పట్టలేనంత కోపం వచ్చింది. ఒళ్లు పొట్లకాయలా పగిలిపోడానికి సిద్ధంగా వుంది. మామూలుగా కాంతం శాంతమూర్తే. ఆ మాటే చాలామంది అంటారు కూడాను "మీరెప్పుడూ ఎంచక్కా నవ్వుతూ వుంటారు. మీకు కోపం రాదాండీ?" అని. కాని టెలిమాక్కెటర్ల దగ్గరకొచ్చేసరికి మాత్రం ఉగ్ర నరసింహమూర్తి. కాంతానికి పట్టరానంత కోపం తెప్పించేవారిలో తొలివరస జనాలు టెలిమార్కెటరులు. ఎన్నివిధాల ఎన్నిభాషల్లో ఎన్ని స్వరాల్లో విన్నవించుకున్నా పట్టు విడువని భట్టివిక్కమార్కులు. అందుకే నిస్సిగ్గుగా వాళ్లమీద అరవడం అలవాటు చేసుకుంది. అప్పుడప్పుడు అవాచ్యాలు కూడా తెలుగులోనూ, సంస్కృతంలోనూ, ఇంగ్లీషులోనూ విసుర్తూ వాళ్లని వదిలించుకోడానికి నానా అవస్థలు పడుతోంది. ఆ చిరాకుతో పావుగంటసేపు మరే పని చెయ్యలేకపోతోంది. పరిష్కరించుకోలేని చిక్కుసమస్య అయిపోయింది.

అలాటి సుదినాలలోనే ఒకరోజు ఇండియానించి తమ్ముడు ఫోన్ చేశాడు కూతురిపెళ్లి నిశ్చయం అయింది రమ్మని. కారణంలేపైతేనేం ఒకటిన్నర దశాబ్దం అయింది ఇండియా వెళ్ళి. అంచేత ఓమారు వెళ్లొస్తే బావుణ్ణనిపించింది. టెలిమార్కెటర్లే కారణం అనడానికి లేదు కాని ఆ సొద కొన్నాళ్లపాటు తప్పుతుంది కదా అనుకుని సంతోషించకపోలేదావిడ.

అలా కాంతం ఇండియా ప్రయాణం నిర్ణయం అయిపోయింది. తను హైదరాబాదు ఎయిర్‌పోర్ట్‌కి రాలేను కాని జోగిబాబుని పంపిస్తానని వుత్తరం

రాశాడు తమ్ముడు. కాంతానికి ఈ "జోగిబాబు" ఎవరో అర్థం కాలేదు కాని ఎవరో ఒకరు వస్తారు కదా అని తృప్తి పడి వూరుకుంది.

కాంతం హైదరాబాదులో దిగి, కష్టములవారిచేత అవుననిపించుకుని బయట పడేసరికి గంటన్నర పట్టింది. అప్పటికి అర్థరాత్రి దాటింది. జోగిబాబుని సుళువుగానే గుర్తు పట్టింది. చాలా పెద్దమనిషి తరహాగా వున్నారాయన. చేయెత్తు మనిషి, పూర్వకాలపు పద్ధతిలో పంచె, లాల్చీ, కండువా ధరించి, నుదుట చిన్న కుంకుమబొట్టుతో చొక్కాలూ, పాంట్లూ వేసుకున్నవారిమధ్య విలక్షణంగా వెలిగిపోతున్నారాయన. ఆయనకి కాంతాన్ని గుర్తు పట్టడం కూడా అంత తేలికా అయింది. ఎంత తెలుగువారి ఆడపడుచైనా అమెరికాలో పదిహేనేళ్ల నివాసంతాలూకు కళల మూలాన ఇట్టే తెలిసిపోతోంది విదేశీ వాలకం. అలా ఇద్దరూ ఒకర్నొకరు పోల్చీసుకున్నాక, బయటికి నడిచారు. చక్రాలున్న సూట్‌కేసుని ఇలా తే అని కాంతానికి సంజ్ఞ చేసి అందుకున్నారాయన ఫరవాలేదండి అంటున్నా వినిపించుకోకుండా.

ఇద్దరూ ఎక్కేక ఆటో బయల్దేరింది. ఇటు పోనిస్తావేం, ఇక్కడెందుకు ఆపేవు, అంటూ ఆయన ఆటోడ్రైవరుతో దారిపొడుగునా వాదిస్తూనే వున్నారు. దారి ఆటోడ్రైవరుకి తెలీదో జోగిబాబుకి తెలీదో కాంతానికి అర్థం కాలేదు.

ఆటో బిష్‌గారి కాంప్లెక్స్‌ముందు ఆగింది. బిష్ గారి ఫ్లాటంతా అమెరికన్ పరిమళాలు విరజిమ్ముతోంది.

విష్ణువర్ధనమూర్తి వురఫ్ బిష్ పదేళ్లకిందట ఒక ఏడాదిపాటు అమెరికాలో వుండి వచ్చాడట. ఆరేళ్లక్రితం జీనీ వురఫ్ సరోజినితో పెళ్లయింది. ఆవిడ అమెరికా వెళ్లలేదు కాని బిష్ ఆవిడకి అమెరిన్ జీవనసరళి పాఠాలు గట్టిగా చెప్పేశాడు పెళ్లయిన మర్నాడే కూచోబెట్టి. ఇంటినిండా ప్లాస్టిక్ ఫోర్కులనలనించి పాప్ సీడీలవరకూ, కార్నింగ్వేర్ (జోగిబాబు భాషలో పింగాణీ బొచ్చెలు) మొదలు

టార్గెట్ స్టోరులో కొన్న దుప్పట్లవరకూ ఆ యింట్లో గతదశాబ్దం అమెరికానాటి ఫేషనులన్నీ కనిపిస్తున్నాయి.

కాంతం జోగిబాబు వెనకాలే హాల్లో అడుగెట్టి అయోమయంగా చూడసాగింది. జోగిబాబు సూట్‌కేస్‌తో కుడిపేపున్న చిన్నగదిలోకి దారితీసారు. కాంతం అటూ ఇటూ చూసి, ఎదురుగా వున్న సోఫాఅంచున బిక్కుబిక్కుమంటూ కూర్చుంది. ఓ అరగంటయినతరవాత జోగిబాబు వచ్చి "పద, పడుకో" అన్నారు. కాంతం మాటాడకుండా అటు కదిలింది. అప్పటికి టైం మూడవుతోంది. కాంతం పడుకుంది కాని నిద్ర పట్టలేదు.

ఆరవుతూంటే అవతలగదిలో మనుషుల అలికిడి విని, తను కూడా లేచింది.

జోగిబాబు వంటింట్లో ఫిల్టరులో నీళ్లు కాచి పోసి, కాంతానికి బాత్రూం చూపించారు.

జీనీ కూడా లేచినట్టుంది పడగ్గదిలోంచే, "బంటూ, టైమయిపోతోంది," అంటూ కేకేసింది.

కాంతం వులిక్కిపడింది ఆ కేకకి.

జీనీ మరో రెండు రౌండులు ప్రసారం చేసినతరవాత, బంటు అదే స్థాయిలో అరిచాడు, వస్తున్నానని. ఆ తరవాత గంటలోనూ, ఆ పిల్లాడిని స్కూలికి సిద్ధం చెయ్యడం జోగిబాబు వంతు. ఆయన మాటలు "స్నానం చెయ్యి," "టిఫినుకి రా", "నీసంచి ఏదీ"- లాటివి ఆ పిల్లాడికే కాదు పక్కవాళ్లకి కూడా వినిపించి వుంటాయి అనిపించింది కాంతానికి. మొదట ఒకటి రెండుసార్లు వులిక్కిపడింది కాని త్వరలోనే అలవాటయిపోయింది. ఆ హడావుడిలో తానూ జీనీ పలకరించుకోడంలాటిది జరగలేదు.

ఎయిర్‌పోర్ట్ నించి ఇక్కడికెందుకొచ్చారో, గుంటూరుకి రైలెప్పుడో కాంతానికి జోగిబాబు చెప్పలేదు. తానే అడగడానికి బెరుగ్గా వుంది. జోగిబాబు

పన్నెండుగంటలకి బయటికెళ్లి ఆరుగంటలకి వచ్చారు. మొత్తమ్మీద ఆయన మామూలుగా మాటాడ్డం వినలేదు తను. అసలు ఆయనే కాదు ఆ యింట్లో ఎవరికీ "నార్మల్ వాయిస్" వున్నట్టు లేదు. అందరివీ కాకలీస్వనాలే! ౯౦ డెసిబెల్స్‌కి పైమాటే!

సాయంత్రం జీనీ ఆఫీసునించి రాగానే తిన్నగా వంటింట్లోకి వెళ్లి టీ పెట్టి, కాంతానికీ, జోగిబాబుకీ చెరో కప్పు అందించి, పడగ్గదిలోకి వెళ్లిపోయింది. పదినిముషాల తరవాత "బంటూ, కమాన్. హరీఅప్," అంటూ కేకేసి, ఏ గోడకో చెప్తున్నట్టు, "ఇదొక్కటే నేను వాడితో గడపగల సమయం" అంది ఇంగ్లీషులో.

"నువ్వు కూడా వెళ్లు," అన్నారు జోగిబాబు కాంతంతో.

"ఎక్కడికి?"

"పార్కుకి."

జీనీమాట ఆయన విన్నారో, లేదో, ఆయనకి అర్థం అయిందో లేదో కాంతానికి అర్థం కాలేదు. ఆవిడ పిల్లాడితో గడిపే సమయం అంటుంటే, తను వెంటబడడం ఏంబావుంటుంది. పైగా, "మీరూ రండి" అని ఆవిడ అన్లేదు.

కాంతం మాటాడలేదు, కదల్లేదు.

"లే, వెళ్లమంటే, కదలవేం?" కసురుకున్నారాయన.

"తలనొప్పిగా వుంది. పడుకుంటాను" అనేసి పక్కగదిలోకి వెళ్లి, తలుపేసుకుంది.

ఒకరోజంతా గడిచిపోయింది. తాము గుంటూరు ఎప్పుడు వెళ్తారో, అసలు వెళ్తారో వెళ్లరో కూడా తెలీడంలేదు ఈయనగారి వరస చూస్తూంటే.

ఆఖరికి తనే తెగించి, "గుంటూరికి రైలెన్నిగంటలకి?" అని అడిగింది.

"రైళ్లకేమిటి చాలా వున్నాయి." అన్నారాయన.

"మనం ఏ రైల్లో వెళ్తాం?"

"ఏం. ఇప్పుడే వెళ్తావా? పద, రైలెక్కించేస్తాను." అన్నారాయన కసురుకుంటూ.

కాంతం తెల్లబోయి, తేరుకుని, "అది కాదు," అంటూ నసిగింది.

ఇంటావిడకి తనరాక చిరాగ్గావుందన్న సంగతి స్పష్టంగానే తెలుస్తోంది. జోగిబాబుకి అది అర్థం అయిందా, లేదా, అవనట్టు నటిస్తున్నారా అన్నదే తెలీడం లేదు.

చిన్ననాటి స్నేహితురాలు రాధ వుందీ ఊళ్ళోనే. పోనీ వాళ్లింటికెళ్లి ఓ పూట గడిపినా బావుండునని వుంది. కాని ఎలా? జోగిబాబుని అడగాలి. ఆయనతో మాటాడడమే ఒక యజ్ఞం.

ఆఖరికి గుండె చిక్కబట్టుకుని, "ఈవూళ్లో మా స్నేహితురాలుంది," అంది ఆయనతో.

ఆయన సరేనన్నట్టు తలూపేరు. ఓ గంట తరవాత "వాళ్లెక్కడుంటారు?" అని అడిగారు.

బంజారాహిల్స్ అని తెలుసు కానీ వివరాలు తెలీవు. "ఫోన్నెంబరుంది" అంది. తీరా పిలిస్తే ఆ నెంబరు పనిచేయుట లేదు అని వచ్చింది వార్త.

"మీస్నేహితురాలి ఇంటాయన పేరేమిటి?"

"సుబ్బారాయుడు". అప్పటికి సంభాషణ అంతే. ఆతరవాత బయటికి వెళ్లి రాత్రి తొమ్మిదిగంటలకి వచ్చారు.

"సుబ్బారావునెంబరు కనుక్కోబోతే, ఆ పేరుతో డైరెక్టరీలో పాతిక వున్నాయి." అన్నారాయన కాంతంతో.

"సుబ్బారావు కాదండీ. సుబ్బారాయుడు."

"సరిగ్గా చెప్పకపోతే నాకెలా తెలుస్తుంది?"

"నేను సుబ్బారాయుడనే చెప్పానండీ" అంది కాంతం నెమ్మదిగా.

"నేను మందబుద్ధిని. నాకు స్పష్టంగా చెప్పాలి. నీకు తెలుగు అర్థం అవుతుందా?" అన్నారాయన విసురుగా.

కాంతం తెల్లబోయి, వూరుకుంది. ఎందుకొచ్చిన సంత. మాటకి మాట తెగులు ....

మొత్తంమీద మర్నాటి సాయంత్రానికి కనుక్కున్నారు. ఈ లోపున కనీసం పదిసార్లు జోగిబాబు కాంతం తెలుగు భాషాజ్ఞానంగురించి ప్రశ్నించారు. ఆఖరికి అసలు ఆయనకి తెలుగు వచ్చునా అని అనుమానం వచ్చింది ఆవిడకి. తనే కాదు ఎవరు చెప్పిందీ ఆయన వినిపించుకుంటున్నట్టు లేదు.

బిష్ ఏ కళనున్నాడో, ఫోను తీసి, మరెవర్నో పిలిచి సుబ్బారాయుడు నెంబరు కనుక్కుని, వాళ్లని పిలిచి, ఫోను జోగిబాబుకి అందించాడు. ఆయన కాంతంగురించి చెప్తే వాళ్లు మర్నాడు రమ్మన్నారు. "పది గంటలకల్లా వచ్చెయ్యండి. కబుర్లు చెప్పుకుని, భోంచేసి వెళ్దురుగాని," అన్నాడు సుబ్బారాయుడు చనువుగా. రెండుగంటలకి వాళ్లు మరెక్కడికో వెళ్లాలిట.

రాధ తొమ్మిదిగంటలకే తయారయిపోయింది కాని జోగిబాబు పదిన్నరవరకూ తెమల్లేదు. "బయటికి వెళ్తున్నారు కదా, మా చంద్రంయింట్లో ఈ సీడీలు ఇచ్చేసిరండి," అంది జీనీ, ఉదయం ఆఫీసుకి బయల్దేర్తూ.

"ఇన్నాళ్లెందుకు పెట్టుక్కూచున్నావూ?" అన్నారాయన సీడీలు సంచీలు పడేసుకుంటూ. ఆ మాట 'అనలేదు' తనకలవాటైన పై స్థాయిలో చెప్పేరు. కాని ఎవరూ పట్టించుకున్నట్టు లేదు.

ఇద్దరూ బయల్దేరి, ఆటోస్టాండుకి వెళ్తే, అక్కడ ఒక్కటే ఆటో వుంది.

మలక్‌పేట వెళ్లి ఓ పదినిముషాలాగి , బంజారా హిల్స్ వెళ్లాలి అన్నారు.

బంజారాహిల్స్ ఇటూ, మలక్‌పేట అటూ కదా అన్నాడు ఆటోడ్రైవరు హిందీలో. ఆ తరవాత వాళ్లిద్దరూ హిందీలో కొంతసేపు వాదించుకున్నారు. కాంతం ఫారిన్‌సినిమా చూస్తున్నట్టు వాళ్లని చూస్తూ నిలుచుంది, జోగిబాబు

"ఎక్కు" అనేవరకూ. దాదాపు అరగంట ఆటోలో తిరిగింతరవాత అర్థమయింది తాము మలక్‌పేట ముందు వెళ్తున్నట్టు. తాననుకున్నట్టు రాధ యింటికి పదిగంటలకి కాదుసరికదా పన్నెండుకైనా చేరుకుంటామో లేదో అనుకుంది.

మలక్‌పేటలో చంద్రం చాలా ఆనందపడిపోయింది జోగిబాబుని చూసి. ఎంతకాలానికి, ఎంతకాలానికి అంటూ ఎంతో మురిసిపోయింది. అమెరికానించి వచ్చిన కాంతం అంటే మరీ సరదా పడిపోయి, భోంచేసి వెళ్లండి అంది.

జోగిబాబు "ఎందుకండీ మీకు శ్రమ," అన్నారు నెమ్మదిగానే (ఆశ్చర్యం).

"లేదండీ, నాస్నేహితురాలికి వస్తాం అని చెప్పేం," అంది కాంతం ధైర్యం చేసి, జోగిబాబు శాంతంగా వున్నందుకు రవంత ఆశ్చర్యపోతూ.

"వంటయిపోయింది. ఎంతసేపు. తినేసి వెళ్లిపోండి," అందావిడ.

కాదండీ అనబోయింది కాంతం.

"వంటయిపోయింది అంటుంటే ఆవిడ పోతాం, పోతాం అంటూ గోలపెడతావేమిటి,"

"రాధ మనల్ని... "

"నీకు తెలుగర్థం అవుతుందా" ఆయన మళ్లీ అరిచారు.

కాంతం నోరు ఠక్కున మూతబడింది. తనకి తెలుగు బాగానే అర్థం అవుతుంది కాని అర్థం కానిది ఈయనగారి వ్యవహారమే.

చంద్రం "వంటయిపోయింది" అన్నతరవాత వాళ్లని ముందు హాల్లో కూచోమని చెప్పి, పొయ్యిమీద కుక్కరులో పప్పూ, అన్నం పడేసి, పక్కవీధిలో కూరలు కొనుక్కురావడానికి వెళ్లింది. అంతసేపూ, వీళ్లిద్దరు హాల్లోనే కూచున్నారు. జోగిబాబు చంద్రం జీవితచరిత్ర చెప్పడం మొదలుపెట్టాడు. కాంతానికి సగం అర్థం అయింది, సగం కాలేదు. కాని ఏం అడగాలనిపించలేదు. వింటున్నట్టు మొహం పెట్టుకు కూచుంది రాధని గురించి ఆలోచిస్తూ.

అక్కడ భోజనాలవుతూండగా, మాటలసందర్భంలో రాధప్రసక్తి వచ్చింది.

"బంజారా హిల్సా? మా పింతల్లికూతురు అక్కడే వుంది. పాపం, ఈ మధ్య అల్లుడు పోయాడు. ఓమారు చూసొద్దాం అనుకుంటున్నాను కాని పడ్డమే లేదు," అంది చంద్రం.

"రండి. మేం అటే వెళ్తున్నాం కదా" అన్నారు జోగిబాబు.

కాంతం గుండె మరో రెండడుగులు దిగజారిపోయింది.

భోజనాలు ముగించుకు చంద్రంతో కదిలేసరికి టైము రెండున్నర.

కాంతం ఏం చెప్పబోయినా, జోగిబాబు కసురుకోడం, "నీకు తెలుగర్థంవవుతుందా?" అంటూ సతాయింపు.

చంద్రం వద్దంటున్నా వినకుండా ఆవిడతో వాళ్ల పినతల్లికూతురు ఇంటిగుమ్మంవరకూ వెళ్లారు. ఆ పినతల్లికూతురు రండి రండి అంటూ ముగ్గుర్నీ ఆహ్వానించింది. అక్కడ మళ్లీ మరో గంటన్నర.

సరే వెళ్తాం అంటూ జోగిబాబూ, కాంతం లేవబోతుంటే, వాళ్లతోపాటు చంద్రం కూడా లేచింది. కాంతానికి అయోమయంగా వుంది కాని మాటాడలేదు.

రాధ కాంతాన్ని చూడగానే పరమానందపడిపోయింది. "సారీ, ఆలస్యం అయింది. మీరిద్దరూ ఎక్కడికో వెళ్లాలేమో," అంది కాంతం కళ్లు చిట్లించి.

"ఫరవాలేదు లెద్దూ. పనులెప్పుడూ వుంటూనే వుంటాయి."

హాల్లో జోగిబాబూ, చంద్రం, సుబ్బారాయుడూ, మాటాడుతూ కూచున్నారు కొంచెంసేపు. కాంతానికి  చిన్ననాటి ముచ్చట్లు రాధతో కలబోసుకోవాలని వుంది కాని అందరూ గలగల మాటాడుతుంటే తనకి మాట తోచడం లేదు. తనకోరిక తీరేలా లేదు. పావుగంటయిందేమో, జోగిబాబు లేచారు, పద అంటూ. కాంతానికి స్నేహితురాలితో గడిపినట్టే లేదు.

రాధ కూడా "అదేమిటండీ, ఇప్పుడే కదా వచ్చారు. మధ్యాన్నం భోజనానికి వస్తారనుకున్నాం. ఎలాగా రాత్రి భోజనాలటైం అవుతోంది. కూచోండి. భోంచేసి వెళ్దురు గాని" అంది.

జోగిబాబు విసుక్కుంటారేమో అనుకుంది కాంతం. ఆయన వినిపించుకున్నారో లేదో, చిన్నదగ్గు దగ్గి, గుక్కెడు నీళ్లు తాగి, సుబ్బారాయుడితో మరేదో చర్చ మొదలెట్టారు. కాంతం బతుకు జీవుడా అనుకుని, రాధతో వంటింటివేపు దారితీసింది.

భోజనాలబల్ల దగ్గర కూడా అదే తంతు.

రాధ నాలుగు కంచాలు పెట్టి, వడ్డించింది. "మీరు కూడా కూచోండి" అంటూ జోగిబాబు పదే పదే చెప్పడంతో సుబ్బారాయుడికీ కాంతానికీ మధ్య మరో కుర్చీ లాక్కుని కూచుంది.

జోగిబాబు అన్నం మారు వడ్డించుకోబోతే, గరిటెతోపాటు గిన్నె కూడా జరిగింది. సుబ్బారాయుడు గిన్నె పట్టుకున్నాడు కదలకుండా.

"అఖ్కర్లేదు వదలెయ్యండి," అన్నారు జోగిబాబు తల విసుర్తూ.

"అన్నం వేడిగా వుంటే తేలిగ్గా వస్తుంది గరిటెకి. చల్లారిపోయింది కదా."

"ప్చ్. మీరు పట్టుకోనక్కర్లేదంటుంటే."

సుబ్బారాయుడు కాంతంవేపు చూసి గిన్నె వదిలేశాడు. తనకా చూపు బలంగా తగిలింది. చిరాకేసింది. గిన్నె కదలకుండా పట్టుకున్నంత మాత్రాన ఆయనగారి పరువేం పోయిందో అర్థం కాలేదు. అంత చిన్నవిషయానికి కూడా విసుక్కోవాలా? ఆ మాటే అడుగుదాం అనుకుంది కాని పొరుగింట్లో మళ్లీ రభస ఎందుకని వూరుకుంది.

భోజనాలయాక, రాధతో పాటు గిన్నెలు వంటింట్లో పెడుతూ, ఆ మాట అనకుండా వుండలేకపోయింది.

"జోగిబాబుగారికి కోపం ఎక్కువ. మీఆయన ఏమనుకున్నారో ఏమిటో."

రాధ తేలిగ్గా నవ్వేసింది.

"ఏం, నీకేమీ అనిపించలేదా, అన్నంగిన్నెమీద చెయ్యేసినందుకు అలా విసుక్కుంటే?" అంది కాంతం మళ్లీ.

"నీకు అమెరికానీళ్లు బాగా ఒంట బట్టినట్టున్నాయి. ఇక్కడ మనవాళ్ల తీరుతెన్నులు మర్చిపోయేవు. మేం ఈ కసుర్లూ, విసుర్లూ సీరియస్‌గా తీసుకోం. ఎవరి కోపతాపాలు వారివే. "

"నీకాయన్ని తెలుసేమిటి?"

"ఆయనే్న తెలియక్కర్లేదు. మా మామగారున్నారు చూస్తున్నాను కద. హెడ్‌మాస్టరుగా చేసి రిటైరయారు. పదేళ్లయింది. ఇప్పటికీ ఆయనకి మనం అందరం తొమ్మిదోక్లాసు పిల్లల్లాగే కనిపిస్తాం. ఆయన బోధించేవారూ, మనం బోధింపబడేవాళ్లమూను. ఏంచేస్తాం. కొందరి తత్త్వాలు అవీ. ఆయన చెప్పేవి ఆయన చెప్తుంటారు. మనం చేసేవి మనం చేస్తూంటాం. గిన్నె కదలకుండా పట్టుకోడంలాటివి సమయాన్నిబట్టి ... పట్టుకున్నా ఒకటే, ఒదిలేసినా ఒకటే. అదేదో అంతర్జాతీయ సమస్యలా బాదపడిపోతున్నావు నువ్వు," అంది రాధ నవ్వుతూ.

"అత్తెసరు మార్కులతో క్లాసు మీద క్లాసు తోసుకుంటూ వచ్చావు. నీకింత తెలివితేటలెలా వచ్చాయి?" అనేసి, వెంటనే నాలుక్కరుచుకుంది కాంతం.

రాధ మళ్లీ అదే నవ్వుతో, "ఫరవాలేదులే. నేనేం అనుకోను. చెప్పాను కదా. ఇక్కడ మేం పెద్దవిషయం, చిన్నవిషయం కూడా జానేదేవ్ అనేసి, వూరుకుంటాం. అన్నీ తేలిగ్గానే తీసుకుంటాం. మమ్మల్నేవీ బాధించవు. అక్కడ మీరేమో take it easy అంటారు, ఒట్టి మాటలే," అంది హేళన చేస్తున్నట్టు కళ్లు చిట్లించి.

కాంతం కళ్లు విప్పారాయేయి. తృటికాలం చిన్ననాటి స్మృతులు గుప్పున ఎగిశాయి వారి మనోఫలకంమీద.

చంద్రంగారిని మలక్‌పేటలో వాళ్లింట్లో దింపి, ఇల్లు చేరేసరికి రాత్రి పదకొండు.

నిద్ర కళ్లతో జీనీ హాల్లోకొచ్చి మీకోసం అన్నం వండేను అంది నిష్ఠూరంగా. కాంతం గబుక్కున చిన్నగదిలోకి వెళ్లి తలుపేసుకుంది వారి సంభాషణ వినే ఓపిక లేక.

ooo

ఇది ఆర్నెల్లనాటి మాట. ఇండియానించి తిరిగొచ్చింతరవాత ఇంతవరకూ కాంతం మళ్లీ ఎవరిమీదా అరవలేదు. ఆశ్చర్యం, టెలిమార్కెటర్లమీద కూడా. వాళ్ల తత్త్వం అదీ అనుకుంటుందిప్పుడు.

ooo

(ఈమాట.కాంలో ప్రచురితం. మే 2006)